# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 20 సంచిక : 2 హైదరాబాద్ 243 ఫిబ్రవరి 2022 పేజీలు : 68 రు. 25

- చట్టుబండలవుతున్న చట్ట సభలు
- స్థానికతను పాతర వేసిన జి.ఓ. 317
- అసంబద్ధ వేతన సవరణ - ఆందోళన
- సుధా భరద్వాజ్ ఇంటర్వ్యూ
- నూతన శ్రామిక చట్టాలు-సునాయాస వ్యాపారం
- 'రాజ్యం లోపలి రాజ్యం' పూర్వాపరాలు
- చిలే రాజకీయ పరిణామాలు

243 ISSN 2231-6892

# వీక్షణం
రాజకీయార్థిక, సామాజిక మాస పత్రిక

ఫిబ్రవరి 2022
సంపుటి : 20
సంచిక : 02







'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫోన్ : 7330795849
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : నవ్య ప్రింటర్స్
అంబర్‌పేట్, హైదరాబాద్.

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌పై **'VEEKSHANAM'** అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్–**013911011002175** యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **IFSC code :UBIN0801399** నెంబర్‌తో పాటు మీ పేరు కూడా రాసి వేయాలి.

*వీక్షణం ఆర్థిక పరిస్థితిని వివరిస్తూ చేసిన విజ్ఞప్తికి స్పందిస్తూ వీక్షణంను నిలబెట్టుకోవాలనే తపనతో ఆర్థిక సహాయం అందించిన కె. భాస్కర్, స్పర్శ హాస్పిటల్, ఖమ్మం – రు. 3,500; ఎం. రామారెడ్డి, హైదరాబాద్ – రు. 50,000; వంగల సంపత్‌రెడ్డి, వరంగల్ – రు. 2,000, మిత్రులకు కృతజ్ఞతలు – సం.*

*వీక్షణం ఇరవయవ జన్మదిన ప్రత్యేక సంచిక (జనవరి 2022) నిజంగా ప్రత్యేక సంచిక లాగ, చాల మంచి వ్యాసాలతో ఉంది. ముఖ్యంగా అర్థశాస్త్రవేత్త కృష్ణా భరద్వాజ్ గారు రాసిన 'సామాజిక మార్పును విశ్లేషించడం ఎలా?' వ్యాసం చాల బాగుంది. సమాజం గురించి ఆలోచించేటప్పుడు ఎన్ని విషయాలు పరిశీలించవలసి ఉంటుందో, సరైన దృక్పథం ఎట్లా తయారవుతుందో రచయిత చాలా బాగా వివరించారు. ఈ వ్యాసం పది సంవత్సరాల కింద మొదట వీక్షణంలో అచ్చయిందని, ఇప్పుడు పునర్ముద్రిస్తున్నామని అన్నారు. అప్పుడు చదవలేకపోయిన మా లాంటి వారికి ఇటువంటి పునర్ముద్రణలు ఉపయోగపడతాయి. ఇకముందు కూడ పాత వ్యాసాల లో నుంచి మంచి వ్యాసాలు ఎంపిక చేసి ఈ విధంగానే అచ్చువేయగలరు. ఈ వ్యాసం ఆమె పుస్తకం నుంచి మొదటి ఉపన్యాసానికి అనువాదం అని నోట్ రాశారు. మరి ఆ పుస్తకంలో ఇంకా ఎన్ని ఉపన్యాసాలున్నాయి? అవన్నీ కూడ అనువాదం చేసి, వీక్షణంలో గాని, పుస్తకంగా గాని అచ్చువేస్తే బాగుంటుందని సూచన.*

**– ఎ. యాదగిరి**
*హనుమకొండ*

*ఉత్తరం మీద ఉత్తరం రాయటం మంచిదో కాదో, మీరు అచ్చువేస్తారో లేదో నాకు తెలియదు. కాని జనవరి సంచికలో మీరు అచ్చు వేసిన ఎస్. ఆలోచన గారి ఉత్తరం చదివితే నాకు ఆ ఉత్తరం మీద ఉత్తరం రాయాలని అనిపిస్తున్నది. ఆమె గారు అంత తీవ్రంగా ఖండించిన లింగమూర్తి గారి ఉత్తరం ఏమిటా అని డిసెంబర్ సంచిక తీసి మళ్లీ చదివాను. ఆమె లింగమూర్తి గారి మీద విరుచుకుపడ్డారు గాని, నాకైతే లింగమూర్తి గారు వేసిన ప్రశ్నలకు ఆమె గారి దగ్గర జవాబు లేదని అనిపించింది. లింగమూర్తి గారి ఉత్తరంలో వెటకారం ఉంటే ఉండవచ్చు, దాన్ని మనం ఒప్పుకోక పోవచ్చు. కాని అసలైన ప్రశ్నలు కొన్ని ఉన్నాయి. 1. సోవియట్ యూనియన్ ఉదాహరణ ఇప్పుడు వరిస్తుందా లేదా? 2. భూమి బల్లపరుపుగా ఉన్నదనే వాదనకు అవకాశం ఇవ్వటం ప్రజాస్వామిక చర్చలో భాగమేనా? 3. మంత్లీ రివ్యూ వైఖరి ప్రామాణికమవుతుందా? 4. కోటీశ్వరులు కమ్యూనిస్టు పార్టీలో చేరవచ్చునా? ఆలోచన గారు ఈ నాలుగు ప్రశ్నలు ఆలోచించకుండానే కత్తి దూయడానికి సిద్ధమైనట్టున్నారు. సోవియట్ యూనియన్ రంగు 1956 సిపిఎస్ యు ఇరవయవ మహాసభలోనే బైటపడిపోయింది. తర్వాత పది సంవత్సరాలు గ్రేట్ డిబేట్ నడిపి, సాంస్కృతిక విప్లవం కూడ నడిపి, ఆ క్రమంలో సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ పాలనలో ఉన్నదేశం కాదని, అది పేరుకే కమ్యూనిస్టు పార్టీ అని, అది సోషల్ సామ్రాజ్యవాద దేశమని చైనా కమ్యూనిస్టు పార్టీ సూత్రీకరించింది. దాన్ని ప్రపంచంలో ఎందరో ఆలోచనాపరులు అంగీకరించారు. ఇప్పుడు చైనా భజన చేస్తున్న వారిలో కొందరు కూడా ఆ చరిత్రలో భాగస్వాములే. అయినా 1989 వరకూ కూడ సోవియట్ యూనియన్ సోషలిస్టు దేశమేనని, అది కమ్యూనిస్టు పార్టేనని సిపిఐ, సిపిఎంలు ఇక్కడ భజనలు చేస్తుండేవి. చైనా విషయంలో మావో మరణానంతరం, డెంగ్ సియావో పింగ్ కొన్నాళ్లు వెనుక నుంచి, కొన్నాళ్లు బహిరంగంగా చైనా కమ్యూనిస్టు పార్టీ పగ్గాలు చేతుల్లో పెట్టుకున్న తర్వాత అక్కడ పెట్టుబడిదారీ పునరుద్ధరణ మొదలైందని, ఎంతో మంది విశ్లేషకులు వ్యాసాలు, పుస్తకాలు రాశారు. చర్చోపచర్చలు జరిగాయి, జరుగుతున్నాయి. 1956 తర్వాత సోవియట్ యూనియన్ లో పెట్టుబడిదారీ పునరుద్ధరణ జరిగిందనేది ఎంత వాస్తవమో, 1976–78 తర్వాత చైనాలో పెట్టుబడిదారీ పునరుద్ధరణ జరిగిందన్నది అంతే వాస్తవం. పట్టపగటి వెలుగంత స్పష్టమైన విషయం. అయినా సోవియట్ యూనియన్ గురించి సిపిఐ చేసినట్టుగా చైనా గురించి భజన చేయడానికి కొందరు సిద్ధంగా ఉన్నారు. లింగమూర్తి గారు ఈ పోలిక చూపి ఎందువల్ల అని అడిగారు. ఆలోచన గారి దగ్గర జవాబు లేదు. 2. ఆశ్చర్యంగా ఆలోచన గారు భూమి బల్లపరుపు ప్రశ్నకు జవాబుగా భూమి గుండ్రంగా లేదని, అంచుల్లో నొక్కుకుపోయి ఉందని శాస్త్రవిజ్ఞానం పాఠం చెప్పారు. అక్కడ లింగమూర్తిగారు వేసిన ప్రశ్న నాకు అర్థమైనంతవరకు భూగోళపు నొక్కుల గురించి కాదు, ఒక పచ్చి అబద్ధాన్ని, సొంత ఊహను, తలకిందుల వ్యవహారాన్ని చర్చకు పెడుతున్నాను అంటే అది ప్రజాస్వామిక చర్చే అవుతుందా అని ఆయన ప్రశ్న వేశారు. అవును, దేవుడు ఉన్నాడు అని మేం మొండిగా అంటూనే ఉంటాం, మీరు ప్రజాస్వామికంగా చర్చించండి అనే ఆలోచన ముందుకు తేవడానికి ఆలోచన గారికి హక్కు ఉంది. కాని వీక్షణం పేజీలను అందుకు వ్యర్థం చేయటం సరైనదేనా అని లింగమూర్తి గారు సంపాదకులను ప్రశ్నించారు. 3. మంత్లీ రివ్యూనో మరొక పత్రికో చెప్పారు గనుక అంగీకరించాలి అనే వాదన సరైనదేనా అని లింగమూర్తి గారు ప్రశ్నించారు. మంత్లీ రివ్యూను ప్రామాణికమని తాము ఎందుకు చెపుతున్నామో వివరణ ఇచ్చే బదులు, ఆలోచన గారు "160 దేశాల, 500 రాజకీయ పార్టీల" అని మరొక జాబితా చదివారు. సోవియట్ యూనియన్ ను కూడ ఆ రోజుల్లో ఇట్లాగే వందలాది దేశాల రాజకీయ పార్టీలు భజనలతో ముంచెత్తాయని, ఆలోచన గారి పూర్వీకులు ఆ భజనలను చెత్తబుట్టలోకి విసిరేశారని చరిత్ర గుర్తు చేయడం తప్ప చేసేదేమీ లేదు. 4. ఇప్పుడు చైనా కమ్యూనిస్టు పార్టీ అనబడేది కోటీశ్వరులకు సభ్యత్వం ఇవ్వడం గురించి ప్రశ్న వేస్తే ఎంగెల్స్ ఉదాహరణ పోటీ పెట్టాలనే ఆలోచనకు ఎట్లా స్పందించాలో కూడ తెలియడం లేదు.*

**– సి రాజ్ కుమార్**
*విశాఖపట్నం*

కోవిడ్ వల్ల పత్రికలలో సాధారణ వార్తలు రావడం లేదు గనుక అసహజ మరణాల సూచి సమగ్రంగా తయారు చేయడం సాధ్యం కావడం లేదు. కొద్దికాలంగా అసహజ మరణాల సూచి వేయలేకపోతున్నందుకు చింతిస్తున్నాం. సం.

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; వరంగల్ – ఓరగంటి ఎల్లయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

# బాధ్యతలెవరివి? హక్కులెవరివి?

"ఈ 75 సంవత్సరాలలో మన సమాజానికి, మన దేశానికి, మనందరికీ ఒక జబ్బు పట్టుకుంది. మనం మన బాధ్యతలనుంచి దూరం జరిగాం. వాటికి ప్రాధాన్యత ఇవ్వలేదు. గడిచిన 75 ఏళ్లలో మనం హక్కుల గురించే మాట్లాడుతూ పోయాం, పోరాడుతూ పోయాం. మన సమయాన్ని వృథా చేసుకున్నాం. కొన్ని సందర్భాలలో, కొంతవరకు హక్కుల సమస్య లేవనెత్తడం మంచిదే కావచ్చు, కాని మన బాధ్యతల గురించి పూర్తిగా నిర్లక్ష్యం చేయడం భారతదేశం బలహీనం కావడంలో పెద్ద పాత్ర వహించింది... హక్కులకు ప్రాధాన్యత ఇచ్చి, బాధ్యతలను వదిలేయడం వల్ల ఈ 75 ఏళ్లలో పోగొట్టుకున్న ఖాళీని రానున్న 25 ఏళ్లలో బాధ్యతలను నెరవేర్చడం ద్వారా పూరించవచ్చు." "రానున్న 25 ఏళ్లను మనం కష్టపడి పనిచేయడానికీ, త్యాగానికీ, పొదుపుకూ, తపస్సుకూ కేటాయించాలి." "హక్కుల పేరు చెప్పి కొందరు అంతర్జాతీయ స్థాయిలో భారత ప్రతిష్టను దిగజారుస్తున్నారు. బ్రహ్మకుమారీస్ వంటి సంస్థలు దేశదేశాల్లో ఈ ప్రచారాన్ని తిప్పికొట్టాలి." – ఇవి ఆజాదీకి అమృత మహోత్సవ్ సందర్భంగా బ్రహ్మకుమారీస్ కార్యక్రమాలను ప్రారంభిస్తూ జనవరి 20న ప్రధాని నరేంద్ర మోడీ అన్నమాటలు. ఇవి యదాలాపమైన, అనాలోచితమైన మాటలు కాదు. హక్కులకూ బాధ్యతలకూ పోటీ పెట్టడం, హక్కుల గురించి మాట్లాడడం వల్లనే దేశం సమయాన్ని వృథా చేసుకుందనీ, అందువల్లనే బలహీనపడిందనీ అనడం, ఇకనుంచి బాధ్యతల మీద మాత్రమే కేంద్రీకరించాలనడం సంఘ్ పరివార్ నమ్మే మనుధర్మానికీ, హిట్లర్ నుంచి ట్రంప్ దాకా ఆధునిక నియంతలందరూ అనుసరించిన పాలనానీతికీ సరిగ్గా సరిపోతుంది. కాని అవి సంఘ్ పరివార్‌కు సహజమైన ప్రలాపాలు అని వదిలేస్తే సరిపోదు, ఆమాటలను లోతుగా అర్థం చేసుకోవలసి ఉంది. ఆ మాటలవెనుక పొంచికూచున్న ప్రమాదాన్ని గుర్తించవలసి ఉంది.

మొట్టమొదట మోడీ అన్న మాటలు పచ్చి అబద్ధాలు. గడిచిన డెబ్బై ఐదేళ్లలో భారత ప్రజానీకం తమ సహజ, నైసర్గిక హక్కులను అనుభవించనే లేదు, కనీసం రాజ్యాంగం హామీ ఇచ్చిన హక్కులనైనా అనుభవించలేదు. ప్రజల ప్రజాస్వామిక, పౌర హక్కులు కాగితాలకు మాత్రమే పరిమితమైపోయిన చరిత్ర గత ఏడున్నర దశాబ్దాలది. భారత సమాజం తాను నిర్వహించవలసిన బాధ్యతల కన్న ఎక్కువ బాధ్యతలు నిర్వహించింది. అపారమైన శ్రమతో సంపదలు సృష్టించి దేశ పాలకవర్గాలు, దేశదేశాల సంపన్నులు దోపిడీ చేయడానికి సమకూర్చి పెట్టింది. మరొకవంక ఈ దేశ పాలకవర్గాలు ప్రజల వనరులను దోపిడీ చేయడమే తమ హక్కుగా భావించి, నిష్పూచీగా దోపిడీ చేస్తూ వచ్చారు. తమను ఎన్నుకున్నందుకు, పన్నుల ద్వారా తమ ఉనికికి రక్షణ కల్పిస్తున్నందుకు, అమాయకంగా తమ దోపిడీని సహిస్తున్నందుకు ప్రజలకు కనీస ప్రతిఫలం చెల్లించే బాధ్యతనైనా పాలకవర్గాలు ఎన్నడూ పాటించలేదు. చివరికి రాజ్యాంగంలో ఆదేశిక సూత్రాలలో రాసి పెట్టుకున్న బాధ్యతలలో శతాంశమైనా అమలులోకి తేవడానికి ప్రయత్నించలేదు. ఒక్కమాటలో చెప్పాలంటే, ప్రజలు తమ బాధ్యతలన్నీ నిర్వర్తించారు, తమ హక్కులను ఎన్నడూ పూర్తిగా అనుభవించలేదు. పాలకులు మాత్రం తమ బాధ్యతలను ఎన్నడూ నిర్వర్తించలేదు. తమకు లేని హక్కులను కూడ అనుభవిస్తూ వచ్చారు. తాము నెరవేర్చని బాధ్యతల గురించి మాట్లాడకుండా ప్రజలు ఇంకా ఎక్కువ బాధ్యతలు నెరవేర్చాలని, త్యాగాలు చేయాలని, పొదుపు చేయాలని ఉద్బోధలు చేయడం, ప్రజల కనీస హక్కులను కొల్లగొడుతూ, హక్కుల గురించి ఆ మాత్రం కూడ మాట్లాడగూడదనడం కచ్చితంగా పాలక కుటిలనీతి.

అంతమాత్రమే కూడ కాదు, హక్కులు మనుషులకు సహజంగా వచ్చేవి. మనిషిగా పుట్టినందువల్ల వినే చెవి, చదివే, చూసే కన్ను, మాట్లాడే నోరు, ఆలోచించే మెదడు ఉన్నాయి. ఆలోచించడం, వినడం, చదవడం, చూడడం, మాట్లాడడం అలా మనిషి నైసర్గిక లక్షణాలు. వాటిని రాజ్యం కొల్లగొట్టగూడదని చెప్పడానికే వాటిని పౌరుల హక్కులుగా రాజ్యాంగాలలో పొందుపరిచారు. రాజ్యాలు వాటిని ఎంతగా కొల్లగొడుతుంటే అంతగా హక్కుల గురించి మాట్లాడడం, పోరాడడం అవసరమవుతుంది. మాట్లాడవద్దనీ, పోరాడవద్దనీ, అసలు హక్కుల గురించి ఆలోచించవద్దనీ అనడమంటే హక్కుల హనన పాలనకు రాజమార్గం తెరవడమే. రాజ్యం లేదా ఆధిపత్య శక్తులు హక్కుల హననానికి పాల్పడకుండా ఆంక్షలు, పరిమితులు విధించాలనేది నాగరికతా ప్రయాణంలో మనుషులు నేర్చుకున్న ఆధునిక విలువలు. నాగరికత, ప్రజాస్వామ్యం, పౌరహక్కులు, రాజ్యాంగం అనే మాటలు సంఘ పరివారానికి కంటగింపని కొత్తగా చెప్పనక్కరలేదు. సంఘ పరివారానికి కాలం చెల్లిన, కుళ్లిపోయిన, అనాగరిక, అప్రజాస్వామిక ఆలోచనలూ ఆధిపత్యాలూ జీవనశైలులూ కావాలి. అత్యంత ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం ఉపయోగించి వాటిని ప్రచారం చెయ్యాలి. 'సంస్కృతి అనే మాట వినబడితే నా చెయ్యి రివాల్వర్ మీదికి పోతుంది' అని చెప్పుకున్న నాజీ అధినేత హెర్మన్ గోరింగ్ లాగ ఆధునిక ప్రజాస్వామ్యానికి సంబంధించిన ప్రతి మాటనూ తూట్లు పొడవడానికే మొత్తంగా సంఘ్ పరివార్, ప్రత్యేకంగా నరేంద్ర మోడీ–అమిత్ షా ద్వయం ఉవ్విళ్లూరుతున్నారు. ఈ దాడి బహుముఖాలుగా సాగుతున్నది. ప్రజల హక్కుల మీద, ఆ హక్కుల కోసం పోరాడుతున్న వారి మీద, భారత హక్కుల హననం గురించి దేశదేశాల్లో ప్రచారం చేస్తున్న స్వచ్ఛంద సంస్థల మీద అత్యంత అభివృద్ధి నిరోధక, జుగుప్సాకరమైన విష విద్వేష ప్రచారం సాగిస్తున్నారు. టెక్‌ఫాగ్ ద్వారా ముస్లిం వ్యతిరేక విష ప్రచారం సంఘ పరివార్ అభివృద్ధి నిరోధక, మధ్యయుగ అనాగరిక వైఖరికి ఒక ముఖం. ఈ విషాన్ని భారత సమాజం నుంచి తొలగించడం సుదీర్ఘకాలపు, కష్టభరితమైన ప్రక్రియ కావచ్చు. కాని ఎప్పటికప్పుడు బహిర్గతపరిచే, వివరించే, ఎదిరించే, విరుగుడు కనిపెట్టే వ్యక్తిగతస్థాయి ప్రయత్నాల నుంచి, ఎన్నికలలో ఈ విషప్రచారకుల్ని ఓడించే సామూహిక ప్రయత్నాల నుంచి, మొత్తంగా సమాజంలో, భావజాలంలో, ప్రతి వ్యక్తి మెదడులో ప్రవేశిస్తున్న ఈ విషాన్ని తొలగించే విశాల, సుదీర్ఘ పోరాటాల దాకా పూనుకోవడమే ఇవాళ దేశ ప్రజలలో ప్రతి ఒక్కరి మీద ఉన్న బాధ్యత. ఆ బాధ్యతను నెరవేర్చకపోతే హక్కులూ మిగలవు, మనుషులుగానూ మిగలం. వీ

**సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ**

# ఎంగిలిపీసు లేకనేనా ఎన్కబడ్డది?

**అ**బ్బ, దొరవారి ఉపాయాలంటే ఉపాయాలు గావు. ఒగదానిమీదోటి అప్సోస్ జేత్తడు. ఇగ గిదేరా అవ్వల్ దర్జా, దీన్ని మించింది ఉండదు అనుకుంటమా, గారడోడు టోపీ బోర్లేసి మల్లొక కొత్త పావురమో పిట్టో దస్తీనో బైటికి దీసినట్టు, తెలంగాణ సర్కారు గూడ ఒగటి మీద ఒగటి జెయ్యబట్టె. ఇయాల్టికియాల కత జూడరాదు. మొన్న మంత్రులు గూసున్నరట. నెలకోపాలో, మూన్నెల్లకోపాలో గూసుంటరు గద. ఎహె, ఎప్పుడు గూసుంటేంది గని, మాట్లాడెటోడు ఒక్కడేనాయె, గణగణ ముచ్చట జెప్తాంటే శెవుల్ల పూలు పెట్టుకోని అరికత ఇన్నట్టు ఇని, పంచె దులుపుకోని లేశి ఒచ్చుడేనాయె. గది గాకుంట ఇంకేమన్నున్నదా? మొన్నటి మీటింగంల మాత్రం ఒక ముచ్చట ఖరారు జేసింద్రట. ఇగ ఈడికెల్లి పాల్దాగే పసి పోరగాండ్ల నించి కాలేజికి బొయ్యే వైసు పోరగాండ్ల దాక అందరికీ సదువు ఎంగిలిపీసుల్నే జెప్పాలె అని ముద్ర గొట్టింద్రట. ఇగ బళ్లల్ల కాలేజిల్ల తెలుగు కనబడొద్దు, ఇనబడొద్దు. తెలంగాణ ఉరికురికి ముందరికి బోవాల్నంటె గదే రస్త అన్నరట. సర్కారు బల్లె ఎంగిలిపీసు లేదు గనుకనే మా పోరగాండ్లను సర్కారు బడికి పంపుతలేం అని తెలంగాణల తల్లిదండ్రులంత జిద్దుకొచ్చింద్రట. ఎంగిలిపీసో రామచంద్ర అని ఒక్కతీర్గ బతిలాడింద్రట. ఇగ కులాలు లేవు, మతాలు లేవు, తెలంగాణ ఆంధ్ర, దచ్చినం ఉత్తరం ఏం తేడాల్లేవు, ఉన్నదొక్కటే ఒకటి ఎంగిలిపీసు వచ్చినోల్లంత ఒక కులం, రానోల్లంత ఒక కులం అని బరాబర్ గిది జమీన్ గిది ఆస్మాన్ అని గీత గీసింద్రట. ఎంగిలిపీసు రాకపోబట్టే మన పోరలు నాదాన్ అయితాండ్రు, కొలువులొస్త లేవు. ఇగ జూస్కో, గిట్ల ఎంగిలిపీస్ నేర్సుకోంగనే గట్ల అందరు సలాములు గొడ్తరు, కుర్శేసి కూసోబెడ్తరు, జప్పున కొలువిస్తరు. ఎవడన్న ఎంగిలిపీస్ ఒద్దంట మాట్లాడిండనుకో, ఎరికేనా, వాడు గవన్ని పాదసాదలకు అందొద్దని సాజిష్ జేత్తాండన్నమాట. గాయినెవలో ముని గంగను బూమ్మీదికి బట్టుకరాలే, గట్ల దొర గూడ తెలంగాణకు నీల్లు తెచ్చిండు, ఇగ గిప్పుడు ఎంగిలిపీసు దెత్తాండు, దాన్ని బట్టుకోని ఎంటెంటనే కొలువులు ఉరికొస్తయి సూడు అని తాన తందాన తాళం గొట్టనే బట్టిరి. అచ్చా, పాదసాదలకు ఎంగిలిపీస్ వద్దా, అంత మీ ఉన్నోల్లకేనా, మీ పెద్దకులపోల్లకేనా అని గుడ రొకాయించబట్టిరి. మస్తుగున్నది బాంచెన్.

కని ఒక్కటి సమజైతలేదు. మా తాతల ముత్తాతల కాన్నించి ఇంటాన, జూత్తాన, ఎక్కడి గొంగడి గక్కడ్నే ఉండె. దొరవారి జాయిదాద్ దొరవారికే ఉండె, ఇంక బెరిగిపాయె. నా శింపులంగి నాకే ఉండె. గదిగుడ పీకుతదేమో అని పరిషాను కాబట్టె. గదంత ఎంగిలిపీసు లేకనేనా బాంచెన్? మా ఊరి బడిలె, సర్కార్ బడే తియి, గోడలు కూలిపాయె. పోరగాండ్ల మీద కప్పు ఎప్పుడు గూలుతదో అని భయపడి సత్తాంటిమి, ఆరుగురు సార్లుండే దెగ్గర, ఇప్పుడు ఇద్దరు సార్లే అయిరి, గదంత ఎంగిలిపీసు లేకనేనా? ఎంగిలిపీసు సదువుకున్న మా అన్న కొడుకు కొలువు రాక పదేండ్లు ఎదిరిసూశి, ఉరి బెట్టుకొని సచ్చిపాయె. ఇంతకు నీ శేతులున్న కొలువులు గుడ ఇయ్యలేదట గద. మరి గయన్ని పక్కకు బెట్టి, ఎంగిలిపీసు తోటి సొర్గం దిగొస్తదని, మోచేతికి బెల్లం రాశి బలే మంచిగ నాకుమంటవు దొరా, ఏమి అవ్వల్ దర్జ ఉపాయం... వీ

**సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్**

# ఉద్యోగ, ఉపాధ్యాయ వర్గాల న్యాయమైన ఆందోళన

**ఎ**రుగుతున్న ధరలతో, విద్యా, ఆరోగ్య, రవాణా, వినోద అవసరాల ఖర్చులు ఇబ్బడి ముబ్బడిగా పెరుగుతుండడంతో వేతనజీవులెవరైనా ఇబ్బందుల్లోనే బతుకుతున్నారు. సంఘటితమైన కార్మిక, ఉద్యోగవర్గాలకు తమ యాజమాన్యాలతో, ప్రభుత్వాలతో బేరసారాలు ఆడుకొని, వేతనాలు ఎంతో కొంత పెంచుకునే అవకాశం ఉంది. అటువంటి సుదీర్ఘ పోరాటాల క్రమంలోనే పెరుగుతున్న ధరలకు అనుగుణంగా మూలవేతనం పైన డియర్నెస్ అలవెన్స్–కరువుభత్యం–చెల్లించడం, కొన్ని సంవత్సరాలకొకసారి వేతన సవరణ సంఘం నియమించి మూలవేతనం లోనే పెరుగుదల ఇవ్వడం ఆనవాయితీ అయింది. ప్రభుత్వాలు పద్ధతి ప్రకారం పని చెయ్యకుండా, వేతన సవరణలను, ఉద్యోగుల సౌకర్యాలను తమ వోటు రాజకీయాలలో భాగంగా మార్చడం మొదలై చాలకాలమే అయింది. ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించినంతవరకు గత ఎన్నికలకు ముందు వేతన సవరణ సంఘాన్ని నియమించారు. ఎన్నికలు గడిచిపోయాక, ఆ సంఘం నివేదిక ఇచ్చి రెండు సంవత్సరాలు కావస్తున్నా దాన్ని బైట పెట్టడం జరగలేదు. ఇప్పుడు ఆ నివేదికను పక్కన పెట్టి కొత్తగా ఒక కమిటీ వేసి, దాని సిఫారసుల ఆధారంగా వేతన నిర్ణయం ప్రకటించారు. ఈ మధ్యకాలంలో ఇస్తూవచ్చిన మధ్యంతర ఉపశమనం కన్న తక్కువ స్థాయిలో వేతనం పెంపుదల నిర్ణయించారు. ఉద్యోగులకు, ఉపాధ్యాయులకు, పెన్షనర్లకు, ఔట్ సోర్సింగ్, కాంట్రాక్టు ఉద్యోగులకు దక్కవలసిన సౌకర్యాలన్నిటిలో కోతలు విధించారు. ఏ రకంగా చూసినా ఉద్యోగ, ఉపాధ్యాయ వర్గాల న్యాయమైన హక్కులను కొల్లగొట్టారు. ఉద్యోగ, ఉపాధ్యాయ వర్గాల ప్రతినిధిగా ఉన్న జెఎసితో చర్చలు జరపకుండా, తమ మాట వినే సంఘాలతో, నాయకులతో తూతూమంత్రపు చర్చలు జరిపి, వారి ఆమోదం పొందామని పుండు మీద కారం చల్లినట్టు ప్రవర్తించారు. ఈ స్థితిలో ఉద్యోగ, ఉపాధ్యాయ వర్గాలు ఆందోళనలు చేపట్టడమైనా, ఫిబ్రవరి మొదటివారం నుంచి నిరవధిక సమ్మెకు పిలుపు ఇవ్వడమైనా అనివార్యమయ్యాయి. నిజానికి, ఉద్యోగ, ఉపాధ్యాయ వర్గాలతో నిరంతర సంభాషణలో ఉండి, ఇచ్చిపుచ్చుకునే ధోరణితో ఉంటే, సమస్య ఇంత తీవ్రరూపం దాల్చేది కాదు. ఈ చారిత్రక నేపథ్యం చూడకపోతే, ఉద్యోగులు మిగిలిన వర్గాలకన్న ఎక్కువ గొంతెమ్మ కోర్కెలు కోరుతున్నారనే తప్పుడు నిర్ధారణలకు వచ్చే అవకాశం ఉంది. అటువంటి తప్పుడు సమాచారంతో, లేదా ప్రభుత్వ ప్రోత్సాహంతో ఉద్యోగ, ఉపాధ్యాయ వర్గాల మీద వ్యతిరేకత రెచ్చగొట్టే ప్రయత్నం కూడ పెద్ద ఎత్తున జరుగుతున్నది. ఉద్యోగ, ఉపాధ్యాయ వర్గాల కోరికలు ఆర్థిక పరమైనవే అయినప్పటికీ, అవి న్యాయమైనవి. ఈ ఆర్థిక సౌకర్యాల ఆకాంక్షలు తమవి మాత్రమే కావని, కొనసాగుతున్న రాజకీయార్థిక వ్యవస్థలో ఇటువంటి సమస్యలూ ఆకాంక్షలూ ఉన్న ప్రజా సమూహాలు అనేకం ఉన్నాయని, అటువంటి సమూహాలతో ఐక్యత కోసం ప్రయత్నించాలని ఉద్యోగ, ఉపాధ్యాయ వర్గాలు గుర్తించాలి. తాము ప్రజా సేవకులమని, ప్రజల నుంచి దూరం చేసే ప్రవర్తన తమలో ఏ ఒక్కరిలో ఉన్నా దాన్ని తొలగించుకోవాలనే చైతన్యాన్ని సంతరించుకోవాలి. ప్రభుత్వోద్యోగులుగా, పాలకపక్ష ఇష్టానుసారం ప్రవర్తించివారుగా తాము ప్రజల నుంచి దూరమయ్యామని గుర్తించి, ఆ తప్పును సరిదిద్దుకుని, ప్రజలలో భాగంగా మారినప్పుడే వారి న్యాయమైన కోరికలకూ, ఆకాంక్షలకూ విస్తృత ప్రజా సంఘీభావం దొరుకుతుంది. వీ

# ప్రజా నిరసనలతో అట్టుడికిపోతున్న కజకిస్తాన్

– ఎ. నర్సింహారెడ్డి

**క**జకిస్తాన్ పూర్వపు సోవియట్ యూనియన్‌లో అంతర్భాగం. మధ్య ఆసియాలో అతిపెద్ద చమురు సంపన్న దేశం. ఈ చమురు సంపన్న దేశంలో ఇంధన ధరలు రెట్టింపు కావడంపై జనవరి 2 నుంచి ప్రజాగ్రహం పెల్లుబికింది. దేశంలోని పశ్చిమ ప్రాంతంలోని మాంగ్యస్టావ్ ప్రావిన్స్‌లోని ఝూనోఝవ్ నగరంలో మొదలై ఒకటి రెండు రోజుల్లోనే ఇతర నగరాలకు విస్తరించింది. మాంగ్యస్టావ్ ప్రావిన్స్ చమురు క్షేత్రాలకు ఆటపట్టు. చమురు క్షేత్రాల్లో పనిచేసే కార్మికులకు పోరాట వీరులు అనే పేరు ఉంది. ఈ ఆందోళనలో యువకులు, విద్యార్థులు, కార్మికులు, మహిళలు అత్యధికంగా పాల్గొంటున్నారు. నిరసనకారులు ఆల్మాటీలోని విమానాశ్రయాన్ని ఇతర ప్రభుత్వ భవనాలను స్వాధీనం చేసుకోవడంతో పాటు ధ్వంసం చేశారు. వేలాది వ్యాపారసంస్థలు, బ్యాంకులు లూటీ అయ్యాయి. వందలాది పోలీసు వాహనాలు దగ్ధమయ్యాయి. నిరసనకారులపై పోలీసులు జరిపిన కాల్పుల్లో 160 మంది మరణించారు. వేలాది మందిని అదుపులోకి తీసుకున్నారు. దేశంలో అనూహ్యంగా వ్యాపించిన నిరసనలకు స్పందనగా ప్రధాని అషార్ మామిన్ తన పదవికి రాజీనామా చేశారు. గతంలో దేశాధ్యక్షుడిగా 28 ఏళ్ళ పాటు ఏలిన నూర్‌సుల్తాన్ నజర్‌బయేవ్‌ను దేశ భద్రతా మండలి చైర్మన్ హోదా నుంచి తప్పించారు. అయినా నిరసనలు ఆగట్లేదు. ఈ సంక్షోభ వేళ సాయపడాల్సిందిగా రష్యా ప్రాబల్యంలోని 'సమిష్టి భద్రతా ఒప్పంద సంస్థ' (సిఎస్టిఓ)ను కజక్ అధ్యక్షుడు కసిమ్ జొమార్ట్ తొకయేవ్ కోరడం, అదే అదనుగా జనవరి 6న రష్యా 2500 మంది బలగాన్ని పంపడం చర్చనీయాంశమైంది.

కజక్‌లో ప్రజాందోళనకు తక్షణ కారణం ఇంధన ధరలైతే కావచ్చు గాని అదొక్కటే కారణం కాదు. ఆ దేశ సంపదలో 55 శాతం కేవలం 162 మంది సంపన్నుల వద్దనే ఉంది. ఆర్థికాభివృద్ధి అద్భుతమైనా, సామాన్యుడి సగటు వేతనం నెలకు 100 డాలర్ల లోపే! ఈ సామాజిక–ఆర్థిక అసమానత, పెచ్చుమీరిన అవినీతిపై ప్రజల్లో గూడుకట్టుకున్న ఆక్రోశం ఇలా బహిర్గతమైంది. ప్రజాగ్రహ జ్వాల ప్రభువులు అదుపు చేయలేనిదిగా మారింది. తొకయేవ్ ఇంధన ధరలపై వెనక్కి తగ్గారు. మంత్రివర్గాన్ని రద్దు చేశారు.

1991లో స్వతంత్ర రిపబ్లిక్‌గా అవతరించినప్పటి నుంచి మూడు దశాబ్దాల్లో కజకిస్తాన్ కనివిని ఎరుగని ఘటనలివి. నిజానికి, మధ్య ఆసియాలోని రిపబ్లిక్స్ అన్నింటిలోకి కజక్ సంపన్నమైనది, స్థిరమైనది. ప్రపంచ యురేనియం నిల్వల్లో 40 శాతానికి పైగా ఆ దేశంలోనే ఉన్నాయి. సహజవాయు నిల్వల విషయంలో అగ్రదేశాల్లో ఇది ఒకటి. స్వతంత్ర దేశమైన నాటి నుంచి కజక్ నిరంకుశ ప్రభువుల గుప్పెట్లో ఉంటూ వచ్చింది. 2019లో నియంత నజర్‌బయేవ్ అధ్యక్షుడిగా వైదొలగినా, తాను ఏరికోరి ఎంచుకున్న తొకయేవ్‌ను ఆ పీఠంపై కూర్చోబెట్టారు. దేశమంతటా ఆయన విగ్రహాలే! తక్కువ వేతనాలు, దీనమైన పని పరిస్థితులతో కొన్నేళ్ళుగా శ్రామికులలో, స్థానిక తెగల్లో అలజడి పెరుగుతూ వచ్చింది. తొకయేవ్‌తో పరిస్థితులు మారతాయనుకుంటే, నజర్‌బయేవ్ తెర వెనుక నుంచి ఆడించారు. కరోనాతో ఆర్థిక మందగమనం, ద్రవ్యోల్బణం పరిస్థితిని దిగజార్చాయి. చివరకు ఆగ్రహంతో జనం విగ్రహాలు తగలబెట్టారు. ఇప్పుడు ఉద్యమకారుల నినాదం పరిశ్రమలను జాతీయం చేయాలి. ప్రజలపై దాడులు ఆపాలి. మొత్తంగా వ్యవస్థ మారాలని ప్రజలు ఉద్యమిస్తున్నారు. వారి ఉద్యమానికి ప్రపంచ ప్రజల సంఘీభావాన్ని కోరుకుంటున్నారు. వీ

## టెలిప్రాంప్టర్‌లో ఏం కనబడుతోంది?





❖ **వర్తమానం** – రాజకీయ, ఆర్థిక, సైద్ధాంతిక వ్యాస సంపుటి-1 – కట్టా భగవంతరెడ్డి – ప్రజా విమోచన ప్రచురణ – 352 పేజీలు, 1/8 డెమీ, రు. 200, ప్రతులకు: అనసూయ, ప్లాట్ నెం. 405, ప్రశాంత్‌నగర్, వనస్థలిపురం, హైదరాబాద్ – 500070, ఫోన్ : 76708 73369



❖ **తెరిణెకంటి ముట్టడి** – (క్రీ.శ. 1801లో కర్నూలు జిల్లా తెర్నెకల్లు గ్రామస్థులు భూమిశిస్తుకు వ్యతిరేకంగా, బ్రిటిష్ వారితో జరిపిన పోరాటం) – యస్.డి.వి. అజీజ్ – యస్. అబ్దుల్ అజీజ్ ప్రచురణ – 85 పేజీలు, 1/8 డెమీ, రు. 80,



❖ **అల్లూరి సత్యనారాయణరాజు** – స్వతంత్ర్యోద్యమ నవల – (ఓ స్వతంత్ర్య సమరయోధుడి జీవితగాద 1913-1963) – యస్.డి.వి. అజీజ్ – యస్. అబ్దుల్ అజీజ్ ప్రచురణ – 570 పేజీలు, 1/8 డెమీ, రు. 500, ప్రతులకు: యస్. అబ్దుల్ అజీజ్, 46/633, 34, బుధవారపేట, కర్నూలు – 518002, ఫోన్ : 9133144138



❖ **అస్థిపంజరం** – అమృత ప్రీతమ్ – అనువాదం: మెహక్ హైదరాబాదీ – హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ – 112 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు: హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ప్లాట్ నెం. 85, బాలాజీ నగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ – 500067, ఫోన్ : 040-23521849



❖ **మట్టి కనుగుడ్ల పాట** – కవిత్వం – దొంతం చరణ్ – 120 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: నవతెలంగాణ, నవచేతన, నవోదయ, బోధి, అనేక (విజయవాడ), అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో, ఫోన్ : 9000215466



❖ **దృశ్య రహస్యాల వెనుక** – బండ్ల మాధవరావు కవిత్వం – సంపాదకుడు: ఎ.కె. ప్రభాకర్ – సాహితీ మిత్రులు ప్రచురణ – 124 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు: డా. కె. ఉమారాణి, 305, రెయిన్‌బో ఎన్.ఎం. స్క్వేర్, జయప్రకాశ్ నగర్, విజయవాడ – 520008, ఫోన్ : 8897623332



❖ **పూల పరిమళం** – కవిత్వం – కోడం కుమారస్వామి – జనగామ రచయితల సంఘం ప్రచురణ – 129 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: కోడం కుమారస్వామి, ఇ.నెం. 4-5-20/బి, వెంకన్నకుంట, జనగాం – 506167, ఫోన్ : 9848362803



❖ **"దుశ్శాలువ కప్పంగ"** – కామెడీ కథలు – ఆర్.సి. కృష్ణస్వామి రాజు – ప్రియమైన రచయితలు ప్రచురణ – 140 పేజీలు, 1/8 డెమీ, రు. 140, ప్రతులకు: ఆర్.సి. కృష్ణస్వామి రాజు, ఇ.నెం. 22-4-71, బ్యాంక్ ఎంప్లాయిస్ కాలనీ, మంగళం రోడ్, తిరుపతి – 517501, ఫోన్ : 9393662821



❖ **దృశ్యాంతరం** – (సమాజ సాహిత్య సంబంధాల విశ్లేషణ – కె. నాగేశ్వరా చారి – విరసం ప్రచురణ – 181 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: కె. నాగేశ్వరా చారి, ఇ.నెం. 78-8-డి-2-ఎ, జయ అపార్ట్‌మెంట్ దగ్గర, న్యూక్రిష్ణా నగర్, కర్నూలు – 518002



❖ **సాహిత్య లేఖలు** – వి. చెంచయ్య – విరసం ప్రచురణ – 40 పేజీలు, 1/8 డెమీ, రు. అమూల్యం, ప్రతులకు: వి. చెంచయ్య, 'సాహితి నిలయం', ఇ.నెం. 10-40-15ఎ, జనతాపేట నార్త్, కావలి – 524001, శ్రీ పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా, ఫోన్ : 9440638035



❖ **సాహిత్య స్పందన** – పిన్నిబోయిన కోటయ్య – విరసం ప్రచురణ – 80 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు: పి. కోటయ్య, డోర్ నెం. 26-13-358, టీచర్స్ కాలనీ మొదటి వీధి, బి.వి. నగర్, నెల్లూరు – 524004, శ్రీ పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా, ఫోన్ : 8500952294



❖ **కులం పునాదులు** – రచన: డా. ఆర్.కె. – చార్వాకాశ్రమ ప్రచురణ – 35 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు: చార్వాకాశ్రమం, నిడమర్రు – పోస్టు, మంగళగిరి మండలం, గుంటూరు జిల్లా – 522506, ఫోన్ : 9290619550



❖ **వయ్యి** – దీర్ఘ కవిత – దామరకుంట శంకరయ్య – సాహితీ సోపతి ప్రచురణ – 55 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు: శ్రీమతి శీలంపల్లి క్రాంతి, ఇ.నెం. 4-69/62, ఫ్లాట్ నెం. 403, సూర్య రెసిడెన్సీ, విద్యారణ్యపురి, కరీంనగర్ – 505001, ఫోన్ : 9440876788



❖ **టీవీ ప్రకటనలు** – భాష, సంస్కృతుల పరిశీలన – డా. వేంపల్లె షరీఫ్ – క్లాసిక్ బుక్స్ ప్రచురణ – 272 పేజీలు, 1/8 డెమీ, రు. 260, ప్రతులకు: క్లాసిక్ బుక్స్, ఇ.నెం. 32-13/2-3ఎ, అట్లూరి పరమాత్మ స్ట్రీట్, మొగల్‌రాజుపురం, విజయవాడ – 520010, ఫోన్ : 8522002536



❖ **గొంతు విప్పిన గువ్వ** – ఝాన్సీ కొప్పిశెట్టి – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 200 పేజీలు, 1/8 డెమీ, రు. 150,



❖ **లచ్చుంబాయి** – కథలు – డా. రూప్ కుమార్ డబ్బీకార్ – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 111 పేజీలు, 1/8 డెమీ, రు. 100, పై రెండు ప్రతులకు: పాటపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500036, ఫోన్ : 9848787284

# చట్టుబండలవుతున్న చట్ట సభలు

***పార్లమెంటు శీతాకాల సమావేశాలు పార్లమెంటరీ ప్రజాస్వామిక సూత్రాలకు విరుద్ధంగా, పాలకపక్ష నిరంకుశత్వానికి నిదర్శనంగా జరిగాయంటున్నారు* నర్సింహా**

పార్లమెంట్ శీతాకాల సమావేశాలు గతంలో వలెనే ఒకరోజు ముందే అర్థాంతరంగా ముగిశాయి. అధికార–ప్రతిపక్షాల వాదోపవాదాలు, సభ మధ్యలో నిరసనలు, అనివార్యమైన వాయిదాలు... మళ్లీ అవే సన్నివేశాలు మొదటి రోజు నుంచి చివరి రోజు దాక పునరావృతం అయ్యాయి. నిర్మాణాత్మక చర్చల స్థానంలో సంవాదాలు చోటు చేసుకుంటున్నాయి. బాహాబాహీలకు చట్టసభలు వేదికలుగా మారుతున్నాయి. విలువైన కాలం, ప్రజాధనం వృథా అవుతోంది. ప్రతిపక్షాలు లేవనెత్తిన అంశాలపై ప్రభుత్వం మొండిగా ఉండటంతో సభా కార్యకలాపాల నిర్వహణ వృథా అయిపోయింది. ప్రజా సమస్యల గురించి ఆలోచించే వారికి చట్టసభలు సాగిన తీరులో ఏమున్నది గర్వకారణం అనిపించక మానదు. సభాసమయంలో వృథానే ఎక్కువగా కనిపిస్తుంది. కీలక బిల్లులు ఆమోదం పొందినా, వాటిపై చర్చ జరగలేదనే చేదు నిజం మన పార్లమెంటరీ ప్రజాస్వామ్య విధానాన్ని వెక్కిరిస్తోంది. ఎవరి పాలు ఎంతనేది పక్కనపెడితే, అధికార, ప్రతిపక్షాలు రెంటిలో తప్పు కనిపిస్తుంది.

నవంబర్ 29న శీతాకాల సమావేశాలు మొదలైన రోజునే వర్షాకాల సమావేశాల్లోని ప్రవర్తన తీరుకు దండనగా రాజ్యసభలో 12 మంది ప్రతిపక్ష సభ్యులను మొత్తం ఈ శీతాకాల సమావేశాల నుంచి బహిష్కరించడం వివాదాస్పదమైంది. దాని చట్టబద్ధత ప్రశ్నార్థకమైంది. సామూహిక పశ్చాత్తాపం కాదు, వ్యక్తిగతంగా ఎవరికి వారు క్షమాపణలు చెబితేనే సభలోకి అనుమతిస్తామన్న అధికార పక్షం మంకుపట్టు ఆఖరి దాకా కొనసాగింది. పలుమార్లు సభలో అంతరాయాలకూ, సభ బయట ధర్నాలకూ కారణమైంది. ఒక రకంగా ప్రతిపక్షాల్లో అనూహ్య ఐక్యతకూ దారి తీసింది. 22 రోజుల పాటు గాంధీ విగ్రహం వద్ద ప్రతిపక్ష సత్యాగ్రహం సాగింది. కాగా, అంతరాయాలతో లోక్‌సభలో 18 గంటల 48 నిమిషాలు వృథా అయింది. రాజ్యసభలో ఏకంగా 49 గంటల 32 నిమిషాలు వ్యర్థమైంది. మొత్తం మీద లోక్‌సభ ఉత్పాదకత 77 శాతమైతే, రాజ్యసభది 43 శాతమేనని చట్టసభలపై స్వచ్ఛంద పరిశోధనా సంస్థ పిఆర్ఎస్ లెక్కేసింది. ఏ లెక్కనైనా ఇది పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి వన్నె తీసుకురాదనేది నిర్వివాదాంశం.

ఈ సమావేశాల్లో 12 బిల్లులు లోక్‌సభలో, ఒక బిల్లు రాజ్యసభలో – మొత్తం 13 బిల్లుల్ని ప్రవేశ పెట్టారు. వాటిలో 11 బిల్లులు ఉభయసభల ఆమోదం పొందాయి. అందులో అద్దె గర్భం, సహాయ పునరుత్పాదక టెక్నాలజీ (ఎఆర్‌టి), నార్కోటిక్ డ్రగ్స్ లాంటి కీలక బిల్లులున్నాయి. లోక్‌సభలో మెజారిటీ ఉండడంతో వీటిని పాస్ చేయించుకోవడం పాలకపక్షానికి కష్టమేమీ కాలేదు. కానీ, రాజ్యసభలో ప్రతిపక్షాలదే ఇప్పటికీ స్వల్ప మెజారిటీ (ప్రతిపక్షాలు 120, ఎన్‌డిఎ సభ్యులు 118). అందుకే, ప్రభుత్వం వ్యూహాత్మకంగా పాత తప్పుల సాకుతో 12 మంది విపక్ష సభ్యుల్ని సస్పెండ్ చేసి, కృత్రిమ మెజారిటీ సంపాదించి, రాజ్యసభలో బిల్లులను పాస్ చేయించుకుంది. చర్చ లేకుండా నిమిషాల వ్యవధిలోనే అనేక బిల్లులకు ఆమోద ముద్ర పడడం అనేక సందేహాలకు కారణమవుతోంది. సమావేశాల మొదట్లోనే తెచ్చిన కొత్త సాగు చట్టాల ఉపసంహరణ బిల్లు మొదలు చివరలో తెర మీదకు తెచ్చిన ఎన్నికల చట్టాల (సవరణ) బిల్లు దాకా అనేకం అర్థవంతమైన చర్చ ఏమీ లేకుండా, అరగంటలో పాలకపక్షం మమ అనిపించినవే! ప్రజాస్వామ్య వ్యవస్థలో ఓటరు గుర్తింపు కార్డునూ ఆధార్‌నూ అనుసంధానించడానికి వీలు కల్పించే అత్యంత కీలక ఎన్నికల చట్టం మార్పుపై చర్చించకుండానే ఆమోదింప చేసుకున్న తీరు ఆందోళనకరమైంది.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో పార్లమెంటు భిన్నాభిప్రాయాలకు చర్చావేదికగా నిలవడం, ఆ చర్చల్లో ప్రజోపయోగ నిర్ణయాలు తీసుకోవడం పార్లమెంట్ ప్రాథమిక కర్తవ్యం. కానీ, బిజెపి రెండోసారి అధికారంలోకి వచ్చాక ఈ ప్రజాస్వామ్య వేదిక ఆ గుణాన్ని కోల్పోయినట్లు కనిపిస్తోందన్నది స్పష్టం. 17వ లోక్‌సభలోని తాజా 7వ విడత సమావేశాల్లో సగటున ప్రతి బిల్లూ లోక్‌సభలో 10 నిమిషాల్లో, రాజ్యసభలో అరగంటలో పాసైపోయాయి. చట్టసభల్లో పరిఢవిల్లాల్సిన ప్రజాస్వామ్య స్ఫూర్తిని బిజెపి పరిహసించిందని ప్రతిపక్షాలు ఆరోపిస్తున్నవి. అందుకే, బిల్లులపై భిన్నాభిప్రాయాలు ఉన్నప్పుడు వాటిని పార్లమెంటరీ కమిటీలకు పంపడం సాధారణం. ఇటీవల ఆ ధోరణి కూడా తగ్గుముఖం పడుతోంది. తాజా సమావేశాల్లో 6 బిల్లుల్ని మాత్రం పార్లమెంటరీ కమిటీలకు నివేదించారు. ఆడపిల్లల వివాహ వయస్సును పెంచే ప్రతిపాదనపై సందేహాలు వ్యక్తమయ్యాక ఆ బిల్లును స్టాండింగ్ కమిటీకి పంపారు.

పార్లమెంటులో ప్రజాసమస్యలను ప్రస్తావించి పాలకపక్షాన్ని ఇరుకున పెట్టడానికి అవకాశమున్న కీలకమైన ప్రశ్నోత్తరాల సమయంలోనూ 60 శాతం సమయం వృథా తప్పలేదంటే, ప్రతిపక్షాలు ఆత్మపరిశీలన చేసుకోవాలి. రంగస్థల ప్రదర్శనలా మారిపోతున్న తమ సభావ్యూహాన్ని పునరాలోచించుకోవాలి. నిజానికి, ఈసారి సభలో గట్టిగా చర్చ జరిగింది– కొవిడ్ పైన, పర్యావరణ మార్పుల పైనే! రైతుల ప్రాణాలు బలిగొన్న

లఖింపూర్ ఖేరీ ఘటన పథకం ప్రకారం జరిగిందని ప్రత్యేక దర్యాప్తు బృందం (సిట్) తేల్చడంతో, కన్నకొడుకే నిందితుడైన హోంశాఖ సహాయ మంత్రి అజయ్ మిశ్రా రాజీనామా చేయాలని ప్రతిపక్షాలు చివరి దాకా పట్టుబట్టాయి. అయితే, కీలక అంశాల చర్చకు ప్రభుత్వాన్ని ఒప్పించడమూ అంతే ముఖ్యమని గ్రహించాల్సింది. సభ్యులు భిన్నంగా ప్రవర్తించి ఉంటే సమావేశాలు మరింత మెరుగ్గా జరిగి ఉండేవి. పార్లమెంటు సంప్రదాయాలకు భిన్నంగా ఏకపక్షంగా పాలకులు అనుకున్న బిల్లులకు రబ్బరు స్టాంపు రాజముద్రలు వేయించుకోడానికి పార్లమెంట్ సమావేశాలతో పని ఏముంది!

నవంబర్ 29న ప్రారంభమైన ఉభయ సభలను నిరవధికంగా వాయిదా వేస్తున్నట్టు లోక్‌సభలో స్పీకర్ ఓం బిర్లా, రాజ్యసభలో చైర్మన్ ఎం.వెంకయ్యనాయుడు డిసెంబర్ 22న ప్రకటించారు. అనంతరం ఏర్పాటు చేసిన విలేకరుల సమావేశంలో పార్లమెంటరీ వ్యవహారాల మంత్రి ప్రహ్లాద్ జోషి, సహాయ మంత్రులు అర్జున్ రామ్‌మేఘ్వాల్, వి.మురళీధరన్‌లతో కలిసి మాట్లాడారు. నవంబర్ 29న ప్రారంభమైన పార్లమెంట్ శీతాకాల సమావేశాలు డిసెంబర్ 23 నాటికి ముగియాల్సి ఉందని, కానీ షెడ్యూల్ కంటే ఒకరోజు ముందే పార్లమెంట్ సమావేశాలు ముగిశాయని తెలిపారు. ఈ సమావేశాలు 24 రోజుల పాటు 18 సిట్టింగ్స్ జరిగాయని తెలిపారు. ఉభయ సభల్లో 11 బిల్లులను ఆమోదించినట్టు కేంద్ర మంత్రి ప్రహ్లాద్ జోషి తెలిపారు. 2021-22 ఏడాదికి సంబంధించిన గ్రాంట్ల, సప్లిమెంటరీ డిమాండ్‌లకు సంబంధించిన ద్రవ్య వినిమయ బిల్లు లోక్‌సభలో ఆమోదం పొందిందనీ, రాజ్యసభలో ఆమోదం పొందలేదని, అయితే ఆర్టికల్ 109(5) ప్రకారం 14 రోజులు దాటిన తరువాత పార్లమెంట్ ఆమోదం పొందినట్లేనని ప్రభుత్వ వర్గాలు చెబుతున్నాయి.

సెంట్రల్ విజిలెన్స్ కమిషన్ (సవరణ) ఆర్డినెన్స్, ఢిల్లీ స్పెషల్ పోలీస్ ఎస్టాబ్లిష్‌మెంట్ (సవరణ) ఆర్డినెన్స్, నార్కోటిక్ డ్రగ్స్, సైకోట్రోపిక్ సబ్‌స్టాన్సెస్ (సవరణ) ఆర్డినెన్స్ పార్లమెంట్ సమావేశాలకు ముందే రాష్ట్రపతి ఆమోద ముద్రతో తెచ్చామనీ, ఆ మూడు ఆర్డినెన్స్‌ల స్థానంలో మూడు బిల్లులు ఉభయ సభల్లో ఆమోదం పొందాయని కేంద్ర మంత్రులు తెలిపారు. బయోలాజికల్ డైవర్సిటీ (సవరణ) బిల్లును జాయింట్ కమిటీకి పంపామని, మరో ఐదు బిల్లులను కూడ స్టాండింగ్ కమిటీకి పంపామని కేంద్ర మంత్రులు తెలిపారు. అయితే ఎన్నికల చట్టం(సవరణ)తో వ్యక్తుల గోప్యతకు భంగకరమన్నది చర్చనీయాంశంగా మారింది. అలాగే మహిళల వివాహ వయస్సు పెంపు బిల్లును మహిళా సంఘాలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాయి.

### ఓటర్ గుర్తింపు కార్డుకు ఆధార్ అనుసంధానం

నేడు మనం నియంత్రణే లక్ష్యంగా పాలనా సాగుతున్న దశలో ఉన్నాం. బడా పెట్టుబడి తన ప్రయోజనాలను కాపాడుకోవడమే లక్ష్యంగా భావిస్తోంది. పాలకులు సంక్షేమ పథకాల విస్తృతిని నియంత్రించడానికి దివాళాకోరు విధానాలు అమలు చేయడానికి ఆధార్‌ను ఇరుసుగా వాడుకొంటున్నా. అందులో భాగంగానే పార్లమెంటు శీతాకాల సమావేశాల్లో ఆఘమేఘాల మీద ఓటర్ గుర్తింపు కార్డుకు ఆధార్ కార్డును అనుసంధానించే ఎన్నికల చట్టాల (సవరణ) బిల్లు 2021, ద్వారా ఇప్పటివరకు అమలులో ఉన్న 1950, 1951 ప్రజా ప్రాతినిధ్య చట్టానికి సవరణ చేసింది. ఈ సవరణ భారత పౌరుల వ్యక్తిగత గోప్యత హక్కుకు తీవ్ర ముప్పు కలిగిస్తుంది. బిల్లును స్టాండింగ్ కమిటీ పరిశీలనకు నివేదించాలని ప్రతిపక్ష ఎంపీలు ఎంతగా మొత్తుకున్నా పార్లమెంటు ఉభయ సభల్లో దాన్ని ప్రభుత్వం అతి నిరంకుశంగా ఆమోదింపజేసుకుంది. ఈ చర్య ద్వారా బిజెపి ప్రభుత్వం రాజ్యాంగ వ్యవస్థల పట్ల తన అసహనాన్ని మరోసారి బయటపెట్టుకుంది. లోక్‌సభ డిసెంబర్ 20న కేవలం 25 నిమిషాల చర్చతోనే ఆమోదించడం దారుణం. రాజ్యసభలో డిసెంబర్ 22న మూజువాణీ ఓటుతో ఆ బిల్లును ఏకపక్షంగా ఆమోదింపజేశారు.

మనదేశంలో ఓటు హక్కు సార్వజనికమైనది. కుల, మత, ప్రాంత, వర్గ రహితంగా 18 ఏళ్లు పైబడినవారు భారత దేశపౌరులై ఉంటే నివాసమున్న ప్రాంతంలో ఓటు వినియోగించుకోవచ్చు. జాబితా తయారు చేసేటప్పుడు ఈ రెండంశాలను మాత్రమే పరిగణించాలి. ఇంటింటికి తిరిగి తనిఖీ చేయాలి. ఓటు వినియోగించుకునేటప్పుడు ధృవీకరణగా పదకొండు రకాల గుర్తింపు కార్డులలో ఏది ఉన్నా ఓటు చేయొచ్చు. కీలకమైనది ఓటరు గుర్తింపు కార్డు కాదు, జాబితాలో పేరుండటం. అందుకనే అతి పెద్ద ప్రజాస్వామ్యమైన దేశంలో ప్రజాతంత్ర ప్రక్రియ అయిన ఎన్నికలలో ఓటరు జాబితా ప్రామాణికమైనది. ఈ ఓటరు జాబితాలో పేరు లేకపోతే ఓటరు కార్డుతో సహా ఏ గుర్తింపు కార్డున్నా ఓటు హక్కు వినియోగించుకోలేం.

ఇప్పటికే మన దేశంలో బడా పెట్టుబడి ఎలక్టోరల్ బాండ్ల ద్వారా బిజెపి తన స్థానాన్ని, మరింత పదిలం చేసుకుంది. ఇప్పుడు ఆధార్‌తో ఎలక్టోరల్ రోల్‌లను అనుసంధానం చేయాలనే చట్టం-2021 చాల వివాదాస్పదమైనది, అభ్యంతరకరమైనది. ఇది 'ఒకే దేశం ఒకే ఎన్నికలు' వ్యవస్థ దిశలోకి పయనంగా మనం చూడాలి. స్థానిక, అసెంబ్లీ-సార్వత్రిక ఎన్నికలకు ఏకకాలంలో జరపడం తమ లాభార్జనకు అనుకూల విధానాలను ముందుకు తీసుకువెళ్ళడానికి పాలక కూటమికీ, దానితో పాటు బడా పెట్టుబడిదారులకూ తోడ్పడుతుంది, ఒకే దేశం ఒకే ఎన్నికలు కేవలం ఎన్నికల వ్యవహారమే కాదు, ఇది భారత ఎన్నికల వ్యవస్థనంతటినీ భారత బడా పెట్టుబడిదార్ల అవసరాలకు అనుగుణంగా మార్చే పరివర్తన కూడా. ఈ దాడి నుండి భారత ప్రజాస్వామిక వ్యవస్థ బతికి బట్ట కట్టదు.

ఎలక్టోరల్ రోల్‌లతో ఆధార్ అనుసంధానాన్ని చట్టబద్ధం చేయడంతో గోప్యంగా ఉన్న ఓటర్ల వ్యక్తిగత సమాచారం ఇక బహిరంగమవుతుంది. వ్యక్తుల సమాచారం గోప్యంగా ఉంచుకోవడం ప్రాథమిక హక్కు అని పుట్టుస్వామి కేసులో సుప్రీంకోర్టు 2015 ఆగస్టులో తీర్పు చెప్పింది. ఏ పౌరుని వ్యక్తిగత డేటానైనా తెలుసుకోవాలంటే అందుకు చట్టపరమైన ముందస్తు అనుమతి తప్పనిసరి అని కూడా సుప్రీంకోర్టు చెప్పింది. కనుక ఈ బిల్లు రాజ్యాంగంలోని 21వ అధికరణాన్ని ఉల్లంఘించడమే అవుతుంది. దేశ పౌరుల నుండి సేకరించిన వ్యక్తిగత డేటాను వ్యాపార

ప్రయోజనాల కోసం వినియోగించడానికి దోహదం చేసే వ్యవస్థల ఏర్పాటుకు ప్రభుత్వం పూనుకుంటోంది. అందులో భాగంగా ఇప్పటికే వ్యక్తిగత డేటా రక్షణ చట్టాన్ని రూపొందించింది.

కేంద్ర ప్రభుత్వం పౌరుల ఆధార్, పాన్ నెంబర్ వంటివి తప్పనిసరిగా అనుసంధానం చేస్తేనే వివిధ ప్రభుత్వ సేవలు గానీ, ప్రభుత్వ రంగ సంస్థల సేవలు గానీ అందుతాయని షరతులు విధించింది. ఉద్యోగుల కార్యకలాపాలను మానిటర్ చేసే యాప్‌లను ఆ ఉద్యోగుల ఫోన్లలో ఇన్‌స్టాల్ చేయాలని ఇప్పటికే ప్రభుత్వం ఆదేశాలిచ్చింది. హర్యానాలో అంగన్‌వాడీ ఉద్యోగులు ఎప్పుడు ఎక్కడెక్కడ ఉంటారో సూచించే యాప్‌ను ఫోన్‌లో డౌన్‌లోడ్ చేసుకోవాలని అక్కడి ప్రభుత్వం ఆదేశించింది. మున్సిపల్ వర్కర్ల ఫోన్లలో యాప్ వారి కదలికలనే గాక మాటలను సైతం రికార్డు చేస్తుంది. ఇవన్నీ ఆ కార్మికుల, ఉద్యోగుల వ్యక్తిగత గోప్యతకు భంగం కలిగించడమే కదా! దేశంలోని ఓటర్లందరి వ్యక్తిగత సమాచారానికి ఇకపై గోప్యత ఉండదు. అంటే పౌరుల స్వేచ్ఛను హరించడమే అవుతుంది.

**పెళ్ళీడు మారితే మహిళ కష్టాలు ఏమారుతాయా?**

సామాజిక ప్రగతికి మహిళల అభివృద్ధే గీటురాయి. పితృస్వామ్య భావజాల బందిఖానాలోంచి వారికి నేటికి స్వేచ్ఛ లభించలేదన్నది చేదు నిజం. లింగపరమైన వివక్ష మూలంగా గడిచిన అర్ధశతాబ్దంలో భారత్‌లో 4.5 కోట్ల మంది ఆడశిశువులు కడతేరిపోయారన్న కఠోర సత్యాన్ని ఐరాస జననిధి సంస్థ నిరుడు వెల్లడించింది. స్త్రీలలో 56 శాతం మంది రక్తహీనతతో అల్లాడుతున్నారని అయిదో జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే (ఎన్ఎఫ్‌హెచ్ఎస్) స్పష్టీకరించింది. కుటుంబాల ఆర్థిక సామాజిక సమస్యల పర్యవసానాలైన ఆడపిల్లల ఇక్కట్లను నివారించాలంటే ముందుగా మూలాలకు మందు వేయాలి. తద్భిన్నంగా ప్రభుత్వం తలకెత్తుకున్న వివాహ వయో పరిమితుల పెంపు ప్రతిపాదన పూర్తిగా నిర్హేతుకమైన నిర్ణయమే. యువతుల చట్టబద్ధ, కనీస వివాహ వయసును 18 ఏళ్ల నుంచి 21 సంవత్సరాలకు పెంచాలని కేంద్రంలో నరేంద్ర మోడీ ప్రభుత్వం నిశ్చయించింది. తదనుగుణంగా 2006 నాటి బాల్య వివాహాల నిషేధ చట్టాన్ని సవరించడానికి ఓ బిల్లును పార్లమెంటులో ప్రవేశపెట్టారు.

ప్రస్తుతం పార్లమెంటరీ స్థాయీసంఘం పరిశీలనలో ఉన్న ఈ బిల్లు వచ్చే పార్లమెంటు సమావేశాల్లో ఆమోదం పొందనుంది అంటున్నారు. కొత్త సవరణ బిల్లు స్త్రీపురుషుల చట్టబద్ధ వివాహ వయసును సమానం చేయడమే కాదు, హిందూ, ముస్లిం, పార్శీ, క్రైస్తవ వ్యక్తిగత చట్టాల్లో యువతుల వివాహ వయసుకు సంబంధించిన సూత్రాలనూ సవరిస్తోంది. ఈ బిల్లు ఆయా మత సంప్రదాయాల్లో జోక్యం చేసుకోవడమే అవుతుంది. ప్రజలు కోరని చట్టాలు చేయడం ఎన్‌డిఎ ప్రభుత్వానికి ఒక అలవాటుగా మారింది.

మరోవైపు యువతుల వివాహ వయసు పెంచడంలోని హేతుబద్ధత ఏమిటనే ప్రశ్న తలెత్తుతోంది. ఇతర దేశాలు అనుసరిస్తున్న పద్ధతులను పరిశీలిస్తే అమెరికా, బ్రిటన్ వంటి అభివృద్ధి చెందిన దేశాలతో సహా మొత్తం 140 దేశాల్లో యువతుల కనీస వివాహ వయసు 18 ఏళ్లే. స్త్రీపురుషులకు వివాహ వయసు 18 ఏళ్లుగా ఉండాలని 2008లో భారత లా కమీషన్ సిఫార్సు చేసింది. 1989లో ఐక్యరాజ్యసమితి చేసిన సిఫార్సు కూడ అదే.

బాల్య వివాహ నిషేధ చట్టం- 2006 (పి.సి.ఎం.ఎ)ను సవరించాలన్న కాబినెట్ నిర్ణయాన్ని ప్రభావితం చేసిన నీతి ఆయోగ్ టాస్క్‌ఫోర్స్‌ను జూన్ 4, 2020లో ఏర్పాటు చేశారు. ప్రభుత్వ సమాచారం ప్రకారం, తల్లీబిడ్డల ఆరోగ్యం, తల్లీబిడ్డల మరణాల నిష్పత్తి, మొత్తం జననాల రేటు, పుట్టిన సమయంలో లింగ నిష్పత్తి. శిశు లింగ నిష్పత్తితో వివాహ వయస్సు, మాతృత్వానికి ఉన్న అన్యోన్య సంబంధాన్ని పరిశీలించాల్సిన అవసరం ఉంది. మహిళల్లో ఉన్నత విద్యను ప్రోత్సహించాలనీ, వారి సిఫార్సులకు మద్దతుగా ఉనికిలో ఉన్న చట్టాలకు శాసనసంబంధమైన మార్పులు చేయాలని నీతి ఆయోగ్ సిఫార్సు చేసింది. కారణం ఏదైనా, బాల్య వివాహాలను నిరుత్సాహపరచడానికి, మహిళా విద్యను ప్రోత్సహించడానికి, మహిళా సాధికారతను ప్రోత్సహించడానికే ఈ నిర్ణయాన్ని తీసుకున్నామని ప్రభుత్వం చెప్పడాన్ని ఎవరూ విశ్వసించరు. అంతేకాదు ప్రభుత్వం పెండ్లి వయస్సును చట్టం ద్వారా పెంచితే అది బాల్య వివాహాలను నిరోధించడానికి బదులుగా బాధితులను శిక్షించడానికి దోహదపడుతుంది.

మహిళా వివాహ వయసును 21 సంవత్సరాలకు పెంచే బిల్లును పరిశీలించే పార్లమెంటరీ స్థాయీ సంఘంలో స్త్రీలకు తగిన ప్రాతినిధ్యం లేకపోవడం ప్రస్తుతం దేశవ్యాప్తంగా చర్చనీయాంశమైంది. లోతుగా అధ్యయనం చేసేందుకు ఈ బిల్లును లోక్‌సభ డిసెంబర్‌లో స్థాయీసంఘానికి నివేదించింది. కమిటీలో మొత్తం 31 మంది సభ్యులు ఉండగా, అందులో రాజ్యసభ సభ్యురాలు సుష్మితాదేవ్ (తృణమూల్ కాంగ్రెస్) ఒక్కరే మహిళ కావడంతో స్త్రీల ప్రాతినిధ్యం పెరగాలనే డిమాండ్లు పలువురు మహిళా నేతల నుంచి వస్తున్నాయి. మహిళలకు సంబంధించిన బిల్లును అధ్యయనం చేయాల్సిన కమిటీలో నిష్పాక్షికమైన నిర్ణయాలకు చోటు దక్కాలంటే స్త్రీలకు సగభాగం ప్రాతినిధ్యమైనా ఉండాలని అందరు అంటున్నారు. మహిళల స్వయం నిర్ణయాధికార హక్కుకు బిల్లు విఘాతం కలిగిస్తోందని వామపక్షాలు వాదిస్తున్నాయి.

సమాజంలో, కుటుంబంలో కొనసాగుతున్న లింగ వివక్ష, గృహ హింస, ఆస్తిపై యాజమాన్యం, సమాన పనికి సమాన వేతనం వంటివి మహిళలు నేటికీ ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలు, సవాళ్లుగా ఉన్నాయి. ఆడపిల్లల పెళ్లి వయస్సు పెంచితే సాధికారత వస్తుందా? పేదరికాన్ని రూపుమాపకుండా ఉన్నత విద్య చదువుతారా? పౌష్టికాహారం అందించకుండా మాతా శిశు మరణాలు తగ్గుతాయా? అసమానతలు తొలగించకుండా సమానత్వం వస్తుందా? ఇప్పటికే ఎన్నో సమస్యలతో పోరాడుతున్న మహిళలకు నేడున్న పురుషాధిక్య సమాజంలో సమానత్వం, సాధికారత సాధ్యమయ్యే పనులేనా? ప్రభుత్వం అంతగా కోరుకుంటే అది ఇంతకంటే అనేక ముఖ్యమైన అర్థవంతమైన అడుగులు వేయవచ్చు. "పరువు హత్యలకు" వ్యతిరేకంగా ఒక ప్రత్యేక చట్టం చేయవచ్చు. ఏకాభిప్రాయం లేని లైంగిక సంపర్కం (మారిటల్ రేప్)ను నేరంగా గుర్తించవచ్చు. గృహ హింస చట్టాన్ని నీరుగార్చే ప్రయత్నాలను మార్చుకోవచ్చు. ఇలాంటి అనేక సమస్యలున్నాయి.

ఆడపిల్ల పెళ్లయ్యేంత వరకు తల్లిదండ్రుల సంరక్షణలో ఉండాలని, వివాహానంతరతం ఆమె భర్త ఆస్తి అవుతుందనే ధోరణి మారనంత వరకు మహిళా సాధికారత, స్వయం ప్రతిపత్తి చేకూరడం కష్టం. సామాజిక ఆలోచనా విధానంలో మార్పు రావాలి. వివాహ వయసు పెంచినంత మాత్రాన వరకట్న దురాచారం సమసిపోతుందా అంటే సందేహమే. బేటీ బచావో బేటీ పడావో వంటి కార్యక్రమాలతో ప్రచార లబ్ధికి పాకులాడే కన్నా యువతులకు విద్య, వైద్య, ఉపాధి అవకాశాలను వృద్ధి చేయడం మీద ప్రభుత్వం దృష్టి కేంద్రీకరించాలి. కనీస వివహ వయసును పెంచడం ద్వారా మహిళల ఆరోగ్యాన్ని కాపాడగలుగుతామని వాదిస్తున్న ప్రభుత్వం బడ్జెట్‌లో ప్రజారోగ్యానికి కేటాయింపులను తగ్గించేస్తూ, ఆరోగ్య సంరక్షణను ప్రైవేటు రంగానికి అప్పగించడం నిజంగా విడ్డూరం. నిజానికి పేద కుటుంబాల స్త్రీలు ఏ వయసులో పెళ్ళి చేసుకున్నా రక్తహీనత, పోషకాహార లోపాలతో బాధపడుతూనే ఉన్నారు. వారి ఆర్థిక స్తోమత మెరుగుపడనంత వరకు ఈ పరిస్థితి మారదు. అమ్మాయిలు తమ కాళ్లపై తాము నిలబడేలా ప్రోత్సహిస్తూ, వారికి సురక్షిత వాతావరణాన్ని కల్పించడం పాలకుల కనీస బాధ్యత. దాన్ని విస్మరించి చట్టాలతోనే 'మార్పు' తీసుకురావాలనుకుంటే అసలుకే మోసం వస్తుంది! ఎందువల్లనంటే భారత రాజ్యాంగంలోని 21వ అధికరణ ప్రకారం పెళ్లి చేసుకోవడం, కుటుంబాన్ని ఏర్పరచుకోవడం మౌలిక హక్కు కిందకే వస్తుంది. వివాహం అన్నది నిర్దిష్ట చట్టాలు, సంప్రదాయాలకు అనుగుణంగానే జరగాల్సి ఉంటుంది. విభిన్న మతాలు, వాటికి వేర్వేరు పర్సనల్ చట్టాలు ఉన్నప్పుడు అందర్నీ కలుపుకుని ఒకే దారిలో సాగడమనేది అంత సులువేమీ కాదు.

**ముగింపు**

ఇంత హడావుడిగా నిరంకుశంగా మహిళ వివాహ వయసు 21కి పెంచే బిల్లును ప్రవేశపెట్టిన మోడీ ప్రభుత్వం చట్టసభల్లో 33శాతం రిజర్వేషన్లు కల్పించే మహిళా బిల్లు ఊసెత్తడం లేదు. నిజంగా ఎన్నికల సంస్కరణలు జరగాలంటే ఆ చట్టం రావాలి. దేశ పౌరుల నుండి సేకరించిన వ్యక్తిగత డేటాను వ్యాపార ప్రయోజనాల కోసం వినియోగించడానికి దోహదం చేసే వ్యవస్థల ఏర్పాటుకు ప్రభుత్వం పూనుకుంటోంది. అందులో భాగంగా ఇప్పటికే డేటా రక్షణ చట్టాన్ని రూపొందించింది. ఇప్పటికే టెలికాం కంపెనీల, బ్యాంకుల సేవలు పొందాలంటే ఆధార్ తప్పనిసరి అయిపోయింది. ఆ సమాచారం బడా వ్యాపార సంస్థలకు అందుబాటులోకి వచ్చింది. ప్రయాణాలకు ఆరోగ్య సేతు యాప్‌ను తప్పనిసరి చేశారు. ఆ సమాచారాన్ని ఇన్సూరెన్స్ సంస్థలు, కార్పొరేట్ వైద్య సంస్థలు తమ వ్యాపారం కోసం వినియోగించుకుంటాయి. వ్యాక్సినేషన్ కోసం కో-విన్ యాప్‌ను వాడివున్నట్లైతే మన ఆమోదంతో నిమిత్తం లేకుండానే మన సమాచారం ఇన్సూరెన్స్ కంపెనీలకు, కార్పొరేట్ ఆస్పత్రులకు చేరిపోయి ఉంటుంది.

పరిపాలనా వ్యవస్థలో పార్లమెంటుది ప్రధాన పాత్ర. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో చట్టసభల పాత్ర ఎంతో ముఖ్యమైంది. ఇవి రాను రాను మొక్కుబడి సమావేశాలుగా మారిపోతున్నాయి. ప్రజల సమస్యలు, పాలనా విధానాలు, చేయవలసిన చట్టాల కోసం ప్రవేశపెట్టే బిల్లులపైన సమగ్ర చర్చ జరపడం తప్పనిసరి. నిజానికి ప్రజా సమస్యలపై, మెరుగైన భవిష్యత్తు కోసం అనుసరించాల్సిన విధానాలపై అందులో ఆలోచనల మదింపు జరగాలి. ప్రజాస్వామ్య వ్యవస్థలో బలమైన ప్రతిపక్షం ఉంటే ప్రజలకు మేలైన పాలన అందుతుంది. అనేక కారణాల వల్ల పార్లమెంటులో ప్రతిపక్షం బలహీనంగా ఉంటోంది. అందువల్లనే పాలకులు ప్రజా వ్యతిరేక నిర్ణయాలు తీసుకుంటూ నిరంకుశ పోకడలు పోతున్నారు.

ప్రజాస్వామ్యమని చెప్పుకుంటున్న దేశంలో బిల్లులపై, ప్రజా సమస్యలపై నిర్మాణాత్మక చర్చలు జరుగకపోవడం, అసలు చర్చకే అవకాశం ఇవ్వకపోవడం విచారకరం. కోట్లాది రూపాయలు ప్రజాధనం వ్యయంతో నిర్వహించే పార్లమెంటు సమావేశాలు ప్రజా సమస్యల ప్రస్తావన లేకుండానే ముగియడం దురదృష్టకరం. ప్రజల సొమ్ము ప్రతి పైసాకు పాలకులు కాపలాదారులు మాత్రమేననే విషయం విస్మరిస్తున్నారేమోననిపిస్తున్నది. మన పార్లమెంటు ఉభయ సభలు జరిగిన తీరుకు ప్రజాస్వామ్యవాదులు తీవ్ర ఆవేదన చెందుతున్నారు. రాజకీయ వ్యవస్థపై విరక్తి కలుగుతుంది. పరిపాలనా వ్యవస్థపట్ల అవిశ్వాసం పెరుగుతోంది. ఇది ప్రజాస్వామ్య వ్యవస్థ మనుగడకే ప్రమాదకరం.

*(రచయిత ఉపాధ్యాయులు)*

వీ

## పరమేశ్వర రావు గారికి జోహార్లు



*ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ లోనూ, రాష్ట్ర విభజన తర్వాత ఆంధ్రప్రదేశ్ లోనూ ఆరు దశాబ్దాలుగా ఉపాధ్యాయ ఉద్యమ కార్యకర్త, నాయకుడు, పత్రికా సంపాదకుడు నూతలపాటి పరమేశ్వర రావు (81) జనవరి 11న విజయవాడలో మరణించారు. గుంటూరు జిల్లా పత్తిపాడు మండలం నిమ్మగడ్డవారి పాలెంలో 1941 సెప్టెంబర్ 11న జన్మించిన పరమేశ్వర రావు పియుసి తర్వాత ఉపాధ్యాయ శిక్షణ పొంది ఉపాధ్యాయులుగా వృత్తి ప్రారంభించారు. ఉపాధ్యాయ ఉద్యమ నాయకుడు చెన్నుపాటి లక్ష్మయ్య ప్రేరణతో ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్ (ఏపీటీఎఫ్) లో చేరారు. ఏపీటిఎఫ్ నాయకుడిగా, 1992-2004 మధ్య ప్రధాన కార్యదర్శిగా, ఉపాధ్యాయ మాసపత్రికకు ప్రధాన సంపాదకుడిగా పనిచేశారు. ఇంట్లో పడిపోవడంతో ఎముక విరిగిన ఆయన జనవరి 11న ఒక ప్రైవేటు ఆస్పత్రిలో శస్త్రచికిత్స జరుగుతుండగా గుండెపోటుతో తుదిశ్వాస విడిచారు. ఆయన సహచరి జ్యోతి మాభూమి రచయిత సుంకర సత్యనారాయణ గారి కూతురు. చిరకాలం ఉద్యమ బాధ్యతల్లో ఉంటూనే విస్తారమైన చదువరిగా, నిశితమైన విశ్లేషకుడిగా పేరు పొందారు. పరమేశ్వర రావు గారి ఉద్యమ స్ఫూర్తిని, మొక్కవోని నిబద్ధతను వీక్షణం కలెక్టివ్ సవినయంగా గుర్తు చేసుకుంటున్నది.*

# నూతన శ్రామిక చట్టాలు-సునాయాస వ్యాపారం

*దేశంలో అమలులో ఉన్న అనేక కార్మిక, పారిశ్రామిక చట్టాలను రద్దు చేసి వాటి స్థానంలో ప్రభుత్వం తేదలచిన నాలుగు నియమావళుల అసలు లక్ష్యాన్ని వివరిస్తున్నారు* **బి.ఎస్. రాజు**

**20**19 స్వాతంత్ర దినోత్సవ ప్రసంగంలో ప్రధాని మోదీ ఓ మహిమాన్విత సత్యాన్ని దేశ ప్రజలకు (తిరగేసి) తెలియచెప్పారు. దేశ సంపదను సృష్టించే వారిని సందేహించకూడదు, గౌరవించాలి, వారిని సస్పెక్ట్ చేయకూడదు, వారికి రెస్పెక్ట్ ఇవ్వాలి అని ప్రవచించారు. ఇంతకీ సంపదను సృష్టించేది ఎవరని మోడీ గారు అంటున్నట్లు? కార్పొరేట్ సేట్లు, పరిశ్రమాధిపతులు, ఆశ్రిత దూప్లికేట్ పెట్టుబడి దారులా? లేక దేశంలో కోట్లాది కర్షకులు, కార్మికులు, శ్రామికులా? శ్రామికుల శ్రమ నుండి ధనరాసులు పోగేసుకుని దేశ సంపదను శాసిస్తున్న వారా? లేక శ్రమను ధారపోస్తున్న వారా? మోడీ దృష్టిలో సంపదను సృష్టించేది టాటాలు, బిర్లాలు, అంబానీలు, ఆదానీలు వగైరా పెద్దలన్నమాట! వారు సంపదను సృష్టిస్తారు. దయాదాక్షిణ్యాలతో వారివద్ద పనిచేసేవారికి పెద్ద మనసుతో తాము సృష్టించిన సంపదను పంచుతారు. ఇంతటి దయార్ద్ర హృదయులను, దైవాంశ సంభూతులను సందేహంతో చూడడం, దొంగలనో, దోపిడీదారులనో వదరడం ఎంత అగౌరవం, ఎంత దౌష్ట్యం? వారు ఉండబట్టే కదా, అందరికీ బువ్వ దొరుకుతోంది? వీరే లేకపోతే జనం మలమల మాడిపోరా? ఇదీ వరస.

ఇటువంటి తలకిందుల ఆలోచనలతో నిండిన పాలక బుర్రలు తీసుకొచ్చే రకరకాల నూతన చట్టాలు ఎలా ఉంటాయి? ఎలా ఉంటాయంటే, నూతన సాగు చట్టాల్లా ఉంటాయి. 44 కార్మిక చట్టాలను రద్దుచేసి తెచ్చిన నాలుగు నూతన శ్రామిక నియమావళు ల్లా ఉంటాయి. నూతన భారతానికి నూతన శ్రామిక చట్టాలనే నగిషీ ముద్దు పేర్లతో, నగిషీ నగల్లా బయటకు మెరిసిపోతూ ఉంటాయి. కార్పొరేట్లకు బొనంజాగా (ధనరాసులుగా), కార్మికులకు బుల్లెట్లుగా ఉంటాయి.

2021 డిసెంబర్ 4న హిందూస్థాన్ టైమ్స్ జరిపిన 'లీడర్షిప్ సమ్మిట్' అనే పెట్టుబడి పెద్దల సభలో కేంద్ర ఆర్థిక మంత్రి నిర్మలా సీతారామన్ తమ ప్రభుత్వ ఆలోచనా విధానాలను ఇలా విడమర్చి చెప్పారు: మా ప్రభుత్వ విధానం వ్యాపార నిర్వహణను సులభతరం చేయడమే గాక అవి పాటించాల్సిన సంస్థల విధులను తేలికపర్చడం. కంపెనీలు పాటించాల్సిన ప్రాథమిక విధి, బాధ్యత కార్మిక చట్టాలను అమలు చేయడం. ఆ బాధ్యతను తేలిక పరచడం అంటే నామమాత్రంగానైనా మిగిలిన చట్టాలను తూతూ మంత్రంగా మార్చేయడం. పెట్టుబడిదారులకు మరిన్ని రాయితీలు, రుణ మాఫీలు సమకూరుస్తూ పనివారికి పంగనామాలు పెట్టడం. పనివారి కొనుగోలు శక్తి, జీవన ప్రమాణాలు, ఆరోగ్య ఆహార నాణ్యత పెంచడం కాదు, వాటిని మరింత దిగజార్చి ఉద్యోగపతుల జేబులు నింపడం. సరిగ్గా ఇదే చేశారు మోడీ అండ్ కో టీమ్. ఇప్పుడున్న 44 కార్మిక చట్టాలకు, వీటితో పాటు వివిధ రాష్ట్రాల పరిధిలో ఉన్న మరో 200 చట్టాలకు సున్నా చుట్టి ఓ 4 నూతన శ్రామిక నియమావళులను ప్రవేశపెట్టి ఓ విప్లవం తీసుకొచ్చినట్లు ఆర్భాటపు ప్రచారం చేసుకుంటున్నారు. ఇటువంటి చర్య ద్వారా కేంద్ర ప్రభుత్వం రాష్ట్రాల స్వతంత్ర అధికారాలను కుదించి వేసి సర్వం తానే అయి పాలన సాగించే కుటిల నీతికి పాల్పడుతోంది. అసలు ఈ 4 నూతన చట్టాల కథేమిటో కొంచెం చూద్దాం.

2019 ఆగస్టు నెల పార్లమెంట్ సమావేశాల్లో నాలుగు నూతన శ్రామిక నియమావళులను (బిల్లులను) భాజపా ప్రభుత్వం ప్రవేశ పెట్టింది. ఈ నాలుగులో ఒకటైన 'వేతన బిల్లు' సభలో అప్పుడే ఆమోదం పొందింది. మిగతా మూడు బిల్లులు ఉభయ సభల స్టాండింగ్ కమిటీకి వెళ్లి, మమ అనిపించుకుని, సెప్టెంబర్ 2020లో ఆమోదించబడ్డాయి. విస్తృత చర్చకు పెట్టకుండా ఎలా అయితే నూతన వ్యవసాయ చట్టాలను ప్రభుత్వం రైతులపై రుద్దిందో అదే తరహాలో ఈ నూతన శ్రామిక నియమావళిని కూడా ముందు వెనుకలు ఆలోచించకుండా నియంతృత్వ ధోరణితో తీసుకువచ్చింది. ప్రభుత్వం వీటిని చట్టాలుగా కూడా పరిగణించడం లేదు. కోడ్స్ అనే పిలుస్తోంది. కేవలం నియమావళి అని అంటోంది. పాత కార్మిక చట్టాలన్నిటినీ చెత్తబుట్టకి పంపించి, నాలుగే నాలుగు నూతన శ్రామిక నియమావళులు (కోడ్స్) తెరపైకి తెచ్చింది. ఏమిటి ఈ కొత్త శ్రామిక నియమావళులు? ఏ శ్రామిక చట్టాలు రద్దయి, ఏ కొత్త నియమావళులు తెరపైకి వచ్చాయి? కింద కొంత వివరణ ఉంది చూడండి.

**1. నూతన వేతన నియమావళి–2019: దీనితో రద్దయిన నాలుగు చట్టాలు:**

1936–వేతన చట్టం.

1948–కనీస వేతనాల చట్టం.

1965–బోనస్ చెల్లింపు చట్టం.

1976–సమాన వేతన చెల్లింపుల చట్టం.

**2. నూతన సామాజిక భద్రత నియమావళి–2020: దీనితో**

**రద్దయిన ఎనిమిది చట్టాలు:**

1948–ఉద్యోగుల రాష్ట్ర బీమా చట్టం.

1952–ఉద్యోగుల భవిష్య నిధి, వివిధ సౌలభ్యాల చట్టం.

1959–ఉద్యోగ నమోదు కార్యాలయాల (ఉద్యోగ ఖాళీల ఆవశ్యక ప్రకటన) చట్టం.

1961–ప్రసూతి ప్రయోజన చట్టం.

1972– గ్రాట్యుటీ చెల్లింపు చట్టం.

1981– సినీ శ్రామికుల యోగక్షేమనిధి చట్టం.

1996–భవన, ఇతర నిర్మాణరంగ పనివారి యోగక్షేమ శిస్తు చట్టం.

2008–అసంఘటిత శ్రామికుల సామాజిక భద్రతా చట్టం.

**3. నూతన పారిశ్రామిక సంబంధాల నియమావళి–2020: దీనితో రద్దయిన మూడు చట్టాలు:**

1926–ఉద్యోగ(కార్మిక సంఘాల చట్టం.

1945–పారిశ్రామిక ఉద్యోగ స్టాండింగ్ ఆర్డర్స్) చట్టం.

1947–పారిశ్రామిక వివాదాల చట్టం.

**4. పని ప్రదేశాల్లో సురక్ష ఆరోగ్య, స్థితిగతుల నూతన నియమావళి 2020 (ఆక్యుపేషనల్ సేఫ్టీ, హెల్త్ అండ్ వర్కింగ్ కండిషన్స్ 2020): దీనితో రద్దయిన పదమూడు చట్టాలు:**

1948 పరిశ్రమల చట్టం.

1952–గనుల చట్టం.

1986–రేవు(డాక్) పనివారి సురక్ష, ఆరోగ్య, సంక్షేమ చట్టం.

1996–భవన, ఇతర నిర్మాణరంగ పనివారి పనిస్థితుల పర్యవేక్షణ చట్టం.

1951– ఉద్యానవన (ప్లాంటేషన్) కార్మిక చట్టం.

1970–కాంట్రాక్ట్ కార్మికుల (క్రమబద్ధీకరణ) చట్టం.

1979–అంతర్రాష్ట్ర వలస కార్మికుల (ఉద్యోగితా నియంత్రణ, పనిస్థితిగతుల పర్యవేక్షణా) చట్టం.

1955–పాత్రికేయ, వృత్తి విలేఖరి, ఇతర వార్తా పత్రికా ఉద్యోగుల (పని స్థితిగతుల) చట్టం.

1958–పత్రికా వృత్తి విలేఖరి(జీతభత్యాల నిర్ణయ)చట్టం.

1961– మోటార్ వాహన కార్మిక చట్టం.

1976–వస్తు అమ్మక ఉద్యోగుల చట్టం.

1966–బీడీ, పొగచుట్టల కార్మిక (పని స్థితిగతుల) చట్టం.

1981– సినీ పనివారు, సినిమా థియేటర్ కార్మికుల చట్టం.

**నూతన శ్రామిక నియమావళి తీరుతెన్నులు:**

నూతన వేతన నియమావళి–2019, కనీస వేతనం లెక్కకట్టడానికి అరడజను మెలికలు పెట్టింది. కేంద్రం ఏదో ఘనమైన మేలు చేసినట్టు చూపిస్తూ ఇప్పుడున్న కనీస వేతనాలకు కూడా కోత పెట్టే మాయాజాలాన్ని ప్రవేశ పెట్టింది. గిగ్ (ప్రత్యేకమైన ఉద్యోగం కాకుండా గంటల లెక్క, కాంట్రాక్టు మీద ఐచ్ఛికంగా పనిచేసేవారు), ప్లాట్‌ఫారం (ఉబర్, ఓలా, జోమోటో వగైరా డిజిటల్ ప్లాట్‌ఫారాల) వర్కర్లకు వారి చేతిలో పడే నెల వేతనానికి వేటువేసి ఎప్పుడో వచ్చే ప్రావిడెంట్ ఫండ్‌లో జమచేసే తంత్రం చేసింది. ఇక కోట్లాది ఇతర తాత్కాలిక ఉద్యోగులకు, అసంఘటిత కార్మికులకు చాలా వెసులుబాటు కల్పిస్తున్నట్లు గీతలు గీసినా అవేవీ క్షేత్ర స్థాయిలో అమలయ్యేవి కావు, వారికి అందేవీ కావు.

ఇప్పటికే శరవేగంగా విస్తరిస్తున్న గిగ్ (సర్వం తాత్కాలిక) ఆర్థిక వ్యవస్థ పనివారిని కేవలం పొడిపొడి వ్యక్తులుగా, వాడి విసిరేసే సరుకులుగా మార్చేసింది. స్వతంత్ర, ఐచ్ఛిక పని విధానంతో ఒకే సంస్థకు, ఒకే తరహా పనికి బందీలై పోకుండా పనివారు విముక్తి పొందవచ్చనే భ్రమాత్మక భావనలను చొప్పించడం ద్వారా, పెట్టుబడి వీరిని నిరంతర అసంఘటిత వ్యక్తులుగానే మిగిల్చి వేస్తున్నది. అంతేగాక మొత్తం దేశ ఆర్థిక వ్యవస్థ నిర్మాణ పురోగతులకు తామే మూలమనే శ్రామిక వర్గ స్పృహ, చైతన్యం పూర్తిగా తుడిచి పెట్టుకు పోతున్నది. ఈ గిగ్ ఆర్థిక వ్యవస్థ విస్తరించే కొలది ఈ దేశ యువత భవిష్యత్తు ప్రశ్నార్థకంగా, అగమ్యగోచరంగా మారే ప్రమాద ఘంటికలు ఈ దగాకోరు నూతన శ్రామిక నియమావళులు మోగిస్తున్నాయి.

నూతన పారిశ్రామిక సంబంధాల నియమావళి–2020 ప్రకారం 300 వరకు పనివారు ఉండే ఏ సంస్థలోనైనా పనివారిని తొలిగించాలంటే ప్రభుత్వ అనుమతి పొందాల్సిన అవసరం లేదు. పాత చట్టాల ప్రకారం ఈ సంఖ్య 100కే పరిమితం. 100 మంది దాటితే గనుక పనివారి తొలగింపుకు ప్రభుత్వ అనుమతి అవసరమయ్యేది. ఇప్పుడా సంఖ్య 300కు పెంచారు. ఇప్పుడున్న ఆటోమేషన్ వెల్లువలో 300 పనివారు మించిన పరిశ్రమలు ఎన్ని ఉంటాయి? ఎన్నుంటాయో వేళ్లపై లెక్క పెట్టవచ్చు. అంటే ఏమైనట్టు? నూటికి 99 పరిశ్రమల్లో సునాయాసంగా పనివారిని ఇష్టానుసారం తొలగించే వెసులుబాటును ఈ నాలుగు చట్టాలు పారిశ్రామికవేత్తలకు, సంస్థలకు ఓ బహుమతిగా ఇస్తున్నాయన్నమాట. ఇక సమ్మెకు ఇచ్చే ముందస్తు నోటీసు ఇదివరలో 2 వారాలైతే ఇప్పుడు ఆ కాలాన్ని 60 రోజులకు పెంచారు.

మొత్తానికి చూస్తే ఈ నూతన కార్మిక నియమావళులు ఓ మాయ గారడీలా, కత్తిరింపులు, అతికింపులుగా ఉన్నాయి గాని కార్మికులకు నూతనంగా సమకూర్చే లబ్ధి ఏమీ వీటిలో కన్పించడం లేదు. కార్మికుల మేలు కోరి తెచ్చామని చెబుతున్న ఈ నూతన నియమావళి కార్పొరేట్ సులభతర వ్యాపారానికి అనువుగానే తెచ్చినట్లు ప్రధాన మంత్రితో సహా మొత్తం కేంద్ర, రాష్ట్ర యంత్రాంగాలన్నీ బాహాటంగానే చాటుకుంటున్నాయి. అంటే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కార్మికులకు ఏమి చెప్పి నమ్మబలుకుతున్నాయంటే... మీ మేలు కార్పొరేట్ బలుపులోనే ఉందని.

ఇప్పటికే నూటికి 95 శాతం శ్రామిక శక్తి అసంఘటిత రంగంలో కునారిల్లుతోంది. ఇందులో అధిక సంఖ్యాకులు ఏ చట్టాలు వర్తించని అభాగ్యజీవులు. 44 గొప్ప కార్మిక చట్టాలు వారికి చేసిందేమీ లేదు. ఇప్పుడు అందని ద్రాక్ష గుత్తుల్లా వేలాడుతూ ఊరించే ఈ నాలుగు నూతన శ్రామిక నియమావళులతో కొత్తగా ఒరిగేదీ లేదు. ఇక మిగిలిన 5 శాతం సంఘటిత శ్రామిక శక్తిని కూడా నిర్వీర్య పరచి, నిస్సహాయులను చేసి పెట్టుబడి పాదదాసులుగా మార్చడమే ఈ కొత్త నియమావళి ధ్యేయం.

'శ్రమయేవ జయతే, సత్యమేవజయతే', 'నూతన శ్రామిక నియమావళి నవభారత నిర్మాణానికి నాంది' అనే ముసుగు చీకటి ప్రగల్భాల మాటున పెట్టుబడి పాద సేవకు ఉపక్రమించిన ప్రభుత్వం యావత్ దేశ శ్రామిక శక్తిని పెట్టుబడికి కారుచవకగా గులాంగిరీ చేయమని, బానిసగా బతకమని ఈ చట్టాల ద్వారా తీర్మానించింది. ఈ చాతుర్వర్ణ చాణక్య నియమావళిని ఉద్యోగపతులు ముందుగా ముక్త కంఠంతో శ్లాఘించారు. అహో అద్భుతమని ఆకాశానికి ఎత్తారు. సహజంగానే కార్మిక సంఘాలు, ఉద్యోగ సంఘాలు ఈ నియమావళిని తీవ్రంగా వ్యతిరేకిస్తూనే ఉన్నాయి. వీటి ఉపసంహరణకు పట్టుబడుతూ ఉద్యమిస్తున్నాయి. ఇప్పటికే పలుమార్లు దేశవ్యాపిత సమ్మెలు నిర్వహించాయి. ఫిబ్రవరి 2022 ఆఖరి వారంలో తిరిగి దేశవ్యాప్త సమ్మెకు సైరన్ ఊదాయి.

ఈ నూతన శ్రామిక నియమావళిని అప్రజాస్వామికంగా, ఆర్భాటంగా పార్లమెంటులో మందబలంతో నెగ్గించుకుని రెండేళ్లు గడిచిపోతున్నది. డ్రాఫ్ట్ బిల్లులు తయారైనాయి. చాలా రాష్ట్రాలు కేంద్రాని కన్నా అత్యుత్సాహాన్ని ప్రదర్శించి హంగామా చేశాయి. అయితే ఇప్పటికీ చట్టాలుగా అవి రూపు దిద్దుకోలేదు. ఎందుకని? కారణ మేమిటి? ఏదో గొంతుకు అడ్డం పడ్డది. వీటిని విడమరిచి చదువుకుని లాభ నష్టాల బేరీజు వేసుకుంటే కార్పొరేట్లకు, ఉద్యోగపతులకు వీటితో సంతుష్టి సమకూరినట్లు లేదు. ప్రభుత్వం ఏదో పిచ్చిపని చేసినట్లు తోచింది. కొండకచో ప్రభుత్వం ఈ నూతన నియమావళి రచనలో అత్యుత్సాహం ప్రదర్శించి అనాలోచితంగా తమకు నష్టం కలగచేస్తోందని గ్రహించినట్లున్నాయి. గ్రహించి ప్రభుత్వ హస్తాలు మెలివేసినట్టు కన్పిస్తోంది.

ఇదొక అంశమైతే, రెండవది ఈ చట్టాలపై కార్మిక వ్యతిరేకత పెరగడం, సాగు చట్టాలకు వ్యతిరేకంగా సాగిన రైతాంగ ఉద్యమ విజయం తర్వాత కార్మిక–కర్షక ఐక్యత బలపడే పరిణామాలు చోటుచేసుకోవడం, మూడవది జరగబోయే పలు రాష్ట్రాల ఎన్నికల్లో ఓటమి భయం వెంటాడడం. వెరసి, ఈ కొత్త నియమావళులు చట్టరూపం దాల్చకుండా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రస్తుతానికి బుట్టలో కప్పెట్టినట్లు కనిపిస్తోంది.

దేశంలో పలు నిపుణులు, ట్రేడ్ యూనియన్ నాయకులు, ఈ కొత్త నియమావళులు పనివారికి పూర్తి వ్యతిరేకమైనవి గాను, ఉద్యోగపతులకు మేలు చేసేవి గాను ఉన్నాయని అభిప్రాయ పడుతున్నారు. సారంలో ఈ నియమావళి పనివారి సంఖ్య చుట్టూ అల్లబడింది కాబట్టి 300 లోపు పనివారు ఉండే వేలాది పరిశ్రమలు ఈ నియమావళి పరిధిలోకి రానే రావు. ఇటువంటి సంస్థల్లో పనివారిని తొలగించినా, సంస్థలను మూసివేసినా అడిగే హక్కు పనివారు కోల్పోతారు. అంతేకాక చట్టాల్లో పలు నిర్ణయాత్మక అంశాల నిర్వచనాలు లొసుగులతో కూడుకుని, పనివారికి నష్టం చేకూర్చే విధంగా ఉన్నాయి. ఇప్పటికే లేబర్ మార్కెట్ కాంట్రాక్టు మయమైన సందర్భంలో పనివారికి ఊరట కల్గించే నిర్దుష్టమైన, సరళమైన, న్యాయబద్ధమైన కార్మిక చట్టాలుగా ఈ నాలుగు నూతన శ్రామిక నియమావళులు లేనే లేవని ట్రేడ్ యూనియన్లు అంటున్నాయి.

ఐతే ప్రభుత్వ వాదన ఏమంటే ఈ 300 పనివారి సంఖ్యను నిర్ణయించడం ద్వారా చట్టం సరళీకరణ చెంది దేశంలో వ్యాపార సౌలభ్యత మెరుగుపడి ఉద్యోగాల సంఖ్య పెరుగుతుందని. కార్మిక సంఘాలు ఏమంటున్నాయంటే, ఇలా చేయడం ద్వారా ప్రభుత్వం

---

## బండ్రు నర్సింహులు గారికి జోహార్లు



*తెలంగాణ సాయుధ పోరాట యోధుడు, జనశక్తి నాయకుడు బండ్రు నర్సింహులు జనవరి 22న హైదరాబాద్‌లో మరణించారు. నల్లగొండ జిల్లా ఆలేరులో 1918లో ఒక పేద కుటుంబంలో జన్మించిన నర్సింహులు నిజాం పాలనలోని వెట్టిచాకిరీకి, నియంత దోపిడీ పాలనకు వ్యతిరేకంగా ఆంధ్ర మహాసభ కార్యకర్తగా రాజకీయ కార్యాచరణ ప్రారంభించారు. చరిత్రాత్మక భువనగిరి ఆంధ్ర మహాసభ (1944) లో వాలంటీర్ గా పని చేసి, ఆ తర్వాత సాయుధ పోరాట కాలంలో ఆలేరు, భువనగిరి ప్రాంతంలో ప్రజా ఉద్యమ నిర్మాణకృషి సాగించారు. కమ్యూనిస్ట్ పార్టీలో మొదటి చీలిక సందర్భంగా సిపిఐ (ఎం) లో చేరి, నక్సల్బరీ ప్రజ్వలన తర్వాత చండ్ర పుల్లారెడ్డి, తరిమెల నాగిరెడ్డి, దేవులపల్లి వేంకటేశ్వర రావుల నాయకత్వాన్ని సమర్థించారు. తర్వాత కాలంలో సిపిఐ (ఎం–ఎల్) విమోచన, జనశక్తి నాయకులుగా ఎన్నో భూస్వామ్య వ్యతిరేక పోరాటాలకు నాయకత్వం వహించారు. ఎన్నోసార్లు భూస్వాముల, పోలీసుల దాడులకు, నిర్బంధానికి గురయ్యారు, జైలు శిక్షలు అనుభవించారు. అరుణోదయ నాయకురాలిగా, సాంస్కృతిక కార్యకర్తగా సుప్రసిద్ధురాలైన కూతురు విమలతో సహా, కుటుంబమంతా విప్లవోద్యమంలో ఏదో ఒకస్థాయిలో భాగస్వామ్యం వహించారు. వంద సంవత్సరాల పుట్టినరోజు సందర్భంగా కూడ ఉత్తేజకరమైన సందేశం ఇచ్చారు. బండ్రు నర్సింహులు గారి విప్లవదీక్షను వీక్షణం కలెక్టివ్ వినమ్రంగా తలచుకుంటున్నది.*

ఉద్యోగపతులకు పనివారిని ఇష్టానుసారంగా తొలగించి వేసే, వేటు వేసే కత్తిని అందించిందని. అంచేత ఈ నియమావళి ఉద్యోగపతుల కొమ్ముకాసేదేనని వాదిస్తున్నాయి. అంతేగాక సమ్మె నోటీసు కాలాన్ని 60 రోజులకు పెంచడమంటే కార్మిక సంఘాల పాత్రను, ఉనికిని, పటుత్వాన్ని క్షీణింపచేయడమేనని వాపోతున్నాయి.

ఇక కార్మికులు, కార్మిక చట్టాలు, హక్కులు, సమ్మె నోటీసులు, సమ్మెలు వగైరా పదాలకు కాలం చెల్లిందా? సునాయాస వ్యాపారానికి ఎర్రతివాచీలు పరుచుకున్నాయా? విచ్చలవిడి అరాచక పెట్టుబడికి పచ్చతోరణ ద్వారాలు బార్లా తెరుచుకున్నాయా? అంటే అవునండి అవును అని మోడీ ప్రభుత్వం అంటోంది.

చూడండి, 73 ఏళ్లుగా ఏ ప్రభుత్వం చేయలేని, చేయని పనిని మేము చేసి చూపిస్తున్నాం. సునాయాస వ్యాపార నిర్వహణకు పెద్ద అడ్డంకిగా ఉన్న 44 ముళ్లడొంక చట్టాలను మంటపెట్టి ఆ బూడిదతో నాలుగే నాలుగు నూతన శ్రామిక చట్టాలను, కాదు కాదు శ్రామిక నియమావళులని రెండు రోజుల వ్యవధిలో పార్లమెంట్‌లో ప్రాణం పోసి ఇటు కార్మికులకు, అటు బడా పరిశ్రమాధిపతులకు, వ్యాపార వేత్తలకు, మధ్య చిన్న బచ్చా ఉద్యోగపతులకు, చిరు వ్యాపారస్తులకు సమన్యాయం తూకమేసి పంచాం! సంతోషంతో స్వీకరించి నవభారత నిర్మాణానికి నడుం కట్టండి అని చర్చుంటే కిట్టని, ఒంటికి అసలు పడనే పడని ఈ దేశ జుమ్లా ప్రధాని గారు బాకా ఊదుతున్నారు.

మరి ఇటువంటి పరిస్థితిలో ఈ దేశ శ్రామికులు ఏమి చెయ్యాలి? ఏ బాట పట్టాలి? వారు చేయాల్సిన మొట్టమొదటి పని భారతీయ జనతా పార్టీని అన్ని ఎన్నికల్లోనూ చిత్తుచిత్తుగా ఓడించడం.

రెండో పని రైతులతో జతకట్టి, పెట్టుబడి కోరలు పీకి, దేశ సంపదను తమ నిర్వహణలోకి తెచ్చుకోవడం. మొదటిది తక్షణం సాధ్యమయ్యే పనైతే, రెండవది దీర్ఘకాల ఉద్యమాలతో సాధ్యమయ్యేది.

*(రచయిత శ్రామికనేస్తం సంపాదకులు)*

వీ

## రచయితలకు సూచన

***తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. - సం.***

# అప్పుల ఊబిలో అన్నదాతలు

*భారత వ్యవసాయరంగ స్థితికీ, రైతుల దుస్థితికీ అద్దం పడుతూ వెలువడిన జాతీయ నమూనా సర్వే తాజా నివేదికను విశ్లేషిస్తున్నారు* **డా. ఎ. పున్నయ్య**

జలవనరుల పరివ్యాప్త ప్రాంతాలు ఆదిమానవ జీవనాభివృద్ధి కేంద్రాలు. సంచార ఆహార సేకరణ దశ నుండి సమీకృత ఆహారాభివృద్ధి వరకు స్థిర క్షేత్రాలన్నీ జలావరణ ప్రదేశాలే. సంచార జీవనానికి స్వస్తిచెప్పి మానవుడు ఆహారం కొరకు ఒక నిర్దిష్టమైన పద్ధతిలో మొక్కలను, జంతువులను పెంచి, పోషించి తద్వారా ఆహారాన్ని ఉత్పత్తి చేయగల స్వసాయమే వ్యవసాయం అన్నారు. మానవ జీవన వికాసంలో వ్యవసాయం అతి పెద్ద ఆవిష్కరణ. సామాజిక ఆర్థిక ప్రగతిలో వ్యవసాయభివృద్ధి ఒక కీలకాంశం కాగా భారతదేశం ప్రధానంగా వ్యవసాయక దేశం. ఈ వ్యవసాయం ప్రాచీన కాలం నుండి భారతీయ సంస్కృతికి, వారసత్వానికి ప్రధాన భూమిక పోషిస్తోంది.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత పాలకులు మొదటిగా దేశ మౌలిక అభివృద్ధికి వ్యవసాయ, పారిశ్రామిక రంగాలు అభివృద్ధి చెందాలని ఆశించారు. ముఖ్యంగా అన్ని రంగాల అభివృద్ధికి పునాది వ్యవసాయరంగమేనని పాలకులు గుర్తించారు. ఈ రంగం అభివృద్ధి ద్వారానే సమాజంలో ఉండే అనేక అసమానతలు నిర్మూలించవచ్చుననే ఉద్దేశంతో పంచవర్ష ప్రణాళికలు రూపొందించబడ్డాయి. పంచవర్ష ప్రణాళికల ఆధారంగా దేశ ఆర్థిక ప్రగతికి ఒక లక్ష్యాన్ని, దిశను నిర్దేశించినారు.

ఈ నేపథ్యంలో మొదటి పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయ రంగానికి అధిక ప్రాధాన్యత నిచ్చినారు. వ్యవసాయ అభివృద్ధికి అనేక నీటిపారుదల ప్రాజెక్టులు ప్రారంభించినారు. ఫలితంగా వ్యవసాయ రంగానికి కొంత వెలుగునిచ్చిన అనంతరం పాలకుల నిర్లక్ష్యం వలన అనుకున్న లక్ష్యాన్ని చేరుకోలేదు. పాలకులకు చిత్తశుద్ధి సన్నగిల్లడం, అధికారుల నిర్లక్ష్యం, నిరాసక్తత, అమలు చేసే ఉద్యోగుల అసమర్థత కారణంగా మొదటి పంచవర్ష ప్రణాళికలో లక్ష్యంగా నిర్ణయించిన భూసంస్కరణలు మొదలుకొని భూగరిష్ట పరిమితి చట్టం, జమీందారీ జాగీర్దారీ రద్దు, మధ్య దళారీల రద్దు, కౌలుదారీ చట్టాలు, ల్యాండ్ సెటిల్‌మెంట్స్, దున్నేవానికే భూమి అమలులో ప్రభుత్వాలు విఫలమయ్యాయి. అశాస్త్రీయ వ్యవసాయ విధానాలు రైతన్నను అప్పుల ఊబిలోకి లాగినాయి. దీనికి కారణాలు, ఫలితాలు ఇటీవలి జాతీయ గణాంక సంస్థ నివేదిక నేపథ్యంలో మరొకమారు చర్చనీయాంశ మైనాయి.

**ఫలితాలను వెల్లడించిన జాతీయ గణాంక సంస్థ:**

భారత ప్రభుత్వం దేశ సమగ్రాభివృద్ధి కొరకు ఆర్థిక ప్రణాళికల రూపకల్పనకు, వనరుల సమీకరణ, వృద్ధి, అభివృద్ధి, ఉపాధి కల్పనకు కృషిచేస్తూనే ఉంది. ఈ క్రమంలో దేశంలో ప్రభుత్వ ఫలాల ఫలితాలను మదింపు చేసి ప్రజల సామాజిక, ఆర్థిక జీవన ముఖచిత్రాన్ని తెలుసుకొనుటకు కేంద్ర గణాంక కార్యాలయం శాంపిల్ సర్వేలు నిర్వహిస్తుంది. సాధారణంగా ఒక్కొక్క రౌండ్ సర్వేకు ఒక్కొక్క ప్రత్యేక అంశాన్ని ఎంచుకుంటారు. ఈ క్రమంలో ఇటీవల ప్రకటించిన 77వ రౌండ్ అఖిల భారత రుణ భార, మదుపు నివేదిక వ్యవసాయ రంగం పరిస్థితిని తెలియచేసింది.

ఈ నివేదికచే దేశంలోని గ్రామీణ కుటుంబాల వ్యవసాయ కమతాల సైజు, రైతుల ఆర్థిక పరిస్థితులను వాస్తవికంగానూ, సమగ్రంగానూ విశ్లేషిస్తుంది. కాబట్టి భారతదేశ వ్యవసాయ రంగం సంపూర్ణ స్వభావాన్ని అర్థం చేసుకోవడానికి ఈ నివేదిక ఉపయోగపడుతుంది. ఈ నివేదిక కొరకు దేశ వ్యాప్తంగా 5,940 గ్రామాల్లోని 69,455 కుటుంబాల నుంచి సమాచారాన్ని సేకరించి విశ్లేషించారు. ఈ విశ్లేషణలో వ్యవసాయ కుటుంబాల ఆదాయాలు, ఖర్చులతో పాటుగా కుటుంబ సభ్యుల ఇతర ఆర్థిక కార్యకలాపాల నుండి పొందిన రాబడి, ఖర్చులను కూడా పరిగణలోకి తీసుకున్నారు. నివేదికలో పొందుపరిచిన సమాచారమంతా 2018 సంవత్సరానికి సంబంధించినది. జనవరి 2019 – డిసెంబర్ 2019 మధ్య కాలంలో జరిగిన సర్వే ఆధారంగా ఈ గణాంకాల్ని రూపొందించినట్లు జాతీయ గణాంకాల అధికారి ప్రకటించారు.

**అప్పుల ఊబిలో సగం మందికి పైగా రైతులు:**

జాతీయ గణాంక సంస్థ నివేదిక ప్రకారం దేశంలో సగం మందికి పైగా రైతులు అప్పుల ఊబిలో ఉన్నారు. కరోనాకు ముందు నాటి పరిస్థితులతో పోలిస్తే అప్పులపాలైన రైతు కుటుంబాల సంఖ్య అనూహ్యంగా పెరిగిందని తాజా అధ్యయనం తేల్చింది. 77వ రౌండ్ సర్వే ప్రకారం 2018 నాటికి దేశంలోని ఒక్కో రైతు కుటుంబం సగటు అప్పు గడిచిన 5 సంవత్సరాలలో 57 శాతం అధికమైంది. ఈ క్రమంలో గ్రామీణ ప్రాంతాల్లోని ప్రతి రైతు కుటుంబం అప్పుల్లో ఉందని, వారి కుటుంబాలపై సగటు అప్పు రు. 59,748గా ఉందని తేలింది. ఇక పట్టణ ప్రాంతాల్లోని రైతు కుటుంబాల సగటు అప్పు గ్రామీణ ప్రాంతాల రైతులకంటే రెట్టింపుగా రు. 1,20,336 ఉందని నివేదిక తెలిపింది. దేశంలో 50 శాతానికి పైగా రైతు కుటుంబాల సగటు అప్పు రు. 74,121 ఉంది. వీరు తీసుకున్న రుణాల్లో 69.6 శాతం బ్యాంకులు, కో ఆపరేటివ్ సొసైటీలు, ప్రభుత్వ

ఏజెన్సీల నుంచి ఉండగా 30.4 శాతం రుణం అధిక వడ్డీకి, వడ్డీ వ్యాపారుల నుండి పొందుతున్నారు. ఇక పట్టణ ప్రాంతాల్లోని రుణాల్లో 87 శాతం క్రెడిట్ ఏజెన్సీలు కాగా, 13 శాతం అధిక వడ్డీకి ప్రైవేట్ సంస్థల నుండి అందుకొంటున్నారు. గ్రామీణ ప్రాంతాల్లో 50 శాతానికి పైగా వ్యవసాయ కుటుంబాలపై సగటు అప్పు రు. 74,460 ఉండగా, వ్యవసాయేతర కుటుంబాలపై సగటు అప్పు రు. 40,432 ఉంది. పట్టణ ప్రాంతాల్లో స్వయం ఉపాధి కలిగిన కుటుంబాలపై సగటు అప్పు రు. 1,79,765 ఇతర కుటుంబాలపై సగటు అప్పు రు. 99,353 ఉందని ఎన్ఎస్ఓ నివేదిక పేర్కొంది.

**చాలీచాలని ఆదాయంతో సగటు రైతు:**

సర్వే నివేదికననుసరించి 2018లో ఒక్కో వ్యవసాయ కుటుంబానికి సమకూరే ఆదాయ వనరులు విస్మయానికి గురిచేస్తున్నాయి. ఒక రైతు నెలవారీ సగటు వేతనం రు. 4,063, పంట ఉత్పత్తి ద్వారా రు. 3,798, పశుపోషణ ద్వారా రు. 1,582, వ్యవసాయేతర వ్యాపారం ద్వారా రు. 641, భూమి లీజు తదితర వనరుల ద్వారా రు. 134. మొత్తం ఆదాయం రు. 10,218గా ఉంది. ఇది ఈ దేశ సగటు రైతు ఆదాయం! ఈ ఆదాయంతో విలాసవంతమైన జీవితాన్ని పక్కనబెడితే, సౌకర్యవంతమైన జీవితం కాదుకదా కనీస జీవితం కూడా ఇబ్బందికరమే. ఈ దుస్థితిలో అన్నదాత నిలబడడానికి కారణం ప్రభుత్వాలే.

**ప్రస్తుతం తెలంగాణాలో రైతే రాజు కదా!**

వ్యవసాయం దండుగ కాదు పండుగ అని బాకాలూదుకుంటున్న తెలంగాణాలో వ్యవసాయంపై ఆధారపడిన వారి ఆదాయం చాలా తక్కువ. తాజా నివేదిక ప్రకారం తెలంగాణాలో వ్యవసాయంపై ఆధారపడిన కుటుంబాలకు కూలీ పైకంతో కలుపుకొని చూస్తే సగటున నెలకు ఖర్చులు తీసేసిన తర్వాత మిగిలే నికర ఆదాయం కేవలం రు. 9,403 మాత్రమే. ఇది జాతీయ సగటు కంటే అక్షరాలా రు. 815 తక్కువ. జాతీయ సగటు రు. 10,218. మిగతా రాష్ట్రాల్లో వ్యవసాయ కుటుంబాల ఆదాయం జాతీయ సగటు కంటే రెండింతలు అధికం. అందులో మేఘాలయ ఒకటి కాగా అక్కడ వ్యవసాయ కుటుంబ ఆదాయం రు. 26,973. పంజాబ్‌లో రు. 21,703. మిగిలిన 21 రాష్ట్రాల్లో వ్యవసాయ కుటుంబాల సగటు ఆదాయం తెలంగాణ రాష్ట్రంలోని వ్యవసాయ కుటుంబాల సగటు ఆదాయం కన్నా ఎక్కువ.

ఇక సాగు కోసం రైతులు చేసే వ్యయం తెలంగాణ రాష్ట్రంలో నెలకు రు. 6,543. ఈ విషయంలో తెలంగాణ రాష్ట్రం కంటే 24 రాష్ట్రాల్లో ఖర్చు తక్కువ ఉండడం గమనార్హం. హర్యానా, పంజాబ్‌లో మాత్రమే తెలంగాణ కన్నా ఎక్కువ ఖర్చు చేస్తున్నారు. జాతీయ సగటు వ్యయం రు. 2,959. జాతీయ స్థాయిలో ఖర్చులు పోను రైతుల నికర ఆదాయం రు. 4,001. అరుణాచల్ ప్రదేశ్, హర్యానా, మిజోరం, పంజాబ్, ఉత్తరాఖండ్, మేఘాలయ రైతుల నికర ఆదాయం తెలంగాణ రాష్ట్ర రైతుల నికర ఆదాయం కన్నా ఎక్కువ. ఖర్చులు పోను హర్యానా రైతుల నికర ఆదాయం రు. 12,019 కాగా పంజాబ్ రైతు ఆదాయం రు. 17,063, మేఘాలయ రైతు ఆదాయం రు. 21,060. అయితే ఇతరేతర మార్గాల ద్వారా వచ్చే ఆదాయం కూడా ఇతర రాష్ట్రాల్లో చాలా ఎక్కువ.

**చిన్న, సన్నకారు రైతులే తెలంగాణ రాష్ట్రంలో అధికం:**

తెలంగాణలో మొత్తం 60,95,134 కుటుంబాలు గ్రామాల్లో నివసిస్తున్నాయి. ఇందులో 54.2 శాతం కుటుంబాలు వ్యవసాయాన్ని నమ్ముకొని బతుకుతుండగా, 45.8 శాతం కుటుంబాలు వ్యవసాయేతర పనులు చేసుకుంటున్నాయి. వ్యవసాయంపై ఆధారపడి బతుకుతున్న కుటుంబాల సగటు భూ విస్తీర్ణం 2.13 ఎకరాలు. ఐదు ఎకరాల లోపు భూమి కలిగిన రైతులు సుమారు 90.75 శాతం ఉంటారు. కమతాల సంఖ్య సుమారు 27.54 లక్షలు. నేషనల్ స్టాటిస్టికల్ కమిషన్ నివేదిక ప్రకారం భూమి కౌలుకు తీసుకున్న కుటుంబాలు 11.3 శాతం. సగటున ఒక్కో కౌలు రైతు 1.45 ఎకరాలు కౌలుకు తీసుకున్నాడు. సగటున కౌలుకు ఇచ్చిన కుటుంబాలు 3.8 శాతం. వారు కౌలుకు ఇచ్చిన సగటు భూమి విస్తీర్ణం 2.82 ఎకరాలు. ఈ నివేదిక ప్రకారం చిన్న, సన్నకారు రైతులే తెలంగాణ రాష్ట్రంలో అధికంగా ఉన్నారు.

దేశంలో వ్యవసాయ కుటుంబాల సంఖ్య 9.3 కోట్లుగా అంచనా వేశారు. ఇందులో ఇతర వెనుకబడిన వర్గాలు 45.8 శాతం, షెడ్యూల్డ్ కులాలు 15.9 శాతం, షెడ్యూల్డ్ తెగలు 14.2 శాతం, ఇతరులు 24.1 శాతం. 83.5 శాతం గ్రామీణ కుటుంబాలు 1 హెక్టార్ కంటే తక్కువ భూమిని కలిగి ఉండగా, 0.2 శాతం మాత్రమే 10 హెక్టార్ల కంటే ఎక్కువ భూమిని కలిగి ఉన్నారు. వీరంతా సగటు రుణభారం మోస్తున్న అన్నదాతలే.

**సంస్థాగత రుణాలు రైతులు:**

ఈ నివేదిక ప్రకారం విపరీతమైన రుణ భారమున్న రైతు కుటుంబాల నిష్పత్తిలో దేశంలో తెలంగాణ రెండో స్థానంలో నిలిచింది. తెలంగాణలో మొత్తం రైతు కుటుంబాలలో 91.7 శాతం రుణ భారంతో కునారిల్లుతుంది. తెలంగాణ కంటే పైన 93.2 శాతం కుటుంబాలు రుణ భారంతో ఆంధ్రప్రదేశ్ ఉన్నది. దేశవ్యాప్తంగా రైతు కుటుంబాల సగటు అప్పు రు. 74,121 కాగా, తెలంగాణలో అది రు. 1,52,113, ఆంధ్రప్రదేశ్‌లో రు. 2,45,554. ఈ సగటు అంకెలు వాస్తవ స్థితికి స్థూల సూచిక మాత్రమే అనుకున్నా దేశవ్యాపతంగా రైతు కుటుంబపు సగటు అప్పుకన్నా చాల ఎక్కువ.

ఆ నివేదిక రైతుల రుణ వనరులను మరింత వివరంగా కూడా నమోదు చేసింది. మిగిలిన 57.5 శాతం రుణగ్రహీత రైతులలో 9.1 శాతం బంధుమిత్రుల దగ్గర రుణాలు తీసుకోగా 41.3 శాతం రైతులు వడ్డీ వ్యాపారుల దగ్గర రుణాలు తీసుకున్నారు. రైతులు ఎంతెంత అధిక వడ్డీలకు రుణాలు తీసుకున్నారో? అసలు, వడ్డీ చెల్లించలేక ఏయే ఇబ్బందులకు గురౌతున్నారో, ఏ విషవలయాల ఊబిలోకి దిగజారి స్థిరచరాస్తులను అమ్ముకోవాల్సి వస్తుందో, ఎందరు రైతులు కూలీలుగా పట్టణాలకు తరలి అపార్ట్‌మెంట్లల్లో సెక్యూరిటీ గార్డులుగా, పనిమనుషులుగా, బిచ్చగాళ్లుగా మారుతున్నారో

తెలంగాణలో  లెక్కలేదు.

దేశంలో సగటున 69.6 శాతం రైతు కుటుంబాలకు సంస్థాగత రుణాలు అందుతుండగా, ఇలాంటి రుణాలు ఆంధ్రప్రదేశ్‌లో 49.6 శాతం, తెలంగాణలో 42.5 శాతం మందికే అందాయి.  దానివల్ల వడ్డీ వ్యాపారులను ఆశ్రయించాల్సి వస్తోంది. ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయ వడ్డీ వ్యాపారుల నుంచి అప్పులు తీసుకున్నవారు 31.1 శాతం ఉండగా, సాధారణ వడ్డీ వ్యాపారుల నుంచి తీసుకున్నవారు 15.4 శాతం మంది ఉన్నారు.  తెలంగాణలో వ్యవసాయానికి రుణం ఇచ్చేవారి నుంచి 9.1 శాతం మంది తీసుకోగా, సాధారణ వడ్డీ వ్యాపారుల నుంచి 41.3 శాతం మంది రుణాలు అందుకున్నారు. ఇలా తీసుకునేవారి సంఖ్య దేశంలోనే అత్యధికంగా తెలంగాణలో ఉంది. వాణిజ్య బ్యాంకుల నుంచి దేశంలో సగటున 44.5 శాతం కుటుంబాలకు రుణాలు అందుతుండగా, ఆంధ్రప్రదేశ్‌లో అది 34.1 శాతం, తెలంగాణలో 24.8 శాతంకే పరిమితమైంది. దేశవ్యాప్తంగా వ్యవసాయ రుణాల్లో కేవలం 57.5 శాతం మొత్తాన్ని వ్యవసాయ అవసరాలకు, మిగిలిన మొత్తాన్ని ఇతర అవసరాలకు వాడుకుంటున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో 60.3 శాతం, తెలంగాణలో 63 శాతం మొత్తాన్ని వ్యవసాయం కోసమే ఉపయోగిస్తున్నట్లు కేంద్ర గణాంక శాఖ విడుదల చేసిన నివేదికలో పేర్కొంది. జాతీయ సగటు అప్పు రు. 74,121తో పోలిస్తే ఆంధ్రప్రదేశ్‌లోని ఒక్కో కుటుంబంపై 221 శాతం, తెలంగాణలోని కుటుంబంపై 105 శాతం అధిక అప్పు ఉంది. ఈ  రుణభార గణాంకాలన్నీ కోవిడ్ లాక్‌డౌన్‌కు ముందరివి. కోవిడ్ సృష్టించిన ఉత్పాతానికి ఆర్థిక వ్యవస్థ అతలాకుతలం అయింది. ఆ తర్వాత ఈ రుణభారం మరెంత పెరిగి ఉంటుందో?

**రైతుల ఆత్మహత్యలకు నివేదిక చూపిన కారణాలు:**

తెలంగాణాలో వ్యవసాయ పెట్టుబడుల కొరకు 60 నుంచి 70 శాతం రైతు కుటుంబాలవారు ఇళ్లలోని మహిళల ఒంటిపై ఉండే బంగారు ఆభరణాలను బ్యాంకులు, ఫైనాన్స్ సంస్థల్లో తాకట్టు పెడుతున్నారు. రుతుపవనాలపై ఆధారపడిన రైతుకు ఏపుగా పంటలు పెరుగుతున్న క్రమంలో ప్రకృతి కరుణించక కొన్నిసార్లు పంట నష్టం జరిగి, పంట పండినా అకాల వర్షాలకు పంటలు పాడైపోయి ఆశించిన దిగుబడి రాకపోవడమే కాక, చాలా చోట్ల పంటలు కుళ్లిపోయిన ఉదంతాలున్నాయి. వరుసగా రెండేళ్ల అప్పులు రైతులకు మోయలేని భారంగా మారి, అప్పిచ్చిన బ్యాంకర్లతో పాటు ప్రైవేట్ వ్యాపారులు కూడా ఒత్తిడి చేయడంతో పాటు కుటుంబ పోషణ కూడా భారంగా మారిన సమయంలో అప్పుల ఒత్తిళ్లు, అవమానాలు, భవిష్యత్తుపై భరోసా లేకపోవడం రైతులను ఆత్మహత్యలకు పురిగొల్పుతున్నాయని నివేదిక వెల్లడించింది.

**ప్రపంచీకరణ వ్యవసాయ సంక్షోభం-గ్రామీణ అసమానతలు:**

దేశంలో వ్యవసాయ సంస్కరణలు, గ్రామీణ వ్యవసాయ నిర్మాణంలో ప్రభుత్వ పెట్టుబడుల కొరత వల్ల వ్యవసాయ రంగం సంక్షోభంలో పడింది. ఫలితంగా ప్రపంచంలోనే అత్యంత ఎక్కువ గ్రామీణ అసమానతలు ఉన్న దేశాల్లో మన దేశం ఒకటిగా ఉంది. గ్రామీణ వ్యవస్థలో అప్పటికే ఉన్న అసమానతలను 1991 తరువాత వ్యవసాయ రంగాన్ని కమ్మేసిన సంక్షోభం మరింత తీవ్రతరం చేసింది. వ్యవసాయ వృద్ధి రేటు మందగించింది. ప్రభుత్వ పెట్టుబడులు పూర్తిగా తగ్గిపోయాయి. పెట్టుబడి సబ్సిడీలలో కోతల ఫలితంగా పెట్టుబడి ఖర్చులు భారీగా పెరిగాయి. గత మూడు దశాబ్దాలుగా అమలవుతున్న సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక  విధానాల ఫలితంగా  తీవ్ర వ్యవసాయ సంక్షోభం ఏర్పడి నాలుగు లక్షల మంది రైతుల ఆత్మహత్యలకు దారి తీసింది. స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందాల ఫలితంగా ఆర్థిక దోపిడీకి అవకాశం ఉన్న దిగుమతుల ప్రవాహం పెరగడం వల్ల సరుకుల, వ్యవసాయ ఉత్పత్తుల  ధరలు కుప్పకూలాయి. దాంతో అన్ని పంటలపై లాభదాయకంగా ఉండే ధరలు తగ్గిపోయాయి. చిన్న, సన్నకారు రైతులకు అందాల్సిన ఆర్థిక వనరులను ధనిక వర్గాలకు, బడా కార్పొరేట్ సంస్థలకు మళ్లించారు. ప్రస్తుతం రైతాంగం ఎదుర్కొంటున్న సంక్షోభానికి, నిరంతరాయంగా అమలవుతున్న సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాలే ప్రధాన కారణం. ప్రపంచీకరణ విధానాలను అమలు చేసిన ఈ 30 ఏళ్ల కాలంలో సంస్కరణలు వ్యవసాయ రంగంలో వృద్ధిని సాధించడంలో విఫలమయ్యాయి. ప్రభుత్వం 2015-2022 మధ్య కాలంలో వ్యవసాయ ఆదాయాన్ని రెట్టింపు చేస్తానని వాగ్దానం చేసింది. వాస్తవానికి ఈ కాలంలో రైతుల ఆదాయాలు బాగా పడిపోయాయి. పెద్దనోట్ల రద్దు, అనాలోచితమైన జిఎస్‌టి పన్ను విధానం, అనాగరికంగా విధించిన లాక్‌డౌన్ లాంటి నిర్ణయాలు రైతుల స్థితిగతులను దుర్భరం చేశాయి.

ప్రపంచ బ్యాంకు ఆదేశాలను అమలుపరుస్తున్న పాలకులు స్థానిక రైతుల అవసరాలను తప్పుగా అర్థం చేసుకోవడంతో వ్యవసాయ రంగంలో సంస్కరణలు విఫలమయ్యాయి. వ్యవసాయ సంస్కరణల్లో భాగంగా వ్యవసాయానికి భారీ ప్రభుత్వ పెట్టుబడులు అవసరం. రైతులను స్వయంశక్తితో, స్వతంత్రంగా నిలబెట్టాలి తప్ప  వ్యవసాయ రంగంలో దేశీయంగా, బయట కూడా మార్కెట్లు తెరిస్తే, వ్యవసాయ రంగం దానంతటదే పెరగడం ప్రారంభమవుతుందని మన విధాన నిర్ణేతలు ఊహించుకున్నారు. చిన్న రైతుల ఉత్పత్తిని పెంచడంలో, రైతులను స్వయం సమృద్ధి వైపుగా నడిపించడంలో విఫలమైనారు. దీనికితోడు స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందాలు వ్యవసాయ రంగానికి ప్రమాదం తెచ్చిపెట్టాయి. చౌకగా లభించే వస్తువులను దిగుమతి చేసుకోవడంతో ధరలు బాగా పడిపోయి, వ్యవసాయ రంగం తీవ్ర సంక్షోభంలోకి నెట్టబడింది. లోపభూయిష్టమైన ఆర్థిక సంస్కరణల అమలుతో, వ్యవసాయ రంగంలో పెట్టుబడుల పట్ల అనుసరించిన అసంబద్ధ విధానాలతో సన్న, చిన్నకారు రైతులు సంకటంలో పడుతున్నారు.

మంచి లాభాలతో ధాన్యాలను ఉత్పత్తి చేసే చిన్న, సన్నకారు రైతుల సామర్థ్యంపై ప్రభుత్వ వ్యయంలో కోతలు ప్రభావం చూపుతున్నాయి. కార్పొరేట్ల లాభాలు, సబ్సిడీలలో కోతలు విధిస్తున్న కారణంగా పెట్టుబడి ఖర్చులు బాగా పెరుగుతున్నాయి. రైతులు బహుళజాతి కార్పొరేషన్లపై ఆధారపడేవారిగా మారిపోతున్నారు. ఇవన్నీ చిన్న, సన్నకారు రైతులను పీల్చి పిప్పి చేస్తున్నాయి. దీంతో

# స్థానికతను పాతర వేసిన 317 జీఓ

*తెలంగాణ ఉద్యోగ, ఉపాధ్యాయ వర్గాల స్థానికతను గౌరవించకుండా, అప్రజాస్వామికంగా ప్రభుత్వం ఇచ్చిన ఉత్తర్వులు ఎలా అన్యాయమైనవో వివరిస్తున్నారు* **తండా సదానందం**

ఏ నినాదం వెనుక ఎవరి ప్రయోజనాలు దాగి ఉన్నాయో అర్థం చేసుకోలేనంత కాలం ప్రజలు మోసపోతూనే ఉంటారని కామ్రేడ్ లెనిన్ అన్నది అక్షరాల సత్యం. తెలంగాణ ఉద్యమ కాలంలో ముఖ్యమంత్రి గారి మాయ మాటలు, హామీలు, వారు ఇచ్చిన నినాదాలను నమ్మి మోసపోవడం తెలంగాణ ఉపాధ్యాయుల వంతయింది. కొట్లాడి, పోరాడి ప్రజాస్వామిక ఆకాంక్షల కోసం, ముఖ్యంగా స్థానికత ఆధారంగా నియామకాల కోసం సాధించుకున్న స్వరాష్ట్రం అయిన తెలంగాణలో పరాయీకరణ గావించబడి పుట్టి, పెరిగిన, చదివిన స్వస్థలాలను, వయసుడిగిన తల్లిదండ్రులను, అప్పుడే వికసిస్తున్న పిల్లాపాపలను వదిలి ఉద్యోగ, ఉపాధ్యాయులు జిల్లాల కేటాయింపు, క్యాడర్ విభజనల పేరిట ఇతర జిల్లాలకు విసిరి వేయబడ్డారు.

తెలంగాణ రాష్ట్రం ఆవిర్భవించిన తర్వాత ఆంధ్ర పాలనలో పరిష్కరించబడని సమస్యలు పరిష్కరించబడతాయని, మెరుగైన సౌకర్యాలు, సంక్షేమం అందుతాయని, భార్య భర్తలు ఒకే దగ్గర పని చేస్తూ కుటుంబాలతో హాయిగా సంతోషంగా జీవిస్తామని కలలుగన్న కలలు కల్లలుగానే మిగిలి పోతాయని, ఆ భ్రమలు పటాపంచలై తమ ఆశలు ఆశయాలను నిర్వీర్య పరిచి అర్ధాంతరంగా కొంతమంది సీనియర్ల ప్రయోజనాల కోసం, స్వార్థ రాజకీయ ప్రయోజనాల కోసం స్థానికతకు పాతర వేసి, సీనియార్టీ ప్రాతిపదికన 317 జీవో తీసుకువచ్చి 33 జిల్లాలకు కేటాయింపులు చేయడం తెలంగాణ రాష్ట్ర ఉపాధ్యాయులకు శాపమైంది. కుటుంబాన్ని ఉద్యోగాన్ని వదల్లేక పలువురు ఉపాధ్యాయులు కన్నీరు మున్నీరవుతున్నారు. ఈ 317 జీవో ప్రకారం దాదాపు 22,418 మందికి పైగా టీచర్లు, 13,760 మంది ఉద్యోగులు మొత్తం 36,178 మంది ఇతర జిల్లాలకు కేటాయించబడినారు. నిర్బంధ విభజనకు గురై ప్రభుత్వ దమనకాండకు బలి కాబడి తీవ్ర ఆందోళనకు గురవుతున్న ఉపాధ్యాయుల జీవితంలో అలజడి తీసుకువచ్చింది 317 జీవో.

సమస్యల పరిష్కారం కోసం చర్చించకుండా కక్షసాధింపు ధోరణితో ఏకపక్షంగా నిర్ణయాలు తీసుకుంటూ ఉద్యోగ, ఉపాధ్యాయులను మానసిక అశాంతికి గురి చేస్తూ, ఒత్తిడితో అసువులు బాసే విధంగా ఇబ్బందులకు గురి చేస్తుండటం అమానవీయం. రాష్ట్ర ఏర్పాటు వరకున్న పది జిల్లాలను 2016లో 31 జిల్లాలుగా పునర్విభజన చేసి జోనల్ వ్యవస్థ ను రద్దు చేయడం జరిగింది. జోనల్ వ్యవస్థ రక్షణ కోసం ఐక్య ఉద్యమాలు తీవ్రతరం కావడంతో సరిగ్గా సంవత్సరం తర్వాత రాష్ట్ర ప్రభుత్వం 31 జిల్లాలను ఏడు జోన్లుగా, రెండు మల్టీ జోన్లుగా ఏర్పాటు చేయడం జరిగింది. దీంతో ఉద్యోగులను కూడా

---

అనివార్యంగా రైతు అప్పుల ఊబిలోకి నెట్టివేయబడుతున్నాడన్నది కాదనలేని సత్యం.

**ముగింపు:**

దేశంలో ఎక్కువ మంది చిన్న, సన్నకారు రైతులే. వారంతా ఎన్నో ఏండ్లుగా అప్పులపాలై ఉన్నారు. వీరికి ప్రభుత్వం నుంచి అందుతున్న సాయం అంతంత మాత్రమే. బ్యాంకు లోన్‌లు అందవు. ప్రైవేట్ రుణాలే ఆధారం. సాంకేతిక సాయం అందించగలిగే వ్యవస్థ లేదు. పంట నష్టపోతే పరిహారమూ దొరకదు. వ్యవసాయ అనుబంధ రంగాల నుంచి వస్తున్న రాబడీ తక్కువే. సంక్షుభిత రంగంగా మారిన వ్యవసాయం నుండి రైతు తప్పుకుంటే మేకిన్ ఇండియా మెతుకు లేని ఇండియాగా మారుతుంది. అప్పుల భారతం ఆకలి భారతమై అల్లాడకముందే రైతు రుణ విముక్త భారతానికి నాంది పలకాలి.

కనుక రైతు రుణభారం నుండి విముక్తి చెంది రైతు స్వయం సమృద్ధి సాధించాలంటే స్వామినాథన్ కమిటీ నివేదించినట్లు పెట్టుబడికి అయిన ఖర్చుకు అదనంగా యాభై శాతం కలిపి మద్దతు ధరగా హామీ ఇవ్వాలి. నిర్దిష్టంగా వ్యవసాయానికి వినియోగించే విద్యుత్, పెట్రోల్-డీజిల్-గ్యాస్ ధరలను సగానికి తగ్గించాలి. రైతులు-వ్యవసాయ కార్మికుల రుణాలను పూర్తిగా రద్దు చేయాలి. ప్రధానంగా ఇన్సూరెన్స్ కంపెనీలకు కాకుండా బాధల్లో ఉన్న రైతాంగానికి పంట బీమా పథకం ద్వారా లబ్ధి చేకూర్చాలి. సన్న-చిన్నకారు రైతులకు తక్కువ వడ్డీతో రుణ సౌకర్యం కల్పించాలి. మహాత్మా గాంధీ జాతీయ గ్రామీణ ఉపాధి హామీ చట్టం కింద వ్యవసాయ కార్మికులకు రెట్టింపు పని దినాలు, రెట్టింపు వేతనాలను అమలు చేయాలి. గిరిజన రైతులకు అటవీ హక్కుల చట్టాన్ని అమలు చేయాలి. రైతులకు రుణమాఫీ పథకాన్ని అమలు చేయాలి. ఉత్పత్తి ధర తగ్గించే విధానాలను తీసుకురావడంతో పాటు దిగుబడి పెంచడానికి పాటించాల్సిన పద్ధతులపై రైతులకు అవగాహన కల్పించాలి. సబ్సిడీపై వ్యవసాయ యంత్ర పరికరాలు అందించాలి. సాగు ఖర్చులు, ఎరువుల ధరలు, ముడిపదార్థాల ధరలు విపరీతంగా పెరిగాయి. ఆ భారాన్ని రైతులపై నెట్టకుండా ప్రభుత్వమే భరించాలి. ఇవన్నీ ప్రభుత్వాలు పకడ్బందీగా అమలు చేస్తే రైతు రాజు కాకపోయినా కనీసం రుణ విముక్తుడౌతాడు.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ విశ్వవిద్యాలయం)* వీ

ఆర్డర్ టు సర్వ్ పేరిట తాత్కాలికంగా కొత్త జిల్లాలకు కేటాయించడం జరిగింది. ఫలితంగా ఆకస్మికంగా జరిగిన ఈ నిర్ణయానికి పలువురు ఉద్యోగులు అనేక ఇబ్బందులు ఎదుర్కొన్నా, తాత్కాలికమే కాబట్టి పరిపాలనా సౌలభ్యం కోసం, ప్రజలకు చేయూతనందించే కార్యక్రమంగా భావించి తమ ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తించారు. ఉపాధ్యాయులను మాత్రం వారు పనిచేస్తున్న పాఠశాల ఏ జిల్లా పరిధిలోకి వస్తే ఆ జిల్లా ఉద్యోగులుగా పరిగణించారు.

జిల్లాల ఏర్పాటు జరిగిన రెండు సంవత్సరాల తర్వాత ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఉన్న రాష్ట్రపతి ఉత్తర్వులను రద్దు చేస్తూ నూతన రాష్ట్రపతి ఉత్తర్వులను తెలంగాణ పబ్లిక్ ఎంప్లాయ్మెంట్ ఆర్గనైజేషన్ ఆఫ్ లోకల్ క్యాడర్ అండ్ రెగ్యులరైజేషన్ ఆఫ్ డైరెక్ట్ రిక్రూట్మెంట్ ఆర్డర్ 2018 (పివో -2018)గా జిఎస్ఆర్ 820(వ) ఆగస్టు 29, 2018 న జారీ చేయడం జరిగింది. రాష్ట్ర ప్రభుత్వం జిఓ ఎంఎస్ నెంబర్ 124 తేదీ 30.8.2018 ద్వారా అమలులోకి తెచ్చింది. తర్వాత ఎన్నికల హామీలో భాగంగా 2019 ఫిబ్రవరిలో ఏర్పాటు చేసిన ములుగు, నారాయణ పేట్ జిల్లాలను చేర్చి, వికారాబాద్ జిల్లాను చార్మినార్ జోన్ లోకి మార్చి రాష్ట్రపతి సవరణ ఉత్తర్వులు 271(ఈ)పేరిట 16.4.2021న విడుదల కాగా రాష్ట్ర ప్రభుత్వం జీవో ఎంఎస్ నెంబర్ 128, తేదీ 30.6.2021 ద్వారా అమల్లోకి తెచ్చింది. కొత్త జోనల్ వ్యవస్థను ఏర్పాటు చేస్తూ రాష్ట్రపతి ఉత్తర్వులు వెలువడిన 36 నెలల్లోగా రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగాలను జిల్లా, జోనల్, మల్టీ జోనల్ క్యాడర్లుగా వర్గీకరించాలి అనే నిబంధన ఉండగా తుది గడువు సమీపిస్తున్న తరుణంలో హడావుడిగా ఆగస్టు 2021లో స్థానిక క్యాడర్ల వర్గీకరణ ఉత్తర్వులు జిఓ ఎంఎస్ నెంబర్ 141 నుండి 258 వరకు విడుదల చేయడం జరిగింది.

స్థానికత ఆధారంగా సీనియారిటీని పరిగణనలోకి తీసుకొని కేడర్ విభజన చేయడం జరుగుతుందని ఉద్యోగ, ఉపాధ్యాయులు భావించారు. శాశ్వత ప్రాతిపదికన జిల్లాల కేటాయింపు జరుగుతుందని ఉద్యోగ, ఉపాధ్యాయ సంఘాలతో చర్చించిన పిదప క్యాడర్ విభజన జరుగుతుందని ఆశించారు. అందుకు విరుద్ధంగా ప్రభుత్వం అనుకూల భజన సంఘాలైన ఒకటి రెండు సంఘాల నాయకులతో రహస్యంగా మంతనాలు జరిపి చీఫ్ సెక్రటరీ, ముఖ్యమంత్రి కనుసన్నలలో ఏకపక్షంగా గత నెల డిసెంబర్ 6న విడుదల చేసిన 317 జిఓ బాంబ్ ఉద్యోగుల నెత్తినపడి పేలింది. దీంతో ఉపాధ్యాయ, ఉద్యోగ వర్గాల్లో తీవ్ర ఆందోళన చెలరేగింది. జిల్లాల కేటాయింపుకు ఉద్యోగులకు 60 రోజుల సమయాన్ని గడువుగా ఇవ్వాలని, రాష్ట్రపతి ఉత్తర్వులు నాలుగవ పేరా నాలుగో పాయింట్లో విశదీకరిస్తున్నా ఆరు గంటల సమయం కూడా ఇవ్వకుండా ఆప్షన్ల ఎంపిక చేసుకోవాలని ఆగమేఘాల మీద జిల్లా కలెక్టర్లు, శాఖాధిపతుల ద్వారా తెలియజేసి, తీవ్ర గందరగోళంని సృష్టించి ఉపాధ్యాయులను అయోమయానికి గురి చేయడం జరిగింది.

ఆప్షన్ల ఎంపికపై తమ కుటుంబ సభ్యులతో చర్చించుకునే అవకాశం కూడా లేకుండా చేయడంతో అయోమయానికి గురైన ఉపాధ్యాయులు కొంతమంది జిల్లాల ఎంపిక ప్రాధాన్యతలు సరిగ్గా ఇవ్వక, ఇతర జిల్లాలకు కేటాయింపపడటంతో నానా ఇబ్బందులను ఎదుర్కొంటున్నారు. కేడర్ల విభజనపై, జిల్లాల కేటాయింపుపై ఉద్యోగ ఉపాధ్యాయులకు క్షుణ్ణంగా తెలియ పరచేందుకు శిక్షణ శిబిరాలను ఏర్పాటు చేసి ఆప్షన్ల ఎంపిక ప్రక్రియ పూర్తి చేస్తే బాగుండేది. అలా కాకుండా ఆకస్మికంగా కలెక్టర్లకు ఉత్తరువులు ఇచ్చి వెంటనే అమలు పరిచే ప్రయత్నం చేయడంతో ఉపాధ్యాయ, ఉద్యోగ వర్గంలో తీవ్ర ప్రకంపనలు మొదలయ్యాయి. క్షేత్రస్థాయిలో ఉపాధ్యాయుల, ఉద్యోగుల మనోభావాలను, మానసిక స్థితిని తెలుసుకోకుండా రాజధాని నగరం చుట్టూ ఉన్న గుప్పెడు మంది స్థానికేతరులు అయిన తమ అనుయాయుల కోసం, వారి ప్రయోజనాలు కాపాడడం కోసం స్థానికత ప్రాధాన్యత లేకుండా ఉద్యోగుల కేటాయింపు నిబంధనలు రూపొందించడం తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఆవశ్యకతకు పూర్తిగా విరుద్ధం. ఏ స్థానికత పునాది మీద తెలంగాణ రాష్ట్ర ప్రజలు ఉద్యమించి రాష్ట్రాన్ని సాధించుకున్నారో, ఆ అభీష్టానికి వ్యతిరేకంగా 317 జీఓలో స్థానికతను పాతర వేయడం ఆశ్చర్యకరం.

లోకల్ క్యాడర్లలో ఉద్యోగుల కేటాయింపు ఏ విధంగా చేయాలో ప్రెసిడెన్షియల్ ఆర్డర్ 1975 లోనూ, ప్రెసిడెన్షియల్ ఆర్డర్ 2018లో నాలుగవ పేరాలో ఒకే విధంగా వివరించడం జరిగింది. దాని ప్రకారం స్థానిక క్యాడర్లలో పాలనా అవసరాల దృష్ట్యా, వయసు సీనియార్టీ సమతుల్యత దృష్ట్యా, ఆ లోకల్ ఏరియాలో చేసిన సర్వీస్ దృష్ట్యా, ఆయా ప్రాంతాల చట్టాల పట్ల, భాష అవగాహన కలిగి ఉండటం అనే అంశాలను అన్నింటినీ గాని లేదా కొన్నింటిని గాని తీసుకొని సంబంధిత వ్యక్తుల ప్రాధాన్యతల ఆధారంగా కేటాయింపు చేయాలని సూచించబడింది. కానీ రాష్ట్ర ప్రభుత్వం కేవలం సంబంధిత క్యాడర్ సీనియారిటీని మాత్రమే పరిగణించి కేటాయింపులు చేయడంతో ప్రస్తుత గందరగోళ పరిస్థితి నెలకొంది.

**కొరవడిన స్థానికత ప్రాధాన్యత:**

ఖాళీలను దామాషా ప్రాతిపాదికన పంచి పని చేస్తున్న ఉద్యోగుల సంఖ్య ఆధారంగా ఎస్సీ ఎస్టీ ఉద్యోగులను ఆ దామాషాలో కేటాయించాలని, 70 శాతం పైబడిన వైకల్యం కలిగిన దివ్యాంగులు, మానసిక వైకల్యం కలిగిన పిల్లల తల్లిదండ్రులు, వితంతువులు, క్యాన్సర్, న్యూరో సర్జరీ, కిడ్నీ మార్పిడి, లివర్ మార్పిడి, గుండె శస్త్ర చికిత్స జరిగిన ఉద్యోగులకు మాత్రమే ప్రాధాన్యత కల్పించారు. కారుణ్య నియామకమైన వితంతువులకు ప్రాధాన్యతను కల్పించి, కష్టపడి ఉద్యోగం సంపాదించుకున్న ఒంటరి మహిళలకు, అవివాహిత స్త్రీలకు ప్రాధాన్యతను కల్పించకపోవడం, వారు పనిచేస్తున్న జిల్లాల నుండి రెండు వందల కిలోమీటర్ల వ్యత్యాసంలో గల ప్రాంతాలకు కేటాయింపులు జరగడంతో ఆ ఉపాధ్యాయినుల గుండెల్లో రైళ్లు పరిగెడుతున్నాయి.

గత ఏడు సంవత్సరాలుగా అంతర్ జిల్లా బదిలీల కోసం ఎదురు చూస్తున్న వారికి ఈ కేటాయింపులతో ఊరట కలుగుతుందని ముఖ్యమంత్రి గారు ఇచ్చిన హామీ ప్రకారం ఒకే దగ్గర పనిచేసే అవకాశం వస్తుందని ఆశించిన ఉద్యోగుల ఆశలు అడియాశలు అయ్యాయి. 2014లో తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు జరిగి కెసిఆర్ ముఖ్యమంత్రి అయినాక తమ కోరిక నెరవేరుతుందని భావించారని,

ఆ విధంగానే నూతన జిల్లాలు ఏర్పరిచిన తరువాత డిసెంబర్ నెలలో భార్య భర్త అయిన ఉద్యోగ దంపతులను ఒకేచోట తీసుకురావాలని జీవో తీసుకొచ్చారు. జీవో అయితే తెచ్చారు కానీ అమలు చేయడం మరచి ప్రకటనల వరకే పరిమితమయ్యారు. ఇటీవల తీసుకొచ్చిన 317 జీవో ప్రకారం నూతన జిల్లాలకు కేటాయింపు జరగడంతో భార్య భర్తలు తలా ఒక జిల్లాకు, తలా ఒక జోన్‌కు కేటాయింపు జరిగింది. దీంతో ఉపాధ్యాయుల ఆందోళనతో స్పౌజ్ క్యాటగిరి బదిలీలకు అవకాశం ఇవ్వడంతో ఈసారైనా ఒకే జిల్లాకు బదిలీ అవుతామనే ఆనందం మరునాడే ఆవిరైపోయింది. బదిలీల ఉత్తర్వులు వెలువడతాయని ఎదురుచూస్తున్న క్రమంలో 13 జిల్లాలకు ఇన్కమింగ్ ఆఫ్ చేశారని తెలిసి భార్యభర్తలు ఉద్యోగస్తులైన దంపతులు తీవ్ర ఆవేదనకు ఆందోళనకు లోనవుతూ కన్నీటి పర్యంతం అవుతున్నారు. బ్లాక్ చేసిన జిల్లాలలో రంగారెడ్డి, మేడ్చల్, అదిలాబాద్, నిజామాబాద్, వరంగల్, హనుమకొండ, కరీంనగర్, ఖమ్మం, సంగారెడ్డి, సిద్దిపేట, పాలమూరు, మంచిర్యాల్, సూర్యాపేట ఉన్నాయి. 13 జిల్లాల పరిధిలో మొత్తం 2,566 మంది టీచర్లు అప్లికేషన్లు పెట్టుకోగా వాటిలో 1,110 ఎస్జిటిలు, 1,456 మంది స్కూల్ అసిస్టెంట్లు, పండిట్లు, ఇతరులు ఉన్నారు.

కేంద్ర ప్రభుత్వ సర్వీసుల్లో, ప్రభుత్వ రంగ సంస్థల్లో, ప్రైవేట్ రంగంలో ఉద్యోగాలు చేసే వారికి స్పౌజ్ కేటగిరి వర్తించకపోవడంతో 250 కిలోమీటర్ల దూరంలో జిల్లాల కేటాయింపు జరగడంతో తీవ్ర ఆందోళన మానసిక వేదనకు లోనై తొమ్మిది మంది ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులు, ఉద్యోగులు ప్రాణాలు విడిచారు. ఐనా ప్రభుత్వం నుండి ఆవగింజంత అయినా ప్రతిస్పందన కనబర్చకపోవడం అమానవీయతకు నిదర్శనం. బంగారు తెలంగాణ రాష్ట్రంలో ఏ కార్యక్రమం చేపట్టినా బలిదానాల పరంపర కొనసాగుతుండడం విషాదకరం. ఆర్టీసీ సమ్మె విషయంలో ఆర్టీసీ కార్మికుల బలిదానం, వ్యవసాయ విధానం సక్రమంగా లేకపోవడం వలన రైతుల ఆత్మహత్యల పరంపర, ఉద్యోగ నియామకాలు చేపట్టకపోవడం వల్ల నిరుద్యోగుల ఆత్మహత్యలు, సంవత్సరాల తరబడి అవుట్ సోర్సింగ్ ఉద్యోగాలు చేసినవారిని తొలగించడం వల్ల వారి బలవన్మరణాలు, చివరకి భవిష్యత్ తరాలను తీర్చిదిద్ది ఆదర్శవంతమైన సమాజాన్ని నిర్మించే జాతి నిర్మాతలైన ఉపాధ్యాయుల చావులు కూడా 317 జీవో పుణ్యాన ప్రభుత్వం కళ్ల చూడడం బాధాకరం.

పాఠశాల విద్యా శాఖ కార్యాలయం వద్ద మాకు న్యాయం చేయండి, మేము ఫిర్యాదు చేసినా పట్టించుకోవడం లేదు, మా సమస్యలను పరిష్కరించాలి, మా కుటుంబాలు రోడ్డున పడుతున్నాయని పలువురు ఉపాధ్యాయులు నిరసన కార్యక్రమాన్ని చేపట్టారు. డిఇఒ కార్యాలయానికి వెళ్తే పాఠశాల విద్యాశాఖ సంచాలకుల కార్యాలయానికి వెళ్ళమంటారు, అక్కడికి వెళితే కలెక్టర్ కార్యాలయానికి వెళ్లమంటారు, తమ సమస్యలకు పరిష్కారం ఎలా? తమ గోడు వినే వారు ఎవరు? అని ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ఇలా ఉపాధ్యాయులు విద్య శాఖతో పాటు వివిధ కార్యాలయాల చుట్టూ ప్రదక్షణాలు చేస్తున్నారు. ఎవరూ పట్టించుకోకపోవడంతో ముఖ్యమంత్రిని కలిసి వివరించేందుకు ప్రగతి భవన్‌కు వెళ్లేందుకు ప్రయత్నిస్తే పోలీసులు అరెస్టు చేసి నగరంలోని వివిధ పోలీసు స్టేషన్లలో నిర్బంధించారు. పండగ పూట సంతోషంగా కుటుంబాలతో ఇంటి వద్ద గడపాల్సిన ఉపాధ్యాయులను అక్రమ కేసులు బనాయించి పోలీస్ స్టేషన్లలో బంధించడం ఇబ్బందికరం.

**ఉద్యోగ కల్పనలో ఏర్పడనున్న అసమానతలు:**

సీనియారిటీ ప్రాతిపదికన జిల్లాల కేటాయింపు జరపడంతో సీనియర్ ఉద్యోగులు ఉపాధ్యాయులు అర్బన్ జిల్లాలకు, జూనియర్ ఉద్యోగులు ఉపాధ్యాయులు ఎక్కువగా గ్రామీణ జిల్లాలకు కేటాయించబడ్డారు. తత్ఫలితంగా అర్బన్ జిల్లాలో పని చేస్తున్న వారు తొందరగా రిటైర్ కావడంతో ఖాళీలు ఎక్కువగా, గ్రామీణ ప్రాంత జిల్లాలలో ఆలస్యంగా ఉద్యోగులు రిటైర్ అయ్యే అవకాశం ఉండడంతో ఖాళీలు తక్కువగా ఏర్పడటంవల్ల నూతన ఉద్యోగాల కల్పనలో అసమానతలు చోటు చేసుకోవడం వల్ల, గ్రామీణ ప్రాంత జిల్లాల నిరుద్యోగులు స్థానికతపై పోరాడే అవకాశం ఉంది. గతంలో 610 జీవో నేపథ్యం లాంటి సందర్భం ఎదురయ్యే అవకాశాలు ఉన్నాయి. తెలంగాణలో వెనుకబడిన కొత్త 8 జిల్లాలలో కొమురం భీం ఆసిఫాబాద్, ములుగు, జయశంకర్ భూపాలపల్లి, సూర్యాపేట, వికారాబాద్, జోగులాంబ గద్వాల, నారాయణ్ పేట్, నాగర్ కర్నూలు జిల్లాలో స్థానికేతరులు ఎక్కువగా స్థిరపడే అవకాశం ఉంది. ఒక కొమరం భీమ్ ఆసిఫాబాద్ జిల్లాలోనే సుమారు 3000 నుండి 4000 వేల వరకు అన్ని శాఖలలో స్థానికేతరులు స్థిరపడే అవకాశం ఉందని అక్కడి నిరుద్యోగ యువత ఉద్యమం ప్రారంభించడం విశేషం.

**జీవో నెంబర్ మూడుకు తూట్లు:**

రాజ్యాంగం 5వ షెడ్యూల్ గిరిజన ప్రాంతాలలో నివసిస్తున్న గిరిజనులకే 100 శాతం ఉద్యోగ నియామకాలు చేపట్టాలని జీవో త్రీ స్పష్టం చేస్తుంది. ఇటీవల కొంతమంది గిరిజనేతరులు కోర్టుకు వెళ్లడంతో ప్రస్తుతం ఆ జీవోపై స్టే ఉంది. గతంలో ఆ ప్రాంతాలలోకి, మైదాన ప్రాంతంలో పనిచేస్తున్న ఉపాధ్యాయ ఉద్యోగులను బదిలీపై వెళ్లడానికి అనుమతించేవారు కాదు. ప్రస్తుతం 317 జీవో ప్రకారం 40 శాతం మంది గిరిజనేతరులు గిరిజన ప్రాంతాలలోకి బదిలీ చేయబడ్డారు. అలాగే కొద్దిమంది గిరిజనులు మైదాన ప్రాంతాలలోకి బదిలీ చేయబడ్డారు. ఇలా వెనుకబడిన గిరిజన ప్రాంతంలో గిరిజనుల అభివృద్ధి కోసం రాజ్యాంగ బద్దంగా కల్పించిన హక్కుల ప్రకారం గత ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ఎస్ ఆర్ శంకరన్ తీసుకువచ్చిన జీవో త్రీ కూడా ఈ 317 జిఓతో రద్దు అవుతుంది.

**మల్టీ జోనల్ హెచ్‌యంల కేటాయింపుల్లో అక్రమాలు:**

సీనియార్టీ ప్రాతిపదికపై ఎస్‌జిటి, స్కూల్ అసిస్టెంట్ ఉపాధ్యాయుల కేటాయింపులు, జరిపినట్లు ప్రధానోపాధ్యాయుల కేటాయింపులు కూడా తాము ఆప్షన్ ఇచ్చినట్లుగా మల్టీ జోనల్ కేటాయింపులు జరుగుతాయని ఆశించిన ప్రధానోపాధ్యాయులకు ఆశాభంగం అయింది. అందుకు విరుద్ధంగా సీనియర్ ప్రధానోపాధ్యాయులను

మల్టీ జోనల్ 2 నుండి మల్టీ జోనల్ 1కి కేటాయించారు. ఇది 317 జీవోకు విరుద్ధం. దీంతో జనవరి 7వ తారీకు నుండి విద్య కార్యాలయాల చుట్టూ తిరిగినా, సెక్రెటరీ సుల్తానియా అపాయింట్మెంట్ ఇవ్వకుండా అన్నీ సక్రమంగానే జరిగాయని నిర్లక్ష్యంగా సమాధానం చెప్పడం ఆశ్చర్యకరం. సంగారెడ్డి జిల్లాలోని 40 మంది ప్రధానోపాధ్యాయులను మల్టీజోన్ వన్‌లోని అన్ని జిల్లాలకు పోవాల్సిందే అంటూ ఆప్షన్లు అడుగుతుండడం అన్యాయమని ఆవేదన చెందుతున్నారు.

ఇలా పలు అసంబద్ధాలతో ఉద్యోగ, ఉపాధ్యాయుల లోకల్ క్యాడరైజేషన్ సాకుతో అశాస్త్రీయంగా జిల్లా కేటాయింపులు జరగడంతో వేలాదిగా ఉపాధ్యాయ ఉద్యోగులు తమ జన్మస్థలంలోనే పరాయి వారిగా, స్థానికేతరులుగా సొంత జిల్లాల నుండి ఇతర జిల్లాలకు గెంటి వేయబడ్డారు. క్యాడర్ సీనియార్టీ ప్రాతిపదికన స్థానికతను పరిగణనలోకి తీసుకోకుండా విభజన చేయడం రాష్ట్రపతి ఉత్తర్వులకు భిన్నంగా, తెలంగాణకు ఇచ్చిన రక్షణ హామీలలో భాగంగా తీసుకువచ్చిన 8 పాయింట్ ఫార్ములా, సిక్స్ పాయింట్ ఫార్ములా లోని అంశాలను పట్టించుకోకుండా కేటాయింపులు చేయడం రాజ్యాంగ స్ఫూర్తిని తుంగలో తొక్కి వేయడమే. జూనియర్ ఉద్యోగ, ఉపాధ్యాయులు శాశ్వతంగా తమ స్థానిక జిల్లాలకు దూరమై గుండె కోతకు గురి అవుతున్నారు. వారి పిల్లలు కూడా సొంత జిల్లాలకు స్థానికేతరులు అవుతున్నారు.

**ప్రత్యామ్నాయ పరిష్కార మార్గాలు:**

♦ స్థానికత ఆధారంగా సీనియార్టీని కూడా లెక్కించి జిల్లాల కేటాయింపు చేయాలి. ఒకవేళ స్థానికులైన జూనియర్లను ఇతర జిల్లాలకు బదిలీ చేస్తే పరిమిత కాల వ్యవధిలో స్థానిక జిల్లాల్లో ఖాళీలు ఏర్పడినప్పుడు సీనియార్టీ ప్రకారం వెనక్కి తీసుకు రావాలి. గతంలో 1975లో రాష్ట్రపతి ఉత్తర్వులు ఇలానే అమలు చేయడం జరిగింది.

♦ సాధారణ బదిలీలలో వలె వితంతువులు అయిన ఒంటరి మహిళలకు, అవివాహిత స్త్రీలకు ప్రాధాన్యత కల్పించి స్థానిక జిల్లాలనే కేటాయించాలి.

♦ భార్యాభర్తల బదిలీలు అన్ని జిల్లాలలో అవకాశం కల్పించాలి. వారికి ఇచ్చిన హామీ ప్రకారం ఒకే చోట పనిచేసే అవకాశం కల్పించాలి.

♦ లోకల్ క్యాడర్ కేటాయింపు కేడర్ సర్వీసు కాకుండా మొత్తం సర్వీసు పరిగణలోకి తీసుకోవాలి.

♦ 317 జీవో ప్రకారం చేసిన కేటాయింపులు అన్నింటిని అడహాక్ కేటాయింపులుగా ప్రకటించి వేసవికాలంలో శాశ్వత ప్రాతిపదికన బదిలీలు చేయాలి.

♦ క్యాన్సర్, న్యూరోసర్జరీ, కిడ్నీ లివర్ మార్పిడి, ఓపెన్ హార్ట్ సర్జరీ తోపాటు డయాలసిస్ అవసరం ఉన్న, దీర్ఘకాలిక రుగ్మత అయిన పక్షవాతంతో బాధపడుతున్న ఉపాధ్యాయ, ఉద్యోగులకు కూడా ప్రాధాన్యత కల్పించాలి.

ఉపాధ్యాయ, ఉద్యోగుల లోకల్ క్యాడరైజేషన్ జనవరి 7 వరకు పూర్తయిందని కేవలం 101 మంది మాత్రమే జాయిన్ కాలేదని, 317 జీవో విజయవంతంగా అమలు అయిందని ప్రభుత్వం ప్రకటించింది. జాయిన్ కాని 101 మంది ప్రభుత్వ అధికారుల, పాలకుల అండదండలతో మంచి స్థానాలను పొందాలనే ఉద్దేశంతోటే. 317 జీవో లోని 28వ పేరాగ్రాఫ్‌లో ఉన్న లొసుగును ఆసరాగా తీసుకొని అనుకూలమైన, దగ్గరైన స్థానాలను పొందాలని ప్రయత్నాలు చేస్తున్నట్టు ఉద్యోగ సంఘ నాయకులు తెలియజేస్తూ ఉండడం ఆశ్చర్యకరం. పరస్పర బదిలీలు నిర్వహించాలి. ఈ అంశాలను దృష్టిలో పెట్టుకొని 317 జీవోను సవరించాలి లేదా పూర్తిగా రద్దు చేసి శాస్త్రీయ మైనటువంటి మార్గదర్శకాలతో స్థానికత కు సీనియార్టీకి ప్రాధాన్యత కల్పించి ఉద్యోగ ఉపాధ్యాయుల విభజన చేయాలని ఉద్యోగ ఉపాధ్యాయ సంఘాల నాయకులు కోరుచున్నారు. క్షేత్ర స్థాయిలో బాధపడుతున్న ఉద్యోగులను పరిగణనలోకి తీసుకొని ఏడు వేల అప్పీళ్లను పరిష్కరించాలి.

**ముగింపు:**

స్థానికత పునాదిపై ఆవిర్భవించిన తెలంగాణ రాష్ట్రంలో నూతనంగా ఏర్పాటు చేసిన ముప్పై మూడు జిల్లాల ఉద్యోగ, ఉపాధ్యాయుల విభజన చేయడానికి 317 జీవో ఉపాధ్యాయుల పాలిట మరణశాసనం అయింది. రాష్ట్ర ప్రభుత్వం 317 జీవో మాటున రేషనలైజేషన్ ప్రక్రియను పూర్తి చేసింది. ఈ జీవోతో పట్టణ ప్రాంతాలు గ్రామీణ ప్రాంతాలలో, లోకల్ నాన్ లోకల్, స్పౌజ్, నాన్ స్పౌజ్, ఎంప్లాయిస్, ఆన్ ఎంప్లాయిస్, జూనియర్ సీనియర్, గిరిజనులు గిరిజనేతరుల మధ్య విభజన రేఖను సృష్టించి అసమానతలు అంతరాలు పెంచింది. ఇలా పలు విధాలుగా ఉపాధ్యాయ, ఉద్యోగులకు నష్టపరిచే 317 జీవోను మొండిగా, నిరంకుశంగా అమలు చేయడం రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధం. రాష్ట్రపతి ఉత్తర్వులలో బాధితులకు అవకాశమిచ్చి వారి ఇష్టానుసారం కేటాయింపు చేయాలని ఉండగా దానికి విరుద్ధంగా వ్యవహరించడం అన్యాయం. ప్రజాస్వామ్యంలో పాలకులు ప్రజల సంక్షేమం, అభివృద్ధి ధ్యేయంగా పని చేయాలి. ప్రజల ప్రాణాలు పోతున్నా, రోమ్ పట్టణం తగలబడుతుంటే నీరో చక్రవర్తి ఫిడేలు వాయించిన చందంగా వ్యవహరించడం అమానవీయం.

రాచరికపు పరిపాలనలో కూడా ప్రజల సమస్యలను తమకు జరిగిన అన్యాయాన్ని వివరించేందుకు రాజును నేరుగా కలిసేందుకు రాజ దర్బార్ ముందు ధర్మగంట పెట్టేవారు. అన్యాయం జరిగిన వారు ధర్మగంట మ్రోగించిన వెంటనే రాజును కల్పించి తమ గోడు విన్నవించుకునే అవకాశం ఉండేది అని చరిత్ర చెబుతుండగా ప్రజాస్వామిక ప్రజా పాలనలో సమస్యను వివరించేందుకు ప్రగతి భవన్ దగ్గరికి వెళ్లే అవకాశం లేకపోవడం విడ్డూరం. తక్షణమే 317 జీవో బాధితుల గోడునాలకించి ఉపాధ్యాయ, ఉద్యోగ సంఘాలతో చర్చించి ఏ ఒక్కరికీ అన్యాయం జరగకుండా నియమ నిబంధనలను రూపొందించి ఉద్యోగ, ఉపాధ్యాయుల విభజన చేయడం శ్రేయస్కరం. లేనిచో గత పాలకులవలే ఉద్యోగుల ఆగ్రహానికి గురికాక తప్పదు.

*(రచయిత టిపిటిఎఫ్ జిల్లా ఉపాధ్యాక్షుడు, మహబూబాబాద్)*

# అద్దం మీద నింద కాదు, పాలన సరిదిద్దండి

*తెలంగాణలో రైతుల సంక్షేమం కోసం నిజంగా పనిచేస్తున్న ఒక స్వచ్ఛంద సంస్థ మీద ఒక పాలకవర్గ ప్రతినిధి చేసిన నిందారోపణలను విశ్లేషిస్తున్నారు* **డా. ఎస్. తిరుపతయ్య**

తెలంగాణ రైతుబంధు సమితి చైర్మన్, ఎమ్మెల్సీ అయిన పల్లా రాజేశ్వర్ రెడ్డి అనే టిఆర్ఎస్ పార్టీ నాయకుడు ఇటీవల ఒక ప్రెస్ మీట్‌లో 'రైతు స్వరాజ్య వేదిక' అనే స్వచ్ఛంద సంస్థను ఆంధ్ర నాయకుల సంస్థ అనీ, వ్యాపార సంస్థ అనీ, ఆ సంస్థ బాధ్యులను కుహనా రైతు నాయకులనీ నిందిస్తూ మాట్లాడారు. అలాగే మీడియాపై కూడా అక్కసు వెళ్లగక్కారు. తెలంగాణలో, లేని రైతు ఆత్మహత్యలను ఉన్నట్టుగా చిత్రీకరిస్తూ, వాళ్లు ప్రభుత్వాన్ని అభాసు పాలు చేస్తున్నారని విమర్శలు చేశారు.

రాజకీయ పార్టీలను విమర్శించినట్టుగా ఒక స్వచ్ఛంద సంస్థను విమర్శించడం వెనుక, ఆ సంస్థ కార్యకలాపాలను నిర్బంధంతో మూసేయాలనే కుట్ర దాగి ఉంది. ఈ ముందస్తు ప్రచారం అందుకోసమే. ఎన్నడూ లేని విధంగా రాజకీయేతర స్వతంత్ర సంస్థలపైనా, మేధావులపైనా, మీడియాపైనా దౌర్జన్యానికి దిగటం తెలంగాణాలో పెరిగిపోతున్నది. ఇది పూర్తిగా, వివిధ సామాజిక వర్గాల నుండి పెరుగుతున్న ప్రశ్నలకు సమాధానం చెప్పలేక అసహనం పెంచుకున్న పాలకులు, ప్రజాస్వామ్య గతి తప్పిన ప్రతినాయకులు (విలన్లు) మాత్రమే చేసే పని.

ప్రచారం వేరు, వాస్తవాలు వేరు. వాస్తవాలు తమకు తామే మాట్లాడతాయి. బలంగా వచ్చిపడుతున్న విమర్శలకు తట్టుకోలేక కెసిఆర్ బృందం తిరిగి తెలంగాణా వాదాన్ని ఆశ్రయిస్తున్నది. ఆ ప్రమాణాన్ని తీసుకున్నా అధికారం, దాని అండతో అంతు లేకుండా పెరిగిపోతున్న ఆస్తులతో మత్తెక్కుతున్న రాజకీయ నాయకులను సమర్థించడం తెలంగాణా వాదం కాదు. ఏ అండా లేక, ఆత్మహత్యలు తప్ప మరో దిక్కు లేదనుకునే, నోరు లేని రాష్ట్ర రైతుల గురించి మాట్లాడటమే తెలంగాణా వాదం.

రైతు స్వరాజ్య వేదిక కార్యాచరణంతా వ్యవసాయ రంగానికి మాత్రమే పరిమితమైంది. రాజకీయాలనబడే వాటికి సంబంధం లేనిది. సుస్థిర, శాస్త్రీయ వ్యవసాయ విధానాన్ని రైతులకు నేర్పించటం, నోరులేని రైతుల పక్షాన నిలబడి మాట్లాడటమే వాళ్ల కార్యక్రమం. రైతు స్వరాజ్య వేదిక భూమిలేని నిరుపేద కౌలు రైతులకు రైతుబంధు నిరాకరణ, బ్యాంకులు రుణాలివ్వకపోవటం, ఆత్మహత్యల్లో కౌలు రైతులే ఎక్కువగా ఉండటం, మహిళా రైతుల సమస్యలు, ఏ రైతుకూ వ్యవసాయం గిట్టుబాటయ్యే స్థితిలేకపోవటం వంటి సమస్యలను పాలకులకు ఎప్పటికప్పుడు వినిపిస్తూ, సమాజం ముందు చర్చకు తెచ్చింది. రెండు తెలుగు రాష్ట్రాల్లో రైతుల ఆత్మహత్యలను క్షేత్ర స్థాయి నుండి వెలుగులోకి తెచ్చి, సమాజంలో చర్చనీయాంశం చేయటంలో వారి పాత్ర శ్లాఘనీయం. నిరాశనిండిన అనేక ఆత్మహత్యల కుటుంబాల్లో ఆత్మస్థైర్యం నింపటానికి కూడా వారెంతో ఓర్పుగా పని చేస్తున్నారు. నిజానికి, రైతుల మేలుకోరే ప్రభుత్వాలు, అటువంటి వాళ్లను అభినందిస్తూ, వారి సహాయం తీసుకుంటూ పనిచేయాలి. కానీ తెలంగాణా పాలకుడైన కెసిఆర్ కళ్లకిప్పుడెవరూ కనిపించడం లేదు. ఆయన బజన బృందానికీ అంతే.

ఇప్పుడు రైతాంగం పరిస్థితి కొంత మెరుగ్గా ఉండడానికి రైతు బంధు వంటి చిట్కా వైద్యాలు కారణం కాదు. కొన్నేళ్లుగా స్థిరంగా మంచి వర్షపాతం ఉండటం, సాగునీటి వసతి కొంత పెరగటం, రెండూ కలసి వరి దిగుబడికి అనుకూలంగా ఉండటం, వరిని కనీస మద్దతు ధరతో ఎఫ్‌సిఐ సేకరించటం ఇవే ప్రధాన కారణాలు. రైతు బంధు మంచి పథకమే. కానీ అందులో కనీసం ముప్పై, నలభై శాతం డబ్బు వ్యవసాయమే చేయని అనర్హులకు వెళ్తోంది. దాన్ని పరిష్కరించి ఆ మొత్తాన్ని అర్హులకు, అంటే వాస్తవ సాగుదారులకు, మళ్లించవచ్చు. అలా చిన్న, సన్నకారు రైతులకు మరింత ఎక్కువ సహాయం చేయవచ్చు.

రైతు బీమా కూడా ఒక ముందడుగే. దాన్ని మరింత మెరుగు పర్చవచ్చు. కొన్ని మంచి పథకాలు అమలు చేస్తుంటే ఇక చేయటానికి ఏదీ లేదన్నట్లు, మమ్మల్ని ఎవరైనా కీర్తించటమే కానీ, విమర్శించవద్దంటే అది అర్థం లేని వాదన. ఆ 'మంచి పథకాలు' కూడా జీవితానికీ, ఆత్మహత్యకీ మధ్య కొట్టుమిట్టాడే రైతులకు ఏ మేరకు ఉపయోగపడుతున్నాయో సమీక్షించుకోవడం శాస్త్రీయమైన పద్ధతి. ఎన్‌సిఆర్‌బి ప్రకారం 2014లో 1,345 రైతు ఆత్మహత్యల నుండి 2020 నాటికి 475 కు తగ్గటం నిజమే అయినా, ఇంకా 35 శాతం ఆత్మహత్యలయినా జరుగుతున్నట్టే కదా. ఈ తగ్గుదల వెనుక కొన్ని సాంకేతిక కారణాలు కూడా ఉంటాయి. అది వదిలేసినా, మీ రైతుబంధు వంటి సహాయాలతోనే ఆత్మహత్యల్లో అంత తగ్గుదల నమోదయిందా అనేది ఒకసారి పరిశీలిద్దాం.

గత నాలుగేళ్లలో మీరు రాష్ట్ర 'రైతులకు' యాభై వేలకోట్ల రూపాయల మొత్తాన్ని అందించారు. ఈ మొత్తంలో, రైతుల్లో మెజారిటీగా, 34 లక్షల 41 వేల సంఖ్యతో అరవై రెండు శాతంగా ఉన్న, రెండున్నర ఎకరాల లోపు భూమి మాత్రమే కలిగిన సన్నకారు రైతులకు ఎంత చేరిందో చూద్దాం. ఈ సన్నకారు రైతులందరూ కలిసి రాష్ట్ర మొత్తం వ్యవసాయభూమిలో ఇరవై అయిదు శాతమే కలిగి ఉన్నారు. అందువల్ల ఈ వర్గ రైతులందరికీ కలిపి మీ యాభై వేల కోట్ల రూపాయల నుండి చేరింది పావలా వంతు. అంటే రు. 12,500 కోట్లు. ఆ లెక్కన నాలుగేళ్లకు గానూ ఒక్కొక్క సన్నకారు రైతు పొందింది ముప్పై ఒక్క వెయ్యి తొమ్మిది వందల రూపాయలు. అంటే ఏడాదికి ఏడు వేల తొమ్మిది వందల రూపాయలు. భూమి లేని కౌలు రైతులకు అది కూడా రాదు. ఈ సన్నకారు వర్గమే, లేదా ఆపాటి భూమి కూడా లేని కౌలు రైతులే, ఆత్మహత్యలు చేసుకుంటున్న వారిలో నూటికి తొంభై శాతం మంది ఉంటున్నారు. బలవన్మరణం పాలయ్యే రైతులు చనిపోయేనాటికి వారి తలలపై కనీసం రెండు నుండి ఇరవై లక్షల రూపాయల అప్పులు ఉంటున్నాయి. మీరు నాలుగేళ్లలో వారికి అందించిన ఆర్థిక సహాయం మొత్తం బహుశా వారికి జ్వరం వస్తే ఒక్కరోజు హాస్పిటల్లో అయ్యే ఖర్చుకే అయిపోవచ్చు. లేదా ఇద్దరు పిల్లలకు ఒక్క ఏడాది స్కూలు ఫీజుకే వెళ్లిపోవచ్చు. కాబట్టి మీ రైతుబంధు వల్లే నిజంగా ఆత్మహత్యలు తగ్గిపోయాయంటే దాన్ని అబద్ధమనో, అతిశయోక్తనో కాక ఏమనాలి? రైతుబంధుతో సహా సంక్షోభంలో ఉన్న రైతులకు చేసే ఏ చిన్న సహాయమైనా ఆహ్వానించదగ్గదే. అయితే మీరు చెప్పినట్టు ' పండుగ చేసుకునేంత' ది కాదనే మేం చెప్పేది.

మీరు గుర్తించాల్సిన విషయాలు రెండున్నాయి. మొదటిది, ప్రజా సంక్షేమం కోసం ఖర్చుపెట్టే సొమ్ము అధికార పార్టీ తాతమ్మలది కాదు. అదంతా ప్రజల సొమ్మే. రాష్ట్ర ఆదాయానికీ, అప్పులకీ ప్రజలే బాధ్యులు. ఆ సొమ్ములో మీరు కొంత వెనకేసుకోవడం తప్ప, మీరు చేసే త్యాగం ఏమీ లేదు. రెండవది, వ్యవసాయ సంక్షోభం అనేది చాలా పెద్ద విషయం. దాన్ని మీరు చిట్కా వైద్యాలతో పరిష్కరించేశాం అని ప్రచారం చేసుకోవటం మీ హ్రస్వదృష్టి. దేశంలో గత ఇరవైమూడేళ్లలో (1995-2018) నాలుగు లక్షల మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారని ఎన్‌సిఆర్‌బి చెప్తోంది. ఆత్మహత్యలకు ప్రధాన కారణం అప్పులు. అప్పులకు కారణం వ్యవసాయంలో పెట్టుబడులు పెరగటం, దిగుబడుల్లో అనిశ్చితి, పండిన పంటకు గిట్టుబాటు ధరలు లేకపోవటం, పెరుగుతున్న జీవన వ్యయం, ఇలా అనేకం. వ్యవసాయ రంగ సంక్షోభానికి కారణం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల వ్యవసాయ విధానాలు. జాతీయ, అంతర్జాతీయ కార్పొరేట్లకు కొమ్ము కాసే, ప్రజల పట్ల నిబద్ధత లేని రాజకీయ నాయకులు. ఇవన్నీ ఎప్పుడైతే పరిష్కారమవుతాయో అప్పుడే రైతుల ఆత్మహత్యలు ఆగుతాయి.

ఒక్క రైతు స్వరాజ్య వేదిక మాత్రమే కాదు,1996లో వరంగల్ జిల్లాలో పత్తిరైతు ఆత్మహత్యలు ప్రారంభమైన నాటి నుండీ వాటి మూలాలపై హక్కుల సంఘాలూ, రైతు సంఘాలూ, మేధావులంతా మాట్లాడుతూనే ఉన్నారు. వినటం మీకు కొత్త అయితే, అది మీ సమస్య. రాష్ట్రంలో రైతు ఆత్మహత్యలు మీ పాలనలో జరగటమే లేదన్నట్లు, ఇంక ఆ విషయంపై ఎవరూ మాట్లాడకూడదన్నట్లు బుకాయించటం మీ రాజకీయ ప్రయోజనాలకు అవసరమేమో కానీ ఆ సమస్య పూర్తిగా పరిష్కారం అయ్యేంత వరకు ప్రజలూ, మేధావులూ మాట్లాడుతూనే ఉంటారు.

రాజ్యాంగాన్ని గౌరవిస్తూ పనిచేయాల్సిన రాజకీయ నాయకుడు లేదా ప్రభుత్వ బాధ్యులు ఒక స్వచ్ఛంద సంస్థపై, మీడియాపై అలా బెదిరింపు విమర్శలకు దిగటం మంచి పరిణామం కాదు. శాసన శాఖపై, పాలనా విధానాలపై తమ అభిప్రాయాలు చెప్పటం, ప్రజల్లో చర్చకు పెట్టటం పౌరులందరి ప్రాథమిక హక్కు. అధికారంలో ఉన్నవారు, పాలనా విధానాలు రూపొందించేవారు ఆ విమర్శలకు సహేతుక సమాధానాలు చెప్పాలి. మేధో వర్గం చేసే విమర్శలనుండి కొత్త కోణాల్ని నేర్చుకోవటం, విధానాల్లో తగిన మార్పులు చేసుకోవటం ప్రజాస్వామికమైన పద్ధతి. రాజకీయ ప్రతిపక్షాల విమర్శల్ని సైతం మీ రాజకీయ లాభ నష్టాల నేపథ్యంలో కాక ప్రజాప్రయోజనం దృష్ట్యానే చూడాలి. అలా తమ విధానాల్ని మార్చుకోవటానికి సిద్ధంగా లేరంటే మీకు ప్రజాస్వామ్యంపై గల గౌరవం ఆ పాటిది మరి! ఇలాంటి వాళ్లు దేశంలో, రాష్ట్రంలో ప్రజాస్వామ్య రక్షకులుగా అధికార స్థానాల్లో కూర్చోవటం ఈ శతాబ్ది విషాద పరిణామం. ప్రజా చైతన్యమే ఇటువంటి నాయకత్వాన్ని రాజకీయాల్లో ఎదగకుండా చూస్తూ రాష్ట్రాన్నీ, దేశాన్నీ, ప్రజాస్వామ్యాన్నీ కాపాడుకోవాలి.

*(రచయిత మానవ హక్కుల వేదిక)*

వీ

**వచ్చే సంచికలలో...**

- **బెంగాల్ వామపక్ష సంఘటన - సాంస్కృతిక రంగం : కొన్ని ఆలోచనలు - కొండూరి వీరయ్య**
- **రైతు ఉద్యమం, కేంద్ర, రాష్ట్ర బడ్జెట్‌లపై వ్యాసాలు**

# బిజెపి - టిఆర్ఎస్ ప్రణయ కలహం

*తెలంగాణలో ఒకరితో ఒకరు భీకర యుద్ధం చేస్తున్నట్టు కనబడుతున్న రెండు పాలకపక్ష పార్టీల అసలు స్వభావాన్ని వివరిస్తున్నారు* **చుంచు శ్రీశైలం**

అధికారమనే సుందర స్వప్నం నెరవేరాలంటే ప్రజలను గందరగోళానికి గురిచేయాలన్న సూత్రాన్ని రాజకీయ నాయకులు పాటిస్తూ ఉంటారు. అప్పటికే పాలకులుగా ఉన్న వర్గం ఈ పనిలో ముందువరుసలో ఉంటుంది. ప్రజాస్వామ్య తరహా వ్యవస్థ విజయవంతం కావాలంటే ప్రజలకు రాజకీయ చైతన్యం ఉండాలనే నీతి సిద్ధాంతాలకే పరిమితమవుతుంది. అధికారంలో ఉన్న వాళ్ళు తిరిగి కాపాడుకోవడానికి, ప్రతిపక్షంలో ఉన్న వాళ్ళు దానిని దక్కించుకోవడానికి ప్రయత్నించడం సహజం. ఈ క్రమంలో వారికి ప్రజలంతా మనుషులుగా కాకుండా ఓటర్లుగానే కనపడతారు. మాటల గారడీలు, ఘాటైన వ్యాఖ్యలు, వ్యక్తిగత విమర్శలు, పరస్పర దూషణలు, దాడులు ప్రతిదాడులు, లేఖాస్త్రాలు, అబద్ధాలు, ఆరోపణలు రాజకీయ వ్యూహాలుగా మారతాయి. ప్రజాతంత్ర, ప్రగతి శీల వాదులను మించి ప్రజా పక్షపాతం వహిస్తున్నట్లు ఫోజులు కొడతారు. ప్రజలను గందరగోళానికి గురిచేసి వారి అసలు సమస్యల నుంచి ఆలోచనలను పక్కదారి పట్టించే చతురత రాజకీయ పార్టీలకు వెన్నతో పెట్టిన విద్య. 'ఒప్పించలేకపోతే, గందరగోళపరచు' అన్న ఆంగ్ల సూక్తి రాజకీయాల్లో తిరుగులేని ఆచరణ మార్గంగా పాటిస్తారు. ప్రస్తుతం తెలంగాణలో జరిగేది ఇదే.

తమ పాలనా విధానాలతో ప్రజలను ఎలాగూ ఒప్పించలేమని తెలిసి అయోమయంలోకి నెట్టేసే రాజకీయ క్రీడ తెలంగాణలో రక్తి కడుతోంది. ప్రజల ఆలోచనల్లో అంధకారమే అధికారానికి పునాదని నమ్ముతున్న నాయకులు ప్రజల కళ్లకు గంతలు కట్టేందుకు పోటీ పడుతున్నారు. ఇన్నాళ్ల తమ పాలనా అసమర్థతను, దోపిడీ సమర్థతను ప్రజల మెదళ్లలో తారుమారు చేసేందుకు తెలంగాణలో సరికొత్త నాటక ప్రదర్శన మొదలుపెట్టారు. కల్వకుంట్ల చంద్రశేఖరరావు దర్శకత్వంలో అధికార తెలంగాణ రాష్ట్ర సమితి, అమిత్ షా పర్యవేక్షణలో అధికారాన్ని ఆశిస్తున్న భారతీయ జనతా పార్టీ నాయక ప్రతినాయక వర్గాలుగా, వాటి నేతలు పాత్రధారులుగా నటిస్తుండగా, ప్రజలు మౌన ప్రేక్షకులుగా వీక్షిస్తున్నారు. తెలంగాణ ప్రజానీకానికి ఎంతమాత్రం పరిచయం, సంబంధం లేని సరికొత్త తారాగణం (ఇతర రాష్ట్రాల నాయకులు) ఈ నాటకంలో పాల్గొంటూ నాటకానికి అదనపు హంగులు అద్దుతున్నారు.

తెలంగాణలో ఎన్నికలు సమీపిస్తున్న వేళ వీలైనన్ని కుయుక్తులకు పాల్పడుతూ కొత్త కొత్త రాజకీయ వేషాలు ధరిస్తున్నారు. ప్రస్తుతానికి వ్యవసాయం, నిరుద్యోగ, ఉద్యోగ సమస్యలను వేదికలుగా చేసుకొని ప్రజల ముందు పైపై కొట్లాటకు వ్యూహరచన జరిగినట్లు కనపడుతుంది. ధాన్యం కొనుగోళ్ళ వ్యవహారంలో కేంద్రాధికార, రాష్ట్రాధికార పార్టీలు హోరాహోరీగా తలపడడం అందులో భాగమే. వేసంగి సీజన్లో రైతుల నుంచి సేకరించే వరి ధాన్యాన్ని కొనడానికి కేంద్రం నిరాకరిస్తుందన్న రాష్ట్ర ప్రభుత్వ ఆరోపణలతో మొదలైన పోరు ఢిల్లీకి చేరింది. జంతర్ మంతర్ వద్ద ధర్నా చేపట్టాలని, తానే స్వయంగా ధర్నాలో పాల్గొంటానని ముఖ్యమంత్రి కేసీఆర్ ప్రకటించారు. అంతకుముందే రాష్ట్రంలో తానే నిషేధించిన ఇందిరా పార్కు వద్ద తన మందీ మార్బలంతో కలిసి ధర్నా నిర్వహించి కేంద్రంపై దుమ్మెత్తిపోశారు. రైతు సమస్యలపై కేంద్ర ప్రభుత్వ పెద్దలను కలవడమనే పేరుతో స్వయంగా ఢిల్లీ వెళ్లి రిక్త హస్తాలతో తిరిగి వచ్చారు. ధాన్యం కొనుగోలు చేయకపోతే సేకరించిన ధాన్యాన్ని ఢిల్లీకి తెచ్చి పారబోస్తామని రైతుల మద్దతును పొందడానికి, భారతీయ జనతా పార్టీని రైతు వ్యతిరేకిగా చిత్రించడానికి ప్రయత్నించారు. సేకరించిన ధాన్యాన్ని నిల్వ చేయడానికి గొడౌన్లు ఖాళీ చేయడం లేదని, తరలించడానికి రైల్వే వ్యాగన్లు అందుబాటులో ఉంచడం లేదని కేంద్రం మీద దాడి మొదలుపెట్టారు. ముందే చెప్పినట్లుగా 60 లక్షల మెట్రిక్ టన్నుల ధాన్యాన్ని కొనుగోలు చేయడానికి సిద్ధంగా ఉన్నామని, గతంలో రాష్ట్రం ఇస్తానన్న ధాన్యాన్ని టార్గెట్ మేరకు సేకరించలేక పోయిన విషయాన్ని గుర్తుంచుకొని రాజకీయం చేయకుండా ధాన్యం సేకరణ మీద దృష్టి పెట్టాలని కేంద్రం ప్రతిదాడి చేసింది.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య జరిగిన ఈ వ్యవహారానికి రెండు పార్టీలు కావాల్సిన దానికంటే ఎక్కువగానే రాజకీయ రంగును పులిమాయి. రాష్ట్ర మంత్రులకు, కేంద్రమంత్రి కిషన్ రెడ్డి, బండి సంజయ్, ధర్మపురి అరవింద్ వంటి బి.జె.పి. నాయకులకు మధ్య తీవ్ర వాగ్యుద్ధం చోటుచేసుకుంది. ధాన్యం కొనుగోలు చేసేవరకు కేంద్రం మీద యుద్ధం చేస్తామని టి.ఆర్.ఎస్ ప్రకటిస్తే, కేసీఆర్ మీద యుద్ధం మొదలైందని, తన ఆర్థిక నేరాల చిట్టా మొత్తం కేంద్ర హోంశాఖ వద్ద ఉందని, జైలుకు పంపడం ఖాయమని బి.జె.పి

నాయకత్వం స్పందించింది. ధాన్యం కొనుగోలు కేంద్రాల వద్ద కేంద్ర ప్రభుత్వ దిష్టిబొమ్మల దహనంతో పాటు, చావుడప్పు మోగించాలని కేసీఆర్ పిలుపునిస్తే, త్వరలోనే తెలంగాణలో టి.ఆర్.ఎస్ పార్టీకి చావుడప్పు తప్పదని బిజెపి ప్రతిస్పందించింది.

ఆరోపణలు, ప్రత్యారోపణలతో పాటే లేఖలు, ప్రతిలేఖలు కూడా పంపుకున్నాయి. ఉపాధిహామీ పథకాన్ని వ్యవసాయ పనులతో అనుసంధానం చేయాలని రాష్ట్ర అసెంబ్లీ చేసిన తీర్మానాన్ని పదే పదే ఉచ్చరిస్తున్నారు. ధాన్యం కొనుగోలు అంశంపైనే కాకుండా పెరిగిన ఎరువుల ధరలు తగ్గించాలని ప్రధాని మోడీకి లేఖ రాసి, ముఖ్యమంత్రి గానే కాకుండా ఒక రైతుగా తానీ లేఖ రాశానన్న కేసీఆర్ కు, పెరిగిన ధరలు వాస్తవమేనని కానీ ఆ మొత్తాన్ని కేంద్రమే సబ్సిడీగా భరిస్తుంది కదా అని బీజేపీ ప్రత్యుత్తరం రాసింది. మేము రాసేది ప్రేమ లేఖలు కావని, రైతు మద్దతు లేఖలంటూ ఎవరికి వారు ప్రకటించుకున్నారు. పూర్తి ధాన్యాన్ని సేకరించే వరకు వదలమని, కేంద్రం మెడలు వంచుతామంటూ రాష్ట్ర వ్యవసాయ శాఖామంత్రి సింగిరెడ్డి నిరంజన్ రెడ్డి ఆధ్వర్యంలో ఎర్రబెల్లి దయాకరరావు, గంగుల కమలాకర్, గుంటకండ్ల జగదీశ్వర్ రెడ్డి లతో కూడిన మంత్రుల బృందం తమ ఎం.పి లతో కలిసి ఢిల్లీ టూరుకు వెళ్లింది. నాలుగు రోజులు ఢిల్లీలో మకాం వేసిన మంత్రులనుద్దేశించి, కేంద్రమంత్రి అపాయింట్మెంట్ లేకుండా ఢిల్లీ వెళ్లి కేంద్రాన్ని బద్నాం చేస్తున్నారని రాష్ట్ర బీజేపీ అధ్యక్షుడు వ్యాఖ్యానిస్తే, మేము తీరికలేని పనుల్లో బిజీగా ఉంటే తెలంగాణ మంత్రులు పనిలేకుండా ఖాళీగా ఉన్నారా అంటూ కేంద్రమంత్రి ఎద్దేవా చేశారు.

ఎట్టకేలకు నాలుగు రోజుల తర్వాత కేంద్ర ఆహార, ప్రజా పంపిణీ వ్యవహారాల మంత్రి పీయూష్ గోయెల్ తో సమావేశమయ్యారు. ఈ సంధర్భంగా ప్రస్తుత వానాకాలంలో లక్ష్యానికి మించి అదనంగా వచ్చే ధాన్యాన్ని కూడా కొంటామని, యాసంగిలో మాత్రం గింజ కూడా కొనమని గోయెల్ తేల్చిచెప్పారు. అయితే ఈ ప్రకటనను లిఖితపూర్వకంగా ఇస్తే తప్ప తాము ఢిల్లీ వదిలి పోయేదిలేదని మరో రెండు రోజుల పాటు భీష్మించుకున్న తర్వాత హామీ రాకుండానే తిరుగు పయనమయ్యారు. ధాన్యం కొనుగోలు విషయమై పార్లమెంటులో ప్రకటన చేశాక కూడా, ఏ రాష్ట్రానికి రాసి ఇవ్వనిది ఒక్క తెలంగాణకే ఇవ్వాలని పట్టుబట్టడంలో కేంద్రం మీద బురదజల్లే దురుద్దేశాలు ఉన్నాయని బిజెపి నాయకులు దుయ్యబట్టారు. కొద్ది రోజుల తర్వాత ముందే ఒప్పందం చేసుకున్న 60 లక్షల మెట్రిక్ టన్నులకు అదనంగా మరో 8.65 ల.మె.ట ధాన్యాన్ని కొనుగోలు చేయడానికి సిద్ధమని రాష్ట్రానికి లేఖ అందించారు.

ఈ వ్యవహారమంతటినీ జాగ్రత్తగా పరీక్షిస్తే ఇదంతా ముందే రాసుకున్న స్క్రిప్ట్ ప్రకారమే జరిగినట్లుగా ఉందని స్పష్టమవుతోంది. యాసంగిలో వరి వద్దన్న పాపం తమది కాదని రైతులకు తెలియజెప్పాలన్న వ్యూహం రాష్ట్ర ప్రభుత్వానిదైతే, ప్రతీ సంవత్సరం మొత్తం ధాన్యం కొనుగోలు చేసేది తామేనని, రాష్ట్ర ప్రభుత్వానిది కేవలం దానిని సేకరించి, అమ్మే దళారి పాత్రేనని రైతులకు అర్థం అయ్యేలా చేయాలన్న ప్రతివ్యూహం కేంద్రానిది. ఈ వ్యూహ ప్రతివ్యూహాల్లో నాణ్యత పేరుతో ధర తగ్గించడం, తరుగు పేరుతో బస్తాకు 4 కె.జి.ల ధాన్యం తీసుకోవడం వంటి దోపిడీకి గురవుతూ కల్లాల వద్ద, కొనుగోలు కేంద్రాల వద్ద పడిగాపులు గాస్తూ పోయిన రైతుల ప్రాణాలు, ఆత్మహత్యలు ప్రభుత్వాల నాటకం ముందు తెరమరుగయ్యాయి.

కొనుగోలు కేంద్రాలు దాదాపు ఎత్తేసే సమయానికి వ్యవసాయాన్ని వదిలి ఉద్యోగ, ఉపాధ్యాయులకు చెందిన జి.ఓ. 317 కథాంశంగా తెరమీదకొచ్చింది. కొత్త జిల్లాలు, జోన్ల పునర్విభజన వల్ల చేయాల్సిన లోకల్ కేడరైజేషన్‌లో సీనియార్టీ ఆధారంగా చేపట్టిన జిల్లాల కేటాయింపు రసాభాసగా మారింది. ఉద్యోగ, ఉపాధ్యాయులు కుటుంబాలను, పుట్టి పెరిగిన ప్రాంతాలను వదిలి దూర ప్రాంత జిల్లాలకు స్థానికులుగా వెళ్లాల్సి వచ్చింది. ప్రభుత్వ ఏకపక్ష విధానాలు తల్లిదండ్రులను, తల్లిపిల్లలను, భార్యాభర్తలను వేరుచేశాయి. ఈ వలస వచ్చిన స్థానికతను సృష్టిస్తున్న జి.ఓ. 317ను రద్దు చేయాలని ఉద్యోగ, ఉపాధ్యాయులు చేస్తున్న పోరాటం రాజకీయ రూపు తీసుకుంది. ఇదే డిమాండ్ తో బీజేపీ ఎం.పి. బండి సంజయ్ కరీంనగర్‌లో దీక్ష చేపట్టడం, దీక్షకు అనుమతి లేదని అరెస్టు చేయడం, కోవిడ్ నిబంధనల ఉల్లంఘన కేసులు నమోదు చేయడం, 14 రోజుల రిమాండ్ విధించడం చకచకా జరిగిపోయాయి. దీంతో రాజకీయ రగడ రెండవ ఎపిసోడ్ మొదలైంది.

బండి సంజయ్‌కి పరామర్శ పేరుతో ఆ పార్టీ జాతీయ అధ్యక్షుడు జగత్ ప్రకాష్ నడ్డా, కేంద్రమంత్రులు కిషన్ రెడ్డి, భగవంత్ ఖుబా, చత్తీస్ గఢ్ మాజీ ముఖ్యమంత్రి రమణ సింగ్, మధ్య ప్రదేశ్, అసోం రాష్ట్రాల ముఖ్యమంత్రులు శివరాజ్ సింగ్ చౌహాన్, హిమంత విశ్వ శర్మలు రాష్ట్రంపై దండెత్తారు. జి.ఓ. 317 రద్దు చేసేవరకు వదిలేది లేదంటూనే తాము అధికారంలోకి రాగానే మొత్తం ప్రక్రియను రద్దుచేస్తామని ప్రకటిస్తున్నారు. అదే సమయంలో ఉద్యోగాల భర్తీలో మీరంటే మీరే విఫలమయ్యారని ఎదురుదాడికి దిగారు. నువ్వే దొంగవి అంటే, కాదు నువ్వే అనుకుంటున్న ఇరు వర్గాల వైఖరిని నిరుద్యోగులు, తెలంగాణ సమాజం గమనిస్తూనే ఉంది. వంద మందితో దీక్షకు సిద్ధమైన బండి సంజయ్ ని అరెస్టు చేసి, జె.పి.నడ్డా వేల మందితో ర్యాలీ, బహిరంగ సభ నిర్వహిస్తుంటే పక్కనే ఉండి సహకరించిన పోలీసుల వైఖరిని బట్టి ప్రభుత్వ ఉద్దేశ్యం అర్థం చేసుకోవచ్చు. రాష్ట్రంలో బీజేపీకి చేతినిండా పని కల్పించాలనే వ్యూహంలో భాగమే సంజయ్ అరెస్ట్ అని ప్రజలు భావిస్తున్నారు. జిల్లాలకు పోస్టుల కేటాయింపు కోసం రాష్ట్ర ప్రభుత్వం రెండు సంవత్సరాల క్రితమే జారీ చేసిన ఉత్తర్వులు 124, 128లో స్థానికతను విస్మరించినప్పటికీ కేంద్ర హోంశాఖ ఆమోదించింది. అప్పుడే బీజేపీ అభ్యంతరం తెలపకుండా

ఇప్పుడు ఈ నాటకాలు ఎందుకని ఉద్యోగ, ఉపాధ్యాయులు ప్రశ్నిస్తున్నారు. అసలు సమస్యను తప్పుదోవ పట్టించడానికి రెండు పార్టీలు, ప్రభుత్వాలు కూడబలుక్కున్న నాటకంగా వారు భావిస్తున్నారు.

సరిగ్గా రెండు నెలల నుంచే అంటే నవంబర్ నుంచి కేసీఆర్ రాజకీయ వ్యూహాన్ని మార్చుకున్నారని స్పష్టమవుతోంది. తెలంగాణ రాష్ట్రంలో అంతగా బలం లేని బీజేపీని బలమైన ప్రతిపక్షంగా చిత్రీకరించడానికి ఆయన ప్రయత్నిస్తున్నారు. అంటే బీజేపీకి ఉన్న వాపును బలుపుగా నమ్మించే ప్రయత్నం అన్న మాట. దీనివల్ల రాష్ట్రంలో ఉద్యోగులు, ఉపాధ్యాయులు, నిరుద్యోగులు, రైతులు ఇలా అన్ని వర్గాల ప్రజల్లో పేరుకున్న ప్రభుత్వ వ్యతిరేకతను ఎన్నికల్లో చీల్చే వ్యూహాన్ని రచించి అమలు చేస్తున్నారు. వాస్తవానికి తెలంగాణ రాష్ట్రంలో టి.ఆర్.ఎస్. తర్వాత ఓటుబ్యాంక్‌ను కలిగి ఉన్నది కాంగ్రెస్ పార్టీ. ఆ పార్టీకున్న సాంప్రదాయక ఓటుబ్యాంక్ ఇప్పటికీ చెదిరిపోలేదని, పైగా ప్రభుత్వ వ్యతిరేకత వల్ల అది మరింత బలపడే ప్రమాదం ఉంటుందని కేసీఆర్ భావిస్తున్నారు. ప్రభుత్వ వ్యతిరేకతను చీల్చకపోతే తాను పీఠానికి దూరం కావడం ఖాయమన్న గ్రహింపు కారణంగా బీజేపీకి చేయూతనిస్తున్నారు.

ధాన్యం కొనుగోలు వ్యవహారంలో నిర్వహించిన పాత్ర, రాసిన లేఖలు, బండి సంజయ్ అరెస్టు, నడ్డా ర్యాలీ, సభలను జరగనివ్వడం ఇవన్నీ ఆ చేయూతకు ఆచరణ రూపాలే. బీజేపీ మతోన్మాదుల పార్టీ అని, లౌకికవాద వ్యతిరేకి, అని ఉన్నట్టుండి గుర్తొచ్చింది కూడా అందుకే. ఆ పార్టీ కేంద్రంలో అధికారంలోకి రాకుండా చూడాలని, దానిని కూకటి వేళ్ళతో పెకిలించాలని, అది ప్రాంతీయ పార్టీలతోనే సాధ్యం అని చెప్తుండడం వెనుక కాంగ్రెస్ ను పూర్తిగా దెబ్బతీసి, బీజేపీని ప్రధాన ప్రతిపక్షంగా చూపి మూడవసారి అధికారాన్ని చేజిక్కించు కోవాలన్న తాపత్రయం ఉంది. అందుకే ఇతర రాష్ట్రాల బీజేపీ నేతలనేమో రాజకీయ పర్యాటకులుగా వర్ణిస్తూ తామూ తమిళనాడు, కేరళ ముఖ్యమంత్రులు స్టాలిన్, పినరయి విజయన్, వామపక్ష పార్టీలు, బీహార్ ముఖ్య నేత తేజస్వి యాదవ్ లతో సమావేశాలు, చర్చలు జరిపారు. ఇదంతా ఏదో జరుగుతుందని భ్రమలు కల్పించి తన వ్యూహాన్ని నమ్మించడానికి చేసే హడావుడి తప్ప ఇంకేమి కాదు. ఉద్యమంలో అయినా, రాజకీయాల్లో అయినా తనకు ఎదురుగా నిలిచే, తనను ప్రశ్నించే, విమర్శించే వ్యక్తులు, సంస్థలను ఎంతమాత్రం పట్టించుకోనట్లు వ్యవహరించడం కేసీఆర్ రాజకీయ వైఖరి. ఇలాంటి వాటి గురించి తానే స్వయంగా మాట్లాడితే వారిని ప్రజల ముందు పెద్దవాళ్లను చేసి, ప్రాధాన్యతను పెంచినట్లవుతుందనేది ఆయన ఆలోచన. మొదటి నుంచి ఈ వైఖరికే కట్టుబడి వస్తున్నారు.

కానీ, అకస్మాత్తుగా బీజేపీని, అందులోని చోటా మోటా నాయకుల గురించి కూడా స్వయంగా మీడియా ముందు మాట్లాడడం వెనుక వారిని పెద్దవారిగా చూపడమనే లక్ష్యం ఉంది. ఎప్పుడో గానీ మీడియా ముందుకు రాని ముఖ్యమంత్రి ఇప్పుడు తరుచుగా మీడియా సమావేశాల్లో పాల్గొంటున్నారు.

ఈ వాదనలకు బలం చేకూర్చే మరొక ముఖ్యమైన విషయం మీడియా అనుసరిస్తున్న వైఖరి. ప్రభుత్వ వ్యతిరేక వార్తలకు, విమర్శలకు ఎంతమాత్రం స్థానం కల్పించని మెజార్టీ మీడియా కేసీఆర్‌తో పాటే దారి మార్చుకుంది. బీజేపీ నాయకుల ప్రతీ కార్యక్రమానికి విపరీత ప్రాధాన్యతను కల్పిస్తుంది. దీని వెనుక కారణాలు ఏంటో, ఎవరి వ్యూహంలో భాగమో అర్థం చేసుకోవడం చాలా తేలికే.

కేసీఆర్ వ్యూహం బీజేపీ పెద్దలకు తెలియనిదేం కాదు. తమది వాపు తప్ప బలుపు కాదని వారికీ తెలుసు. కానీ, కేసీఆర్ వ్యూహంలో ఆయన అధికారాన్ని నిలుపుకుంటాడా లేదా అనేది బీజేపీకి సంబంధం లేని విషయం. తాము బలపడడం అయితే తథ్యం అని వారి నమ్మకం. అందుకు తగినట్లుగానే అన్ని వనరులను వినియోగిస్తూ వ్యూహాత్మకంగా పనిచేస్తున్నారు. ఇప్పుడు కాకపోయినా వచ్చేసారైనా అధికారానికి చేరువ కాగలమన్న స్వార్థం వారిది. ప్రభుత్వ వ్యతిరేక ఓట్ల చీలిక ద్వారా అధికారాన్ని నిలుపుకోవాలన్న స్వార్థం వీరిది. ఇలా ఏక కాలంలో ఎవరి స్వార్థం కోసం వారు పనిచేస్తూనే ఒకరి అవసరాల కోసం ఇంకొకరు సాయపడుతున్నారు.

మొత్తంగా అధికార పార్టీల మధ్య జరుగుతున్న ఈ కలహానికి అధికారం మీద మోజు తప్ప ప్రజల మీద ప్రేమ కాదని స్పష్టంగా తెలుస్తుంది. అశాశ్వతమైన అధికారంలో మరో ఐదు సంవత్సరాలు ఉండడం కోసం మత ఉన్మాదాన్ని నరనరాన నింపుకున్న, ఫాసిస్ట్ నియంతలను తెలంగాణ గడ్డ మీద బలపడేలా చేసి, ఇక్కడి మత సామరస్యాన్ని దెబ్బ తీసేందుకు వారధి గా నిలుస్తున్న కేసీఆర్ ను తెలంగాణ సమాజం ఎన్నటికీ క్షమించదు. కూకటి వేళ్ళతో పెకిలించాలంటూనే బలంగా నాటుకోవడానికి, ఎదగడానికి దోహదం చేస్తున్న ఆయన మాటలకు, చేతలకు పొంతన కుదరడం లేదు. ఈ ద్వంద్వ వైఖరి పట్ల కేసీఆర్‌ను, టి.ఆర్.ఎస్ పార్టీని తెలంగాణ సమాజం నిలదీయాల్సి ఉంది.

తెలంగాణ రాష్ట్ర సాధన చరిత్రలో ఎంతో కొంత పాత్రను సొంతం చేసుకున్న ఆయన ఈ వైఖరి వల్ల చరిత్ర హీనుడిగా మిగిలిపోగలడన్న సత్యాన్ని ఇప్పటికైనా గ్రహిస్తే మంచిది. లేదంటే ఈ ప్రణయ కలహాన్ని ప్రజలు గ్రహిస్తే, నువ్వు కొట్టినట్లు నటించు, నేను ఏడ్చినట్లు నటిస్తా అని మీరనుకుంటే ప్రజలూ నమ్మినట్లే నటించి తగిన బుద్ధి చెప్తారు. ఈ అవగాహనతో విజ్ఞులైన ప్రజలు రెండు పార్టీలకు రాజకీయ పాతరేయగలరు. ఒకరిమీద ఒకరు చేస్తున్న యుద్ధ ప్రకటనలతో తెలంగాణకు తలపెట్టదలిచిన ద్రోహానికి బదులు తీర్చుకునే రోజు తప్పక వస్తుంది. ఆరోజు ప్రజా యుద్ధం మీ వైపు మరులుతుంది. ఆ యుద్ధంలో మతోన్మాదాన్నీ, ప్రజా వ్యతిరేక రాజకీయాలను, వాటి పునాదులను కూకటి వేళ్ళతో పెకిలించడం ఖాయం.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# ఆన్‌లైన్ విద్యలో అసమానతలు

*కరోనా కారణంగా విద్యారంగంలో మొదలైన ఆన్‌లైన్ బోధనా పద్ధతులు అసమానతలను ఎలా పెంచుతున్నాయో, పేద విద్యార్థులను చదువుకు ఎలా దూరం చేస్తున్నాయో వివరిస్తున్నారు* **కె. ఆనంద్**

కరోనా మూడవ వేవ్ రీత్యా తెలంగాణ సర్కారు జనవరి 30 వరకు సెలవులు పొడిగిస్తూ ఆదేశాలు జారీ చేసింది. ఓయూ, జెఎన్‌టియు, శాతవాహన యూనివర్సిటీలతో పాటు మిగతా యూనివర్సిటీలు ఉన్నత విద్యలో ఆన్‌లైన్/డిజిటల్ విద్యాబోధన జరుపుతామని ప్రకటించాయి. పాఠశాల, ఇంటర్మీడియట్ విద్యలో ఆన్‌లైన్ బోధనకు మొగ్గుచూపుతున్న తెలంగాణ సర్కారు పేద, మధ్యతరగతి విద్యార్థులు ఆన్‌లైన్/డిజిటల్ పాఠాలు వినేందుకు ఎలాంటి సౌకర్యాలు కల్పించటం లేదు. ప్రభుత్వ నిర్లక్ష్యంతో మొదటి, రెండవ కరోనా వేవ్‌లలో ఆన్‌లైన్/డిజిటల్ బోధన పాఠాలు అందక తీవ్రంగా నష్టపోయిన పేద విద్యార్థులు మూడవ వేవ్‌లో కూడా విద్యకు పూర్తిగా దూరమయి రోజువారి కూలీలుగా, మేకల కాపరులుగా మారుతారు. డ్రాపౌట్ విద్యార్థుల సంఖ్య పెరిగే అవకాశం ఉంది. ఉన్నత విద్యనభ్యసించే విద్యార్థుల పరిశోధనలు, ఉద్యోగ ప్రయత్నాలు నిలిచిపోయి చదువుకున్న నిరుద్యోగులుగా మారనున్నారు.

రెండేళ్లుగా కరోనా అనుభవం మనముందు ఉన్నప్పటికీ విద్యా సంస్థల్లో, సంక్షేమ హాస్టళ్లలో, గురుకులాలలో కనీస వసతులు మెరుగు పరచలేదు. విద్య సంస్థలు ప్రారంభించిన ఈ నాలుగు నెలల్లో మహాత్మ జ్యోతిరావు పూలే వెనకబడిన తరగతుల గురుకులాల్లో పదుల సంఖ్యలో కరోనా కేసులు నమోదయ్యాయి. సంగారెడ్డి జిల్లా ఇంద్రేశం బీసీ గురుకుల బాలికల పాఠశాలలలో 46 మందికి కరోనా సోకగా, వికారాబాద్ జిల్లా కొడంగల్ బాలుర గురుకులంలో ఐదుగురితో పాటు సాంఘిక సంక్షేమ శాఖ గురుకులాల్లో, ఎస్‌సి, ఎస్‌టి, బిసి సంక్షేమ హాస్టళ్లలో, మోడల్ స్కూళ్లలో అనేక కేసులు బయట పడ్డాయి. దేశవ్యాప్తంగా కరోనా విజృంభిస్తున్న వేళ విద్యా సంస్థలు ప్రారంభించినా, ప్రారంభించకపోయినా నష్టపోయేది బడుగు బలహీన వర్గాల విద్యార్థులే అనేది స్పష్టమవుతున్నది. ఈ పరిస్థితి ఏర్పడుతుందనేది రెండేళ్ల అనుభవంలో రుజువైంది. అయినా తెలంగాణ పాలకులు విద్యా సంస్థల్లో వసతులు మెరుగుపరచకుండా, ప్రత్యామ్నాయ విధానాలు రూపొందించకుండా విద్యార్థుల భవిష్యత్తును అంధాకారంలో నెట్టివేశారు.

భౌతిక తరగతులు సాధ్యం కానియెడల ఆన్‌లైన్/డిజిటల్ పాఠాలు విద్యార్థులందరికీ చేర్చాల్సిన బాధ్యత ప్రభుత్వ పాలకులపై ఉంటుంది. కానీ ఆన్‌లైన్ బోధనలో కూడా కనీస సౌకర్యాలు మెరుగుపరచక పోవడంతో విద్యాబోధన ప్రశ్నార్థకంగా మారింది. ప్రపంచ వ్యాప్తంగా కరోనా లాక్‌డౌన్ కాలంలో 24 మిలియన్ల పాఠశాల స్థాయి విద్యార్థులు డ్రాపౌట్లుగా మారినట్లు ఐక్యరాజ్య సమితికి చెందిన అనుబంధ సంస్థ యునెస్కో ప్రకటించింది.

2020 మార్చి 20 నాడు దేశవ్యాప్త లాక్‌డౌన్‌లో భాగంగా తెలంగాణలో విద్యా సంస్థలు మూసివేయటంతో విద్యార్థుల చదువులు నిలిచిపోయాయి. అనంతరం 2020 సెప్టెంబర్ 1 నాడు ప్రభుత్వం ప్రకటించిన వర్చువల్ విధానంలో ఆన్‌లైన్ తరగతులు పేరుకే మిగిలిపోయాయి. గ్రామీణ ప్రాంతాలలోని, పట్టణ ప్రాంతాలలోని ఎస్‌సి, ఎస్‌టి, బిసి, మైనార్టీ వర్గాల-కులాల పేద విద్యార్థులు ఆన్‌లైన్ తరగతులు వినేందుకు అవసరమైన సౌకర్యాలు, కనీసం స్మార్ట్ ఫోన్, ఇంటర్నెట్ లేక తీవ్రంగా నష్టపోయారు. వీరి చదువులు పూర్తిగా నిలిచిపోయాయి.

తెలంగాణలో ప్రాథమిక స్థాయి విద్యార్థుల నుండి ఇంటర్మీడియట్ విద్యార్థుల వరకు ప్రభుత్వం అట్టహాసంగా ప్రకటించిన టి-శాట్, దూరదర్శన్ తరగతులు పర్యవేక్షకులు, టీచర్లు లేక విద్యార్థులు వినలేకపోయారు. ఏజెన్సీ ప్రాంతాలలో 80 శాతం గిరిజన విద్యార్థులు కేబుల్ కనెక్టివిటీ, మొబైల్ నెట్‌వర్క్, స్మార్ట్ ఫోన్, స్మార్ట్ టెలివిజన్ లేక ఆన్‌లైన్ పాఠాలు అందలేదు. ఈ కాలంలో పాఠశాల డ్రాపౌట్ విద్యార్థుల సంఖ్య విపరీతంగా పెరిగింది.

2021 అక్టోబర్‌లో తెలంగాణలో విద్యా సంస్థలు ప్రారంభించడంతో ప్రైవేట్, బడ్జెట్ పాఠశాలలలో డ్రాపౌట్లు 10-20 శాతం ఉండగా, ప్రభుత్వ పాఠశాలలలో డ్రాపౌట్ విద్యార్థుల సంఖ్య రెట్టింపుగా ఉంది. ఇక బడి మానేసిన బాలికలు చదివే కస్తూరిబా గాంధీ బాలికల విద్యాలయాల (కెజిబివి)లో 50 శాతం మించి విద్యార్థులు బడిమానేశారు. ఎకనామిక్ సర్వే 2019-20, విద్యార్థుల్లో డ్రాపౌట్ పెద్ద మొత్తంలో సూచించింది. 13.6 శాతం విద్యార్థులు పేదరికంతో బడి మానేశారు. ప్రాథమిక విద్యలో 10 శాతం, ప్రాథమికోన్నత విద్యలో 17.5 శాతం, ఇంటర్మీడియట్ సెకండరీ విద్యలో 19.8 శాతం విద్యార్థులు చదువుకు దూరమయ్యారని 2020 జనవరిలో ప్రకటించారు.

2020 నవంబర్‌లో జతీల్లీకి చెందిన చైల్డ్ ఫండ్ ఇండియా అనే ఎన్‌జిఓ పది రాష్ట్రాలలోని 20 జిల్లాలోని విద్యార్థులు, ఉపాధ్యాయుల సర్వేలో 64 శాతం గ్రామీణ ప్రాంత విద్యార్థులు, పేద విద్యార్థులు డ్రాపౌట్లుగా మారారని నివేదిక విడుదల చేసింది. 2020-21

సంవత్సరానికి తెలంగాణలో డ్రాపౌట్ల సంఖ్యను తెలంగాణ సర్కారు ఇంకా ప్రకటించటం లేదు. డ్రాపౌట్ల సంఖ్య విపరీతంగా పెరగడమే ఇందుకు కారణం. భారత పాలకులు ఆన్‌లైన్ తరగతుల పేర ప్రపంచ పెట్టుబడిదారులకు ఈజ్ ఆఫ్ డూయింగ్ వ్యాపారంలా ఆన్‌లైన్ విద్యా బోధనను మారుస్తూ గూగుల్, జియో, జూమ్, రిలయన్స్ వంటి అంతర్జాల బడా కార్పొరేట్ కంపెనీలకు, ఎలక్ట్రానిక్ గ్యాడ్జెట్‌లు అమ్మే సామ్రాజ్యవాద కంపెనీలకు లక్షల కోట్లు దోచిపెడుతున్నారు. విద్యార్థుల తల్లితండ్రులు వారికున్న ఎకరా, అర భూములమ్మి పిల్లలకు స్మార్ట్ ఫోన్లు, స్మార్ట్ టెలివిజన్లు కొంటున్న పరిస్థితి నేడు దేశంలో ఏర్పడింది. ఇక కటిక దారిద్ర్యంలో మగ్గుతున్న తల్లిదండ్రులు వారి పిల్లలను వారితో పాటు పనిలోకి తీసుకెళ్తున్నారు. వారికి ఎలక్ట్రానిక్ గ్యాడ్జెట్లు కొనే ఆర్థిక స్థోమత లేదు. ఆన్‌లైన్ పాఠాలు వినలేకపోతున్నామని విద్యార్థులు ఆత్మహత్య చేసుకున్నారు. నాడు వేద విద్యను అభ్యసించడానికి అనర్హులుగా మారిన శోషిత జన సమూహాల ప్రజల పిల్లలు, నేడు పెట్టుబడిదారీ ప్రయోజనాలు నెరవేర్చే ఆన్‌లైన్ విద్యా పేరుతో జరుగుతున్న కుట్రలో చదువుకు దూరంగా గెంటివేయబడుతున్నారు. డ్రాపౌట్ విద్యార్థులను గుర్తించటంలో పాలకులు తీవ్ర నిర్లక్ష్యం వహిస్తున్నారు.

2021 అక్టోబర్‌లో పాఠశాలలో భౌతిక తరగతులు ప్రారంభించే ముందు దేశవ్యాప్తంగా డ్రాపౌట్లుగా మారిన విద్యార్థులను గుర్తించేందుకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అత్యవసర చర్యలు చేపట్టాల్సి ఉన్నప్పటికి తీవ్ర నిర్లక్ష్యం వహించాయి. కేంద్ర విద్యా శాఖ బడిబయట ఉన్న 6-18 సంవత్సరాల విద్యార్థులను గుర్తించి పాఠశాలలో చేర్పించాలని 2021 జనవరి 10 నాడు ఇచ్చిన ఆదేశాలు నామమాత్రంగా మిగిలిపోయాయి. ఒక్క డ్రాపౌట్ విద్యార్థిని గాని, బడి బయట ఉన్న వలస కార్మికుల పిల్లలను గాని గుర్తించలేదు. కనీసం స్పెషల్ ట్రైనింగ్ క్యాంపులు గాని, పాఠశాలలకు సన్నద్ధం చేసే బ్రిడ్జి కోర్సులు గాని కేంద్ర విద్యశాఖ నిర్వహించలేదు.

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం డ్రాపౌట్లను గుర్తించి పాఠశాలలో చేర్పించేందుకు ఇప్పటివరకు ఎలాంటి చర్యలు చేపట్టకపోవటం పేదలపట్ల, రైతు కూలీల బిడ్డల పట్ల తెరాస సర్కారు నిర్లక్ష్య వైఖరికి నిదర్శనం. జాతీయ విద్యా విధానం 2020లో ప్రటించిన సస్టేనబుల్ అభివృద్ధి లక్ష్యం-4 అనే ఎజెండాలో భాగంగా ప్రభుత్వం 2030 కల్లా ఇండియాను సర్వ సమగ్ర విద్య అభివృద్ధి దేశంగా మారుస్తామని, అందుకొరకు నవోదయ విద్యాలయ స్కీమ్స్, ఇ-పాఠశాల, దీక్ష, ప్రధాన మంత్రి ఇన్నోవేటివ్ స్కీం వంటి ఆన్‌లైన్ వేదికలు ఏర్పాటు చేస్తామని ప్రకటించడం సామ్రాజ్యవాద కంపెనీల ఫైనాన్స్ పెట్టుబడిని విద్యారంగంలో చొప్పించేందుకే అనేది స్పష్టమవుతున్నది. అనియత ఆన్‌లైన్ విద్యతో పాలకులు ఒకవైపు పేదలకు విద్యనందించే బాధ్యత నుండి తప్పుకొంటూ, మరోవైపు పెట్టుబడిదారుల ప్రయోజనాలను నెరవేర్చుతున్నారు. కరోనా సంక్షోభం పేరుతో ప్రారంభించిన ఆన్‌లైన్ విద్యా బోధన, నూతన విద్యా విధానం 2020తో సుస్థిరమవుతూ వేల సంఖ్యలో పేద విద్యార్థులను డ్రాపౌట్ విద్యార్థులుగా తయారు చేస్తూ, సామాజిక వివక్షతను పెంపొందిస్తున్నది. బాలకార్మిక వ్యవస్థ, బాలిక వివాహాలను ప్రోత్సహిస్తూ, గ్రామాల్లో అర్ధ బానిసలను తయారు చేస్తున్నది.

ఆన్‌లైన్ విద్యా బోధన దారిద్ర్య రేఖకు దిగువనున్న పేదలకు అందే విధంగా అవసరమైన సౌకర్యాలైనా మెరుగుపరచాలి. అందుకనుగుణంగా ప్రతి విద్యార్థికి ఐ ట్యాబ్, ఇంటర్నెట్ కనెక్టివిటీ కల్పించాలి. తెలంగాణ వ్యాప్తంగా ఉన్న పాఠశాల, ఇంటర్మీడియట్ విద్యార్థులకు ట్యాబ్, ఇంటర్నెట్ సౌకర్యం కల్పించితే 3 వేల కోట్ల రూపాయలకు మించదు. భారీ నీటిపారుదల ప్రాజెక్టుల పేరుతో వేల కోట్లు ఖర్చు చేస్తున్న సర్కారు అందులో 3 శాతం కేటాయించినా పేద విద్యార్థులకు కొంతనైనా మేలు జరుగుతుంది. మన ఊరు-మన బడి పేరుతో మౌలిక సదుపాయాల కల్పనకు 7,289 కోట్ల రూపాయలు కేటాయిస్తామని చెప్తున్న తెలంగాణ సర్కారు ఆన్‌లైన్ ఉపకరణాల పంపిణీకి నిధులు మంజూరు చేయాలి. అందరికి విద్యా హక్కు అమలు జరగాలంటే పేద, మధ్యతరగతి విద్యార్థులకు పూర్తిస్థాయిలో ఆన్‌లైన్/డిజిటల్ పాఠాలు అందాల్సిందే. విద్యా బోధనలో ఈ సమానత్వంకై పోరాడాల్సిన కర్తవ్యం మనందరిపై ఉన్నది.

*(రచయిత పిడిఎస్‌యు (విజృంభణ) రాష్ట్ర ప్రధాన కార్యదర్శి)*

జ్ఞాన సిద్ధాంతం అనేది చరిత్ర పొడవునా మనిషి సాగిస్తూ వచ్చిన ఆచరణాత్మక శ్రమల నుంచి వేరు చేయగలిగినది కాదు. అలాగే సామాజిక సంబంధాల చరిత్రను అర్థం చేసుకొనే సాధనం ఆ శ్రమ మాత్రమే. మనిషి అనుభవానికి ప్రాథమిక వనరు అయిన ఉత్పాదక శ్రమ ఒక పరిధిలోపల మాత్రమే జరుగుతుంది. ఆ పరిధిని భౌతిక ఉత్పత్తి శక్తులు నిర్ణయిస్తాయి. ఆ పరిధి సామాజిక సంబంధాలు విధించే పరిమితుల లోపలే ఉంటుంది. అయితే ప్రకృతికీ మనిషికీ మధ్య సంబంధం ఉత్పత్తి శక్తుల ద్వారా చిత్రణ పొందుతూ కూడా అతని చైతన్యయుతమైన జోక్యం ద్వారా మారుతూ ఉంటుంది. అలాగే ఉత్పత్తి శక్తుల అభివృద్ధి వల్ల, వర్గపోరాట స్థితి వల్ల ఉత్పత్తి సంబంధాలు మారుతూ ఉంటాయి. మనిషి ఆచరణలో ప్రతి మార్పు కొత్త భౌతిక వాస్తవాలను, పరిశీలనలను వెలికితీస్తుంది. ఉత్పత్తి సంబంధాలలో ప్రతి గుణాత్మక మార్పు కొత్త భావనలకు, కొత్త ఆలోచనలకు దారితీస్తుంది. అంటే, సిద్ధాంతాలన్నీ ఒక సాపేక్షికమైన పద్ధతిలోనే అభివృద్ధి చెందుతూ ఉంటాయి. ఏకైక సిద్ధాంతం, సార్వత్రికంగా వర్తించే సిద్ధాంతం, సర్వకాలాలకూ వర్తించే సిద్ధాంతం అనేదేదీ లేదు. మనిషికి ఉండే సామాజిక అనుభవాన్ని, అతని ప్రవర్తనను ఎల్లకాలానికీ వివరించగల సిద్ధాంతం లేదు. అంటే చరిత్ర అనేది మార్క్స్ అన్నట్టు ఒక మహా యుద్ధ రంగం. అందులో సమాజమూ, ప్రకృతీ కూడా స్థల, కాలబద్ధమై ఉంటాయి.

**- కృష్ణా భరద్వాజ్**

# సహేతుకత లేని అసంబద్ధ వేతన సవరణ

*ఆంధ్రప్రదేశ్‌లో ఉపాధ్యాయ, ఉద్యోగ, పెన్షనర్ వర్గాల ఆందోళనకూ, ఆగ్రహానికీ కారణమైన ప్రభుత్వ అనుచిత చర్యలను వివరిస్తున్నారు* **పి. పాండురంగ వరప్రసాదరావు**

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రభుత్వ ఉద్యోగులకు, ఉపాధ్యాయులకు, కాంట్రాక్టు అవుట్ సోర్సింగ్ ఉద్యోగులకు వేతన సవరణ చేస్తూ 17-01-2022 అర్ధరాత్రి ఉత్తర్వులను జారీ చేసింది. ఆంధ్రప్రదేశ్‌లో 1958 నుండి వేతన సవరణ కమిషన్‌ను నియమించటం ఆ కమిషన్ సిఫారసులపై ఉద్యోగ సంఘాలతో చర్చించి ఉద్యోగులకు వేతన నిర్ణయంచేయటం పరిపాటిగా వస్తున్నది. ప్రతి 5 సంవత్సరాలకు వేతన పునర్వ్యవస్థీకరణ జరుగుతున్నది.

2018 జూలై 1న జరగవలసిన వేతన సవరణ కొరకు మాజీ ఐ.ఎ.ఎస్. అధికారి అశుతోష్ మిశ్రా ఆధ్వర్యాన 11వ పేరివిజన్ కమిషన్‌ను రాష్ట్ర ప్రభుత్వం నియమించింది. ఆ కమిషన్ నివేదికను 2020 అక్టోబర్‌లో రాష్ట్ర ప్రభుత్వానికి సమర్పించింది. రాష్ట్ర ప్రభుత్వం ఆ నివేదికను ఇంతవరకు బయటపెట్టలేదు. నివేదిక ప్రభుత్వానికి చేరి సంవత్సరకాలం గడిచినప్పటికీ ప్రభుత్వం వైపు నుండి ఎటువంటి స్పందన లేకపోవడంతో ఉద్యోగ, ఉపాధ్యాయ సంఘాలు ఆందోళనలు ప్రారంభించాయి.

గత 60సంవత్సరాలుగా వస్తున్న సంప్రదాయానికి భిన్నంగా కార్యదర్శుల కమిటీని నియమించారు. ఆ కమిటీ ఒక వారం పది రోజులలోనే నివేదికను రూపొందించింది. ఒకటిన్నర సంవత్సరాలు కష్టపడి రూపొందించిన నివేదికను ప్రక్కన పెట్టి కార్యదర్శుల కమిటీ నివేదిక ఆధారంగా వేతన నిర్ణయం చేస్తామని ప్రభుత్వం ప్రకటించింది. ఉద్యోగ సంఘాల జె.ఎ.సి.లను చర్చలకు పిలవకుండా ప్రభుత్వ సివిల్ జాయింట్ స్టాఫ్ కౌన్సిల్ సభ్య సంఘాలను మాత్రమే చర్చలకు ఆహ్వానించారు. ఏ సంఘానికైనా ప్రభుత్వాల అభీష్టం మేరకే సివిల్ జాయింట్ స్టాఫ్ కౌన్సిల్‌లో సభ్యత్వం లభిస్తుంది. ఉద్యమానికి నోటీసు ఇచ్చిన జె.ఎ.సి.ల ఐక్య వేదికకు బదులుగా సివిల్ జాయింట్ స్టాఫ్ కౌన్సిల్‌లోని సంఘాలను ఆహ్వానించడంలోనే ప్రభుత్వ అప్రజాస్వామిక వైఖరి బహిర్గతమయింది.

**ఫిట్మెంట్:**

12 సార్లు చర్చలు జరిగాయని ప్రభుత్వం చెబుతోంది. అనంతరం ముఖ్యమంత్రిగారు 23 శాతం ఫిట్మెంట్ ప్రకటించారు. కార్యదర్శుల కమిటీ 14.29 శాతం మాత్రమే సిఫారసు చేసిందని కాని తాను 23 శాతం ఇస్తున్నట్లుగా ప్రకటించారు. ఫిట్మెంట్ 14.29 శాతానికి గాని, 23 శాతానికి గాని ప్రాతిపదిక ఏమిటి అనే విషయాన్ని ప్రభుత్వం ఎక్కడా చెప్పలేదు.

ఉద్యోగుల జీతాలను, భత్యాలను నిర్ణయించుటకు 15వ ఇండియన్ లేబర్ కాంగ్రెస్ రూపొందించిన కనీస అవసరాలను వాటి పరిమాణాలను ఆధారంగా కేంద్రప్రభుత్వం తీసుకుంటున్నది. పలు రాష్ట్రాలు కూడా ఇదే విధానాన్ని అనుసరిస్తున్నాయి. డా. ఆక్రాయిడ్ నిర్దేశించిన కనీస కుటుంబ అవసరాల ఆధారంగా 15వ ఇండియన్ లేబర్ కాంగ్రెస్ ఈ విధానాన్ని రూపొందించింది. మన రాష్ట్రంలో మొదటి నాలుగు పి.ఆర్.సి.లలోను ఫిట్మెంట్ ప్రస్తావనరాలేదు. మూలవేతనానికి, ఆనాడు ఉన్న కరువుభత్యం కలిపి కొత్త వేతన స్కేళ్ళను, వేతనాలను నిర్ణయించేవారు. సర్వీసును బట్టి వెయిటేజి ఇంక్రిమెంట్లు ఇచ్చేవారు. 5వ పి.ఆర్.సి. (1986) సందర్భంగా వాస్తవ ధరలకు, కరువుభత్యానికి వ్యత్యాసం చాలా ఉంటుందని, ఆ వ్యత్యాసాన్ని తొలగించుటకు ఫిట్మెంట్ ఇవ్వాలని ఉద్యోగ సంఘాలు కోరాయి. 1986 పి.ఆర్.సి.లో 10 శాతం ఫిట్‌మెంట్ ను ప్రకటించారు. తరువాత 6వ పి.ఆర్.సి. (1993)లో 10 శాతం, 7వ పి.ఆర్.సి. (1999)లో 27 శాతం, 8వ పి.ఆర్.సి. (2005)లో 16 శాతం, 9వ పి.ఆర్.సి. (2010)లో 39 శాతం, 10వ పి.ఆర్.సి. (2015)లో 43 శాతం ఫిట్మెంట్‌గా ఇవ్వటం జరిగింది.

డా. ఆక్రాయిడ్ నిర్దేశించిన విధానానికి అనుగుణంగా 2018 జూలై 1న రాష్ట్రంలో ఉన్న నిత్యావసర వస్తువుల ధరలు, ఇతర అవసరాలు (కుటుంబాన్ని 3 యూనిట్లుగా మాత్రమే పరిగణించి) ఖర్చులు గణించి మాస్టర్ స్కేల్లో ప్రారంభ మూలవేతనం రు. 24,000గా ఉండాలని సంఘాలు నిర్ధారణకు వచ్చాయి. 10వ పి.ఆర్.సి.లో ఇచ్చిన మాస్టర్ స్కేలులో ప్రారంభ మూలవేతనం రు. 13,000 మాత్రమే. 2018 జూలై 1 నాటికి ఉన్న కరువు భత్యం 30.39 శాతం, దానికి 55 శాతం ఫిట్‌మెంట్ ఇస్తే ప్రారంభ మూల వేతనం రు. 24,000 అవుతుంది. కావున 55 శాతం ఫిట్‌మెంట్‌ను జె.ఎ.సి. డిమాండ్ చేయటం జరిగింది. (వివిధ సంఘాలు కొంత ఎక్కువగా అడిగాయి).

కరువు భత్యం కనుక ద్రవ్యోల్బణానికి అనుగుణంగా

పెరిగినట్లయితే, ఫిట్‌మెంట్ అవసరం ఉండదు. కాని వినియోగ ధరల సూచీకి అనుగుణంగా సవరిస్తున్న కరువు భత్యం వాస్తవంగా పెరుగుతున్న ధరలకు అనుగుణంగా లేదు. ఆ వ్యత్యాసమే ఫిట్‌మెంట్ రూపంలో ఇవ్వవలసి ఉంటుంది. కేంద్ర ప్రభుత్వం కూడా 2016 పి.ఆర్.సిలో 2.57 రెట్లు మూల వేతనం పెంచింది. (మూల వేతనం 100 శాతం కరువు భత్యం 125 శాతం, ఫిట్‌మెంట్ 32 శాతం) 32 శాతం ఫిట్‌మెంట్ ప్రకటించింది.

ప్రభుత్వం ఉద్యోగ సంఘాలతో వాస్తవ గణాంకాల ప్రాతిపదికన చర్చించి ఒక అవగాహనకు రావాలి. గతంలో అదే జరిగింది. ప్రస్తుతం ఆ ప్రజాస్వామిక అవకాశాన్ని ప్రభుత్వం ఇవ్వలేదు. ఫిట్‌మెంట్ ప్రకటించి అమలు పరచుటకు ఉత్తర్వులు జారీచేసింది. కొత్త పి.ఆర్.సి.ని ఎంచుకోవాలా? పాత పి.ఆర్.సిలో ఉండాలా అనే ఐచ్ఛికతను ప్రకటించే అవకాశం ప్రతి ఉద్యోగికి ఇంతకు ముందు ఉన్నది. ఈ ఉత్తర్వులలో ఆ అవకాశం కూడా ఇవ్వలేదు.

**మధ్యంతర ఉపశమనం:**

పి.ఆర్.సి. అమలు చేయడం ఆలస్యమైన సందర్భంలో ఉపశమనంగా మధ్యంతర ఉపశమనాన్ని (ఇంటరిమ్ రిలీఫ్) రాష్ట్ర ప్రభుత్వం ఇస్తుంది. ఆ ఉపశమనం 2019 జూలై 1 నుండి 27 శాతం ఇచ్చారు. ఫిట్‌మెంట్ ఉపశమనం కంటే ఎక్కువగా ఉండాలి. కాని అంతకంటే తక్కువ ఫిట్మెంట్ ఇవ్వటమే కాక మధ్యంతర ఉపశమనం ఇచ్చిన 2019 జూలై 1 నుండి కాక 2020 ఏప్రిల్ 1 నుండి నగదు ప్రయోజనం ప్రకటించారు. ఇది ఏ విధంగానూ హేతుబద్ధం కాదు. (నిజానికి 2018 జూలై 1 నుండి నగదు ప్రయోజనం ఇవ్వాలి). పుండు మీద కారం చల్లినట్లుగా 2019 జూలై 1 నుండి 2020 ఏప్రిల్ 1 నుంచి చెల్లించిన ఐ.ఆర్.ను కూడా కరువు భత్యం బకాయిలలో మినహాయిస్తామని ఉత్తర్వులలో పేర్కొన్నారు.

**ఇతర తగ్గింపులు:**

ఇంటి అద్దెను గణనీయంగా తగ్గించారు. 5 లక్షలలోపు ఆవాస ప్రాంతంలో 8 శాతం, 5 నుండి 50 లక్షల వరకు ఉన్న నగరాలలో 16 శాతం, ఆపైన 24 శాతంగా ఉత్తర్వులలో పేర్కొన్నారు. 50 లక్షల పైన నగరాలు ఆంధ్రప్రదేశ్‌లో లేవు. 5 లక్షల పైన 4 నగరాలే ఉన్నాయి. మిగిలిన అన్ని నగరాలు పట్టణాలకు 8 శాతం. గతంలో 12 శాతం, 14.5 శాతం, 20 శాతం ఉండేది. రు. 50,000 మూల వేతనం ఉన్న ఉద్యోగికి కూడా వచ్చే ఇంటి అద్దె రు. 4,000 మాత్రమే. రు. 4,000కు ఏ నగరంలో/పట్టణంలో కనీస సౌకర్యాలున్న ఇల్లు దొరుకుతుంది?

70 సంవత్సరాల నిండిన పెన్షనర్లకు 10 శాతం, 75 సంవత్సరాలు నిండిన వారికి 15 శాతం, 80 సంవత్సరాలు నిండిన వారికి 20 శాతం ఆపైన ప్రతి 5 సంవత్సరాలకు ఒకసారి అడిషనల్ క్వాంటమ్ అఫ్ పెన్షన్ పెంచుతారు. ఈ పి.ఆర్.సి.లో 80 సంవత్సరాలు ఆపై వారికి మాత్రమే కొనసాగిస్తూ మిగిలినవారికి రద్దుచేశారు. 2020 ఏప్రిల్ 1 నుండి వారికి చెల్లించిన మొత్తాన్ని మినహాయిస్తారు. చివరకు అంత్యక్రియల ఖర్చులు కూడా రు. 20,000కు పరిమితం చేశారు.

ఈ పి.ఆర్.సి. అమలు కారణంగా ఉద్యోగ, ఉపాధ్యాయ, పెన్షనర్లకు కనీసం రు. 2,000 నుండి రు. 12,000 వరకు వేతనం/పెన్షన్ తగ్గుతుంది. తగ్గినట్లు కనిపించకుండా ఉండటానికి డి.ఎ. వాయిదాలను ఒకేసారి మంజూరు చేశారు. బకాయిలను చెల్లించకుండా తప్పుకోవటానికి 2019 జూలై 1 నుంచి 2020 ఏప్రిల్ 1 వరకు చెల్లించిన ఐ.ఆర్., 2020 ఏప్రిల్ 1 నుంచి పాతరేట్ల ప్రకారం చెల్లించిన ఇంటి అద్దెను పెన్షనర్లకు 2020 ఏప్రిల్ 1 నుంచి చెల్లించిన అడిషనల్ క్వాంటమ్ అఫ్ పెన్షన్‌ను మినహాయించడం ద్వారా సర్దుబాటు చేస్తారు. ఇంకా ఉద్యోగులే తిరిగి చెల్లించవలసిన సందర్భం వస్తే తర్వాత ఇవ్వబోయే కరువు భత్యంలో మినహాయిస్తామని ఈ ఉత్తర్వులలో పేర్కొన్నారు.

సరైన సమయానికి కరువు భత్యం, పి.ఆర్.సి. ఇస్తామని, అధికారంలోనికి వచ్చిన వారంలోగా సి.పి.యస్ రద్దు చేస్తామని గౌరవ ముఖ్యమంత్రి ఎన్నికల ప్రచారంలో వాగ్దానం చేశారు. కాని దానికి భిన్నంగా 5 డి.ఎ. వాయిదాలను బకాయి పెట్టడం, పి.ఆర్.సి. నివేదికను పట్టించుకోకపోవటం, సి.పి.యస్.పై మాట్లాడకపోవడం చూస్తే ఉద్యోగుల జీతాలు, పెన్షన్లు తగ్గించాలనే నిర్ణయానికి ప్రభుత్వం రెండున్నర సంవత్సరాల నాడే పకడ్బందీగా పథకాన్ని రూపొందించినట్లు కనబడుతోంది. అందుకే పి.ఆర్.సి. కోత బెట్టటమే కాక, దానిని కప్పిపుచ్చటానికి డి.ఎ. వాయిదాలను కూడా ఇప్పటివరకు మంజూరు చేయకుండా కూడబెట్టి ఇప్పటికిప్పుడు విడుదల చేశారు. ఉద్యోగ, ఉపాధ్యాయ సంఘాలు డి.ఎ. బకాయిలను చెల్లించమని అడిగినప్పుడల్లా కరోనా కారణంగా రాష్ట్ర ఆర్థిక పరిస్థితి దెబ్బతిన్నదని చెబుతూ వచ్చారు. వాస్తవానికి అనేక పన్నులను పెంచడం వలన ఆదాయం పెరిగిందే కాని తగ్గలేదు.

ఈ విధంగా నష్టపరచడమే కాక ఇక ముందు రాష్ట్ర ప్రభుత్వం పి.ఆర్.సి.ని నియమించదని, కేంద్ర పి.ఆర్.సి.కి అనుగుణంగానే వేతన నిర్ణయం జరుగుతుందని ఉత్తర్వులలో పేర్కొన్నారు. అంటే 10 సంవత్సరాల వరకు పి.ఆర్.సి. లేదు. దశాబ్దాల తరబడి పోరాడి సాధించుకున్న సౌలభ్యాలను, హక్కులను హరించటంతో పాటు ప్రభుత్వం అనుసరిస్తున్న అప్రజాస్వామిక వైఖరి పట్ల రాష్ట్రంలోని ఉపాధ్యాయ, ఉద్యోగ, పెన్షనర్లు ఆగ్రహంగా ఉన్నారు. ఉద్యమానికి సన్నద్ధమవుతున్నారు.

*(రచయిత రాష్ట్ర ప్రధానకార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్)*

వీ

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉద్యోగుల పిఆర్‌సి వివాదం

*వేతన సవరణ సంఘం సిఫారసుల విషయంలో పారదర్శకంగా లేకపోవడం, గతంలో ఉద్యోగులు పొందిన స్థాయి ప్రతిఫలాలు కూడా ఇవ్వకపోవడం ప్రస్తుత ఆందోళనకు కారణమంటున్నారు* **చిమ్మె. జాన్ బర్నబాస్**

అటు రాష్ట్ర స్థాయిలోనూ, దేశ స్థాయిలోనూ ఉద్యోగుల జీత భత్యాలను నిర్ణయించే వ్యవస్థ పేవిజన్ కమిషన్ (పిఆర్‌సి). దీని సిఫారసుల ఆధారంగా ఉద్యోగులకు జీతభత్యాలను పెంచడం నిర్ణయించబడుతుంది. ఇది ఆర్థిక సంవత్సరాల ఆధారంగా నిర్ణయించబడుతూ ఉంటుంది. 2019-20, 2020-21, 2021-22 ఈ విధంగా ప్రభుత్వ ఉద్యోగుల జీత భత్యాలను నిర్ణయిస్తారు. అయితే గతంలో కేంద్ర ప్రభుత్వం నియమించిన అశతోష్ మిశ్రా కమిషన్ సిఫారసుల ఆధారంగా ఉద్యోగులకు జీత భత్యాలను చెల్లించడం లేదని ఉద్యోగులు, ఉద్యోగ సంఘాలు ఆరోపిస్తున్నాయి. ఉద్యోగ సంఘాల బలహీనతలనూ, వారి భావ దారిద్ర్యాన్నీ రాష్ట్ర ప్రభుత్వం ఆసరాగా తీసుకొని ఉద్యోగ సంఘాలపై పట్టు సాధించాలని చూస్తోంది. అంతే కాకుండా రాష్ట్ర ప్రభుత్వానికి అనుకూలంగా ఉండే ఉద్యోగ సంఘాలతో అనుకూల ప్రకటనలు చేయిస్తోంది. తద్వారా సమ్మెలోకి లేదా ఉద్యమాలు చేయడానికి ఊతమిస్తున్న ఉద్యోగ సంఘాలను, వారి నాయకులను ఏదో ఒక విధంగా భయభ్రాంతులకు గురిచేసే ప్రయత్నం చేస్తున్నది. గత నెల రోజులుగా ఈ వివాదం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం, ప్రభుత్వ ఉద్యోగ సంఘాల మధ్య చిలికి, చిలికి గాలి వానలాగా తయారై చివరికి 2022 జనవరి 21న రాష్ట్రవ్యాప్త ఆందోళన, సమ్మెకు పిలుపునిచ్చాయి. దీనివలన రాష్ట్రవ్యాప్తంగా ప్రభుత్వ పెద్దల మధ్య, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగుల మధ్య సయోధ్య కుదరక చివరకు ప్రజలు ఇబ్బందులు పడే పరిస్థితి ఉన్నది. అటు ప్రజలకు, ప్రభుత్వానికి వారధులుగా ఉండాల్సిన ఉద్యోగులు రోడ్డు మీద పడడం వలన రాష్ట్ర ప్రభుత్వం సంక్షోభంలోకి నెట్టివేయబడే పరిస్థితి నెలకొన్నది. ఇప్పటికే ఆర్థికంగా చాలా వరకు దివాళా తీసిన పరిస్థితిలో ఉన్న రాష్ట్ర ప్రభుత్వం ఇప్పుడు సామాజిక సంక్షోభంలోకి నెట్టివేయబడిన పరిస్థితి స్వయంగా కొనితెచ్చుకున్నట్లు అయింది. ఈ రాష్ట్ర ప్రభుత్వ వైఖరికి నిరసనగా అన్ని ఉద్యోగ సంఘాలు, అవుట్ సోర్సింగ్ ఉద్యోగులు, ఎపిఎస్ ఆర్‌టిసి ఉద్యోగులు మద్దతు ప్రకటించే అవకాశం స్పష్టంగా కనిపిస్తోంది.

**పిఆర్‌సి చరిత్ర:**

ఆంధ్రప్రదేశ్ ఉద్యోగ సంఘాలు గత ప్రభుత్వంతో సంప్రదించి 2018 మే నెలలో 11వ పే రివిజన్ కమిషన్ వేయించుకున్నారు. 2018 జూలై నుంచి కమిషన్ పని ప్రారంభించినప్పటికీ 2020 అక్టోబర్ 5న నివేదికను రాష్ట్ర ప్రభుత్వానికి సమర్పించింది. అనగా కమిషన్ తన నివేదికను తయారు చేయడానికి 2 సంవత్సరాల 4 నెలల సమయం తీసుకొన్నది. నివేదికను రాష్ట్ర ప్రభుత్వానికి సమర్పించి దాదాపుగా 15 నెలల సమయం అయినప్పటికీ ఇప్పటికీ ప్రభుత్వం దానిని అమలు పరచడం లేదు. దీని ఆంతర్యమేమిటనగా రాష్ట్ర ప్రభుత్వం లోటు బడ్జెట్‌తో నడవడమే ప్రధాన కారణంగా భావించవలసి వస్తుంది.

ప్రతీ దానికి తెలంగాణ ప్రభుత్వంతో ఈ రాష్ట్ర ప్రభుత్వం సారూప్యంగా, పోటీ పడుతున్నది. తెలంగాణ ముఖ్యమంత్రి 30 శాతం ఫిట్‌మెంట్‌తో పిఆర్‌సి అమలు ప్రకటించారు. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి కూడా తాను అనుకున్న విధంగా 23.29 శాతం ఫిట్‌మెంట్ ఉద్యోగులకు ప్రకటించారు. ఆ తర్వాత ఉద్యోగ సంఘాల నేతలు ఏమీ మాట్లాడకుండా అంగీకరింపజేసే ప్రయత్నం చేశారు. తాత్కాలికంగా వారు ఆమోదించారు.

ఉద్యోగ సంఘాల వాదన ప్రకారం గతంతో పోల్చుకుంటే ఫిట్‌మెంట్ భారీగా తగ్గించడంతో పాటు నగదు చెల్లింపు 18 నెలలకే కుదింపు, ఇంటి అద్దె రేట్ల తగ్గింపు, పదేళ్లకొకసారి పిఆర్‌సి, పెన్షన్ ప్రయోజనాల కోత, అదనపు పెన్షన్ కోతతో జగన్‌మోహన్‌రెడ్డి ప్రభుత్వం చేస్తున్న తిరోగమన పిఆర్‌సి గానే దీనిని చూడవచ్చు. దీనివలన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగుల్లో తీవ్ర నిరసన, ఆందోళన వ్యక్తమైంది. పెరిగిన ధరలకు అనుగుణంగా డియర్‌నెస్ అలవెన్స్ (డిఏ) నూరు శాతం ఉండనందువలన పిఆర్‌సి అమలు సమయంలో ఫిట్‌మెంట్ కోసం డిమాండ్ చేస్తారు. పిఆర్‌సి అమలులో ఫిట్‌మెంట్, ఆర్థిక లాభం అమలు చాలా కీలకమైనవి. చరిత్రలో అంతకు ముందు పిఆర్‌సి కంటే ఫిట్‌మెంట్ భారీగా తగ్గించడం ఇది రెండవ సారి.

1998 పిఆర్‌సిలో చంద్రబాబు ప్రభుత్వం నుంచి 25 శాతం ఫిట్‌మెంట్ సాధించుకోగా, ఊహించని పిఆర్‌సి ఇస్తానన్న వై.ఎస్. రాజశేఖర్‌రెడ్డి (ఎన్నికలలో ఓట్ల కోసం) 2003లో ఫిట్‌మెంట్‌ను 16 శాతానికే పరిమితం చేయడం వల్ల పెద్ద నష్టమే జరిగింది. 2013

పిఆర్‌సిలో 43 శాతం ఫిట్‌మెంట్ సాధించుకోగా, జగన్‌మోహన్‌రెడ్డి ప్రభుత్వం 2018 పిఆర్‌సిలో దానిని 23 శాతానికి తగ్గించింది. గత పిఆర్‌సితో సమానంగా 43 శాతం ఫిట్‌మెంట్ అయినా వస్తుందని, కనీసం 30 శాతం అయినా వస్తుందని భావించారు. అందుకు భిన్నంగా ముఖ్యమంత్రి ప్రకటించిన ఐఆర్ (ఇంటరిం రిలీఫ్) 27 శాతాన్ని కూడా తగ్గించి 23.29 శాతంగా మార్చి నిర్ణయించి చేయి దులుపుకున్నారు.

పిఆర్‌సి అమలు సందర్భంగా వాస్తవంగా అమలు కావలసిన తేదీన కాకుండా నోషనల్ కాలాన్ని పెంచేసి ఆర్థిక లాభం కుదిస్తున్నారు. వై.ఎస్. రాజశేఖరరెడ్డి ప్రభుత్వం తొలిసారిగా 2003 పిఆర్‌సిలో 21 నెలల కాలాన్ని నోషనల్‌గా అమలు చేసి ఉద్యోగులకు నష్టం కలిగించింది. 2008 పిఆర్‌సి లోనూ 21 నెలలు నోషనల్‌గా అమలు చేశారు. 2013 పిఆర్‌సిలో చంద్రబాబు నాయుడు ప్రభుత్వాన్ని ఒప్పించి నోషనల్ కాలాన్ని 11 నెలలు తగ్గించుకుంటే మళ్లీ జగన్‌మోహన్‌రెడ్డి ప్రభుత్వం 21 నెలలు నోషనల్‌గా నిర్ణయించడంతో పాటు, నగదు లాభాన్ని 18 నెలలకే పరిమితం చేయడం పెద్ద మోసం. 2020 ఏప్రిల్ నుంచి 2021 డిసెంబర్ వరకూ ఆర్థిక లాభం చెల్లింపుపై ఏమాత్రం స్పష్టత లేదు.

పదవ వేతన సంఘం సిఫారసులను పాటించాలని అధ్యయన కమిటీ సిఫారసు చేసినట్లు తెలిసింది. ఇది అమలు జరిగితే ప్రస్తుతం 12 శాతం, 14.5 శాతం ఉన్న ఎచ్‌ఆర్‌ఎ 8 శాతానికి పడిపోతుంది. విశాఖపట్టణం, విజయవాడ లాంటి నగరాలకు మాత్రమే 24 శాతం ఎచ్‌ఆర్‌ఎ వర్తిస్తుంది. 10వ పిఆర్‌సి ప్రకారం ఇంటి అద్దెను 20 శాతం నుంచి 22 శాతానికి పెంచాలని నిర్ణయించింది.

70 సంవత్సరాలు దాటిన పెన్షనర్లకు అడిషనల్ క్వాంటం ఆఫ్ పెన్షన్ (ఎక్యుపి)ను పిఆర్‌సి సిఫారసు చేయగా ప్రస్తుతం ఉన్న 75 ఏళ్లనే కొనసాగించాలని అధ్యయన కమిటీ సిఫారసు చేసింది. అందువలన అసలు నివేదికలో సానుకూల అంశాలేమిటో, వ్యతిరేక అంశాలు ఏమిటో తెలియడం లేదు. కేబినెట్ కూడా ఏ నివేదికను ఆమోదిస్తుందో కూడా ఉద్యోగులకు అర్థం కావడం లేదు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం 11వ వేతన కమిషన్ నివేదికను గోప్యంగా ఉంచడం వల్లనే ఉద్యోగ సంఘాలలో చాలా అనుమానాలు వస్తున్నాయి, అందుకే ఆందోళన బాట పడుతున్నారు.

రాష్ట్రవ్యాప్తంగా ఉన్న కాంట్రాక్ట్ ఉద్యోగులు 60 వేల మంది. ఔట్‌సోర్సింగ్ ఉద్యోగులు 2 లక్షల 40 వేల మంది. ఫుల్ టైం, పార్ట్ టైం, మినిమమ్ టైం స్కేలు (ఎంటిఎస్), ఉద్యోగులంతా కలిపి దాదాపు 25 వేల మంది ఉన్నారు. రోజువారీ, కన్సాలిడేటెడ్ జీతంతో పనిచేస్తున్న వారికి కూడా 11వ పిఆర్‌సిని వర్తింపచేయాలనే డిమాండ్ వస్తున్నది.

సమాన పనికి సమాన వేతనం అనే రాజ్యాంగ సూత్రాన్ని ప్రభుత్వాలే పాటించడం లేదు. దీనిపట్ల చిన్న ఉద్యోగాలు చేసే వారిలో చాలా ఆందోళన ఉన్నది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రి, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ఉద్యోగ సంఘాలన్నింటితో ప్రత్యక్షంగా చర్చలు జరపాలి. అప్పుడే సమస్య పరిష్కారమవుతుంది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా ప్రారంభించిన గ్రామ సచివాలయ వ్యవస్థలో పనిచేస్తున్న సచివాలయ కార్యదర్శులకూ 2021 అక్టోబర్ 2 నుంచి రెగ్యులర్ స్కేలు ఇస్తామని నియామక ఉత్తర్వులలో ఇచ్చి 11వ పిఆర్‌సిలో 2022 జూలై నెల నుంచి ఇస్తామని చెప్పడం వలన 9 నెలల ప్రయోజనం నష్టపోతామని ఆ ఉద్యోగులు ఆందోళన చెందుతున్నారు.

ఉద్యోగుల పదవీ కాలం 60 సంవత్సరాల నుండి 62 సంవత్సరాలకు పెంచారు. ఇదొక పెద్ద మోసం. ఈ రెండు సంవత్సరాలలో దాదాపు 40 వేల మంది ప్రభుత్వ ఉద్యోగులు పదవీ విరమణ పొందనున్నారు. వారికి దాదాపు పెన్షన్ బెనిఫిట్ దాదాపు 20 వేల కోట్ల రూపాయలు ఇవ్వవలసి వస్తుంది. అందుకై ఆ డబ్బు ఇచ్చే పరిస్థితి లేక వారి పదవీ కాలాన్ని పెంచారు. జగన్‌మోహన్‌రెడ్డి అధికారంలోకి వచ్చి దాదాపుగా 3 సంవత్సరాలు అయిపోతూ ఉంది. ఈ 3 ఏళ్లు ఆర్థిక అరాచకానికి పాల్పడ్డారు. సంక్షేమ పథకాల అమలుకు 'నగదు బదిలీ పథకం' ద్వారా ప్రజలకు డబ్బును పంచడానికి వినియోగించారు. రాష్ట్రం ఆర్థిక సంక్షోభంలోకి నెట్టబడింది.

ఈ పరిపాలనపై కేంద్ర కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ (సిఎజి) నివేదిక కూడా ధృవీకరించింది. ప్రభుత్వం తనకు వచ్చే ఆదాయంపై వాస్తవిక అంచనాలను రూపొందించుకోవడంలోనూ, రెవెన్యూ వ్యయం నియంత్రణలోనూ పూర్తిగా విఫలమైందనీ, అందుకే రెవెన్యూ లోటు విపరీతంగా పెరిగిందనీ కాగ్ తన నివేదికలో పేర్కొంది. రెవెన్యూ లోటు 2018-19లో 12 శాతం, 2019-20లో 23.81 శాతంగా నమోదైంది. 2018-19తో పోలిస్తే ఇది 90.24 శాతం ఎక్కువ. 2019-20 బడ్జెట్ అంచనాల్లో ప్రభుత్వ రెవెన్యూ లోటు రు. 1,779 కోట్లు కాగా, అది ఏకంగా రు. 26,441 కోట్లుగా నమోదైంది. 2022లో నైనా రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని చక్కదిద్దాలనే ఆలోచన రాష్ట్ర ప్రభుత్వానికి కనబడడం లేదు. ప్రభుత్వ సలహాదారులకు, ప్రభుత్వ ప్రకటనలకే వందల కోట్ల రూపాయలను ఖర్చు చేశారు. నిత్యావసరాల ధరలు చుక్కలనంటాయి. హోల్‌సేల్ ప్రైస్ ఇండెక్స్ (ఎచ్‌ఎస్‌పిఐ) 14.5 శాతం ఉంటే, కన్స్యూమర్ ప్రైస్ ఇండెక్స్ 4.5 శాతం ఉంది. ప్రజలలో వివిధ రూపాల పేదరికం 20 శాతం పైననే ఉంది. విభజన సమస్యలు, ప్రత్యేక హోదా డిమాండ్‌ను రాష్ట్ర ప్రభుత్వం గాలికొదిలేసింది. సామాన్య ప్రజల జీవనం మరింత దిగజారింది.

(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యులు)

వీ

# న్యాయం కోసం పోరాడడానికి సిద్ధం: సుధా భరద్వాజ్

*మూడు సంవత్సరాల నిర్బంధం తర్వాత బెయిల్ మీద విడుదలైన న్యాయవాది, మానవహక్కుల కార్యకర్త సుధా భరద్వాజ్ అభిప్రాయాలను వివరిస్తున్నారు* **చిత్రాంగదా చౌధురి**

"నేనీ దేశాన్ని ప్రేమిస్తాను. నేను చత్తీస్‌గఢ్ ప్రజలను ప్రేమిస్తాను. జరిగినదానికి నాకేమీ విచారం లేదు" అన్నారు సుధా భరద్వాజ్ ఆర్టికల్ 14తో మాట్లాడుతూ. భీమా కోరేగాం కుట్రకేసులో ఆమెకు బొంబాయి హైకోర్టు బెయిల్ ఇచ్చిన తర్వాత కొన్ని వారాలకు ఆమె ఆర్టికల్ 14తో మాట్లాడారు.

2018 ఆగస్ట్ 28న అరెస్టయిన సుధా భరద్వాజ్ భీమా కోరేగాం కేసులో నిందితులైన పదహారు మంది మానవహక్కుల కార్యకర్తలలో, రచయితలలో, విద్యావేత్తలలో ఒకరు. వారిమీద భారత శిక్షా స్మృతి 1860 లోని పది సెక్షన్ల కింద, చట్టవ్యతిరేక కార్యకలాపాల నిరోధ చట్టం 1967 కింద నేరారోపణలు చేశారు. ఈ రెండో చట్టం కింద న్యాయ విచారణ ప్రక్రియ ప్రకారం నిందితులు నేరస్తులా, అమాయకులా అనేదానితో సంబంధం లేదు, బెయిల్ దొరకడం చాల కష్టం.

అమెరికన్ పౌరసత్వాన్ని, హైకోర్టు న్యాయమూర్తి నియామక ప్రతిపాదనను వదులుకున్న మానవహక్కుల న్యాయవాది, అధ్యాపకురాలు, ఐఐటి పట్టభద్రురాలు సుధా భరద్వాజ్ ను ఫరీదాబాద్ లో ఆమె ఇంట్లో అరెస్టు చేశారు. అంతకు ఒక ఏడాది ముందే ఆమె ఢిల్లీలోని నేషనల్ లా యూనివర్సిటీలో న్యాయశాస్త్రం బోధించడానికి అధ్యాపకురాలిగా చేరి ఆ ఇంట్లో ఉంటున్నారు. ఆ అరెస్టుకు ముందు, దాదాపు మూడు దశాబ్దాల పాటు ఆమె చత్తీస్ గఢ్ లో కార్మికోద్యమ కార్యకర్తగా పనిచేశారు. పారిశ్రామిక కార్మికులకు, గ్రామీణ అణగారిన వర్గాలకు, ఆదివాసులకు న్యాయ సహాయం అందిస్తూ గడిపారు.

భీమా కోరేగాం కేసులో మొదటి తొమ్మిది మంది అరెస్టులు జరిగినప్పుడు, పోలీసులు సుధా భరద్వాజ్ మీద, మిగిలినవారి మీద ప్రధాని నరేంద్ర మోడీని హత్య చేయడానికి కుట్ర పన్నారనీ, పూణే నగరానికి ఈశాన్యంగా 28 కిమీ దూరంలోని భీమా కోరేగాం పట్టణంలో దళితుల మీద జనవరి 2018లో జరిగిన హింసాకాండకు కారణమైన ఉపన్యాసాలు ఇవ్వడం, ఇ మెయిళ్లు పంపడం, కరపత్రాలు పంచడం వంటి నేరాలు చేశారనీ ఆరోపించారు.

ఆ కేసును మహారాష్ట్ర పోలీసుల చేతుల్లోంచి 2020 జనవరిలో ఏకపక్షంగా తన అధీనంలోకి తీసుకున్న ఎన్ ఐ ఎ చేసిన ఆరోపణలకు అంత తీవ్రమైన స్వభావం ఉన్నప్పటికీ, ఇప్పటికీ విచారణ మొదలు కానే లేదు.

జైలులో క్షీణిస్తున్న ఆరోగ్య పరిస్థితి వల్ల, 2021లో ఆరోగ్య కారణాల మీద బెయిల్ దొరికి విడుదలైన 83 సంవత్సరాల కవి, అధ్యాపకుడు, మావోయిస్టు సిద్ధాంతకర్త వరవరరావు తర్వాత ఈకేసులో బెయిల్ మీద విడుదలైన వ్యక్తి సుధా భరద్వాజ్ ఒక్కరే. మిగిలిన నిందితులలో అత్యధికులు ఇప్పటికే మూడు సంవత్సరాల కన్న ఎక్కువ కాలం జైలులో గడిపారు. ఎనభై నాలుగు సంవత్సరాల జెసూయిట్ మతాచార్యుడు, సామాజికశాస్త్రవేత్త ఫాదర్ స్టాన్ స్వామి కొవిడ్-19 బారిన పడి, 2021 జూలైలో విచారణలో ఉన్న ఖైదీగానే మరణించారు.

బెయిల్‌కు షరతులు విధించిన ఎన్ ఐ ఎ స్పెషల్ కోర్టు సుధా భరద్వాజ్ తన మీద ఉన్న కేసు గురించి ప్రచార మాధ్యమాలతో మాట్లాడగూడదని ఆంక్షలు విధించింది. తాను తిరిగి న్యాయవాద వృత్తిని కొనసాగించడానికి చత్తీస్ గఢ్ వెళ్లడానికి అనుమతించాలని ఆమె చేసిన విజ్ఞప్తిని కూడ ఆ కోర్టు తిరస్కరించింది. ముంబాయి, థానే దాటి పోవడానికి వీలు లేదని ఆంక్షలు విధించింది.

ప్రస్తుతం తానున్న "ఖరీదైన నగరం" (ముంబాయి) లో న్యాయవాద వృత్తిని కొత్తగా ప్రారంభించడం గురించి ఆలోచిస్తున్న సుధా భరద్వాజ్, తనను పోలీసులు వెన్నాడడం లేదని నిర్ధారించుకోవడానికి ఇంకా వెనక్కి చూస్తూనే ఉన్నానని అన్నారు.

కొత్త స్నేహితులకు న్యాయసహాయం అందించడమే జైలు జీవితంలో తనను నిలబెట్టిందంటూ, పేదరికంలో మగ్గుతున్న, సాధారణంగా నిరక్షరాస్యులైన, సమాజం చేతా, న్యాయ వ్యవస్థ చేతా విస్మరణకు గురవుతున్న మహిళా ఖైదీలే తన కొత్త స్నేహితులని ఆమె అన్నారు.

"చాల మంది కంటె తాను మెరుగ్గా ఉన్నానని గుర్తించే ఎవరైనా తన మీద తాను సానుభూతి పడడం కష్టం" అన్నారామె.

**ఆమెతో ముఖాముఖీ నుంచి భాగాలు:**

ప్ర: మూడు సంవత్సరాల తర్వాత బెయిల్ మీద బైటికి రావడం ఎలా ఉంది? ఆ బైటికి వచ్చిన రోజు గురించీ, సమయం గురించీ పాఠకులతో ఏమైనా పంచుకుంటారా?

జ: సరే, డిసెంబర్ 1న హైకోర్టు ఆదేశాలు వచ్చాయి. ఆ తీర్పు కూడ చాల కాలంగా రిజర్వ్ లో ఉంది. కనుక ఆరోజు, నిజం చెప్పాలంటే, మేం మామూలుగానే కోర్టుకు వెళ్లాం (తీసుకుపోబడ్డాం). ప్రతి ఒక్కరూ వచ్చి అభినందనలు తెలుపుతుంటే నాకు ఆశ్చర్యం వేసింది. నాకప్పటికి తెలియదు. నా సహ నిందితులకు బెయిల్ రాలేదంటే మాత్రం నాకు విచారం కలిగింది. ఆ తర్వాత, డిసెంబర్ 8న నన్ను మళ్లీ ఎన్ఐఎ కోర్టులో హాజరు పరిచారు. ఆరోజు షరతుల నిర్ణయం జరగవలసి

ఉండింది. మా అదృష్టం కొద్దీ, డబ్బు రూపంలో ధరావత్తు కట్టడానికి జడ్జి అంగీకరించారు. మామూలు ఆస్తి ధరావత్తు ప్రక్రియ కోసం పట్టుబట్టి ఉంటే, అది ఇంకా ఎక్కువ సమయం తీసుకునేది. అప్పటికి డబ్బు కట్టి, మూడు నెలల లోపల సాధారణ ధరావత్తు ప్రక్రియ పూర్తి చేయడానికి అనుమతించారు.

అలా, వాస్తవానికి నేను కోర్టు నుంచి వెనక్కి వచ్చాక, నాకు బెయిల్ వచ్చిందని, మర్నాడు డిసెంబర్ 9న నేను విడుదల అవబోతున్నానని జైలులో ప్రతి ఒక్కరికీ తెలిసింది. ఈ మధ్య కాలంలో బైకుల్లా జైలులో నాకు ఎంతో మంది స్నేహితులయ్యారు. ప్రత్యేకంగా లాక్ డౌన్ అమలైన ఈ రెండు సంవత్సరాల కాలంలో నేను వారితో పాటు జీవించే, వారిలో ఒకరైన న్యాయవాదిగా మారిపోయాను. అందువల్ల చాలమంది సహ ఖైదీలు నా దగ్గరికి రావడం, విడుదలవుతున్నందుకు అభినందించడం జరిగాయి. వాళ్లు నాచేత పాటలు పాడించారు, నాట్యమాడించారు. నాకోసం వాళ్లు పాడారు, ఆడారు.

అలాగే నాకు చాల పనులు పెట్టారు, విజ్ఞప్తులు చేశారు. "ఆంటీ, మేరీ యే వకీల్ కో బోల్ దేనా (ఆంటీ, మా వకీల్ కు ఇది చెప్పాలి), "ఆంటీ, నా చార్జిషీట్ కు ఏమైందో తెలుసుకుంటారా?", "నా కేసు ఏమయిందో కనుక్కుంటారా?", "ఫలానా వాళ్లకు ఫోన్ చేసి ఈ కబురు చెపుతారా"... అలా ఎన్నెన్నో. నేను విడుదల కావడానికి ముందు రోజు రాత్రి దృశ్యం అది. నిజంగా అది ఒక ప్రేమమయమైన, ఆప్యాయమైన వీడ్కోలు.

ఇక మర్నాడు ఉదయం, నా వస్తువులను, నన్ను తనిఖీ చేశాక, విడుదల తతంగం కోసం ఎదురుచూస్తూ నేనక్కడ కూచున్నప్పుడు, హఠాత్తుగా ఒక జైలు అధికారి నా దగ్గరికి వచ్చి, "మీరు చాల పేరుమోసిన వ్యక్తా?" అని అడిగాడు. "కాదే, ఏమో నాకు తెలియదు" అని నేను నవ్వాను. "ఉహు, బైట చాల మంది పత్రికల వాళ్లు, చానళ్ల వాళ్లు ఉన్నారు. అందువల్ల మిమ్మల్ని వెనుక గేటు నుంచి పంపిద్దామా అనుకుంటున్నాం" అన్నాడాయన. "ఎంతమాత్రం కుదరదు. నేను ప్రధాన ద్వారం నుంచి వచ్చాను. ఆ ద్వారం నుంచే బైటికి వెళ్తాను" అన్నాను.

అవును, నేను బైటికి రావడానికి యుగాలు పట్టినట్టనిపించింది. బైటికి అడుగు పెట్టేసరికి నా మిత్రులున్నారు. నా కూతురు కూడ ఉంది. ఇటీవలనే విడుదలై బైటికి వెళ్లిన ఇద్దరు పాత ఖైదీలు కూడ నేను విడుదలవుతున్నానని విని నన్ను కలవడానికి వచ్చారు.

నా కూతురిని, నా మిత్రులను చూడడం, నా న్యాయవాదులను కలుసుకోవడం దానికదే ఒక ఉత్సవం. ఆ రాత్రి భోజనంగా దక్షిణ భారతపు పెరుగన్నం తినడం చాల బాగుండింది.

ప్ర: ఈ మూడు సంవత్సరాల నిర్బంధంలో మిమ్మల్ని నిలబెట్టిందేమిటి?

జ: జైలుకు వెళ్లిన తర్వాత నేనెంత అదృష్టవంతురాలినో నాకు తెలిసివచ్చింది. నాకు బైట స్నేహితులున్నారు. నా కూతురుంది. మంచి న్యాయవాదులున్నారు. నా కోసం తపన పడేవాళ్లు బైట ఉన్నారని నాకు తెలుసు. విజయం సాధించ లేకపోయినా వాళ్ల ప్రయత్నాలు వాళ్లు చేస్తున్నారని నాకు తెలుసు. కాని జైలు లోపల నేను అనేకమంది అభాగ్యులను చూశాను. వాళ్లకు కనిపెట్టుకుని ఉన్న కుటుంబాలు లేవు. వాళ్లకోసం వాదించే న్యాయవాదులు లేరు. వాళ్ల చేతిలో డబ్బు లేదు. వాళ్లకు తమ పిల్లలు ఎట్లా బతుకుతున్నారో తెలియదు. వాళ్లకు తమ కుటుంబాలతో సంబంధం పూర్తిగా తెగిపోయింది. అంటే అక్కడ నా చుట్టూ ఒక దుఃఖ సముద్రం ఉండింది. అటువంటి పరిస్థితుల్లో, ఎవరికి వీలైతే వారికి, ఎంత మందికి వీలైతే అంతమందికి సహాయం చేయడం అనే ఆలోచన ఒక్కదాని మీదనే కేంద్రీకరించక తప్పదు. అదే నన్ను క్షణం తీరిక లేకుండా ఉంచింది. నా గురించి నేను బాధ పడడానికి అతి తక్కువ సమయం మిగిలేది. "ఈ ఖైదీలలో అత్యధికుల కన్న నేను ఎంత ఎక్కువ అదృష్టవంతురాలిని" అనే ఆలోచనే ఉండేది.

ప్ర: బైటికి వచ్చాక ఈ నెల ఎట్లా గడిచింది?

జ: ఒక కొత్త నగరంలో జీవితాన్ని కొత్తగా కనుక్కోవడం లాంటి సమస్య ఇది. అది అంత సులభం కాదని మీకు తెలుసు. దాన్ని ఎట్లా సాధించాలా అని నేనింకా ప్రయాసపడుతున్నాను. నాకు పెంచి పెద్ద చేయవలసిన, సహాయం అవసరమైన కూతురు ఉంది. ఈ కేసు అనే మచ్చ కొనసాగుతూనే ఉంది. నావరకు నాకు చత్తీస్ గడ్ కు వెళ్లడానికి అనుమతి దొరకకపోవడమనేది సొంత దేశంలో ప్రవాసం గడుపుతున్నదానితో సమానం. చత్తీస్ గడ్ లోనే నా పని ఉంది, నా స్నేహితులున్నారు. అక్కడే నా కూతురు చదువుకుంటున్నది. నేను పనిచేసిన కార్మిక సంఘం అక్కడే ఉంది. అక్కడ నా న్యాయవాద మిత్రులు నాతో సంబంధంలో ఉన్నారా అని ఇప్పటికీ పోలీసులు ప్రశ్నిస్తూ ఉన్నారట. అటువంటి నిఘా దురదృష్టకరం.

జైలులో వ్యక్తిగత గౌరవం భంగమవుతుంది. ఏకాంతం దొరకదు. వాటి నుంచి బైటపడడానికి కాస్త సమయం పడుతుంది. ఇప్పటికీ నేను నడుస్తున్నప్పుడు, నా భుజాల మీంచి వెనక్కి చూస్తాను. యూనిఫాం వేసుకున్న వ్యక్తులు నన్ను వెన్నంటో, నాకు అటూ ఇటూనో వస్తున్నారా అని చూస్తాను. నేనొక్కదాన్నే నడుస్తున్నానా అని అనుమానిస్తాను (నవ్వు). కాని ఇప్పుడు నా ఇష్టం వచ్చినప్పుడు లేవవచ్చు. "ఆంటీ జల్దీ కరో" అని బైటి నుంచి ఎవరో ఒకరు అరుస్తారనే ఆలోచన లేకుండా బాత్ రూం కు వెళ్లవచ్చు. భోజనం కోసం లైన్ లో నిలబడకుండా నా అంతట నేను తెచ్చుకోవచ్చు. ఇటువంటి చిన్న చిన్న సంగతులు కూడ అనుభవించవలసినవే.

ఇప్పటికి మూడుసార్లు కోర్టుకు వెళ్లాను. పదిహేను రోజులకొకసారి పోలీస్ స్టేషన్ కు నేనున్నానని తెలియ జేస్తున్నాను. మామూలు ధరావత్తు సంపాదించడానికి ప్రయత్నాలు కూడ చేస్తున్నాను. ముంబాయిలో అది చాల క్లిష్టమైన వ్యవహారం. ఎందుకంటే ధరావత్తుగా నిలిచే వ్యక్తికి ఆస్తి ఉండాలి, రేషన్ కార్డ్ ఉండాలి. ముంబాయిలో అది ఒక రకమైన పరిహాసం. ఇక్కడ రేషన్ కార్డులున్నవారు దొరుకుతారు గాని ఆస్తి ఉన్నవారు దొరకరు. లేదా ఆస్తి ఉన్నవారికి రేషన్ కార్డ్ ఉండదు. సరే, చాల మంది మిత్రుల నుంచీ, శ్రేయోభిలాషుల నుంచీ, విద్యార్థుల నుంచీ ఫోన్ లు వస్తున్నాయి. మాట్లాడుతున్నాను. ఈసారి నాకు అందుతున్న సహాయం, సంఘీభావం ఎంతగా ఉందంటే తలమునకలవుతున్నాను.

ప్ర: ఇప్పుడు ఏం చేయాలనుకుంటున్నారు?

జ: ఇప్పుడే న్యాయవాదిగా ఒక కొత్త ఐడెంటిటీ కార్డ్ సంపాదించాను. నల్ల కోటు కూడ సంపాదించాను. ఇక మళ్లీ న్యాయవాదిని కావాలి. కొన్ని కార్మిక సంఘాలను సంప్రదిస్తున్నాను. పూర్తిస్థాయి న్యాయవాద వృత్తిలో దిగాలంటే చాల సరంజామా కావాలి. కాని మొదట కార్మిక సంఘాల కేసులు కొన్ని చేయాలని ఉంది. అలాగే న్యాయవాదులను పెట్టుకోవడానికి శక్తి లేని నా సహ ఖైదీ మిత్రుల కేసులు చేయాలని ఉంది. వారికి ప్రభుత్వం అందించే న్యాయసహాయం అస్తవ్యస్తంగా ఉంది. అయితే ఈ రెండో పనిలో నాకు భుక్తి ఏమీ దొరకదు. కాని నేను చేయగలిగిన సహాయం తప్పనిసరిగా చేయాలని ఉంది. నేను జైలులో కలిసినవారిలో చాల మంది ఏళ్ల తరబడి ఉన్నారు. వారికి న్యాయస్థానాలలో సరైన ప్రాతినిధ్యమే దొరకలేదు. వారికి ఏదో ఒకరకంగా సహాయం చేయ దలచుకున్నాను.

ప్ర: మళ్లీ అధ్యాపక వృత్తిలోకి వెళ్లగలరా?

జ: అనుమానమే. విశాల హృదయం, సాహసం కూడ ఉన్న వైస్ చాన్సలర్ ఎవరైనా ఉంటే నన్ను మళ్లీ యూనివర్సిటీలో బోధించడానికి పిలవవచ్చు. ఆ పని చేయడం నాకు చాల సంతోషం. కాని అదే సమయంలో నాకు సహాయం చేసి, వారు ఇబ్బందులు ఎదుర్కోవడం కూడ నాకు ఇష్టం లేదు. ఎందుకంటే, ఇప్పటికీ నేను నిరపరాధినని రుజువు చేసుకోవలసే ఉంది. నేనిప్పుడు బెయిల్ మీద మాత్రమే బైట ఉన్నాను. నా మీద కేసు కొట్టేస్తారని, నన్ను నిర్దోషిగా విడుదల చేస్తారని నాకు గట్టి నమ్మకమే. కాని దానికి చాల కాలం పడుతుంది. ఆ సమయానికి నేను బోధనా వృత్తి చేపట్టగల స్థితిలో ఉంటానో లేదో, గతంలో లాగ బోధనా అవకాశాన్ని వాడుకోగలనో లేదో తెలియదు. ఇదివరకు నా బోధనా అనుభవంలో నాకు చాల సంతోషం కలిగింది. అది ఒక గొప్ప ఆనందం. నాకు అద్భుతమైన విద్యార్థులెందరో ఉన్నారు. వారిలో కొందరైనా నా లాగ సంప్రదాయేతరమైన మార్గాలు ఎంచుకుంటారని నా ఆశ.

ప్ర: మీకూ, మీ సహ ఖైదీలకూ జైలు పరిస్థితులు ఎలా ఉండేవి?

జ: యరవాడలో నా సహ నిందితురాలు షోమా సేన్, ఇద్దరు యావజ్జీవ ఖైదీలతో పాటు నన్ను అత్యధిక భద్రత ఉండే ఫాసీ యార్డ్ లో ఒక సెల్ లో పెట్టారు. అదంతా మొత్తం ఆవరణ మధ్యలో ఒక బోను లాగుండేది. అంటే మేం ఆ ఊచల మధ్య నుంచి చూడగలిగేవాళ్లం గాని ఎవరితోనూ మాట్లాడడానికి లేదు. అక్కడ, తోటి ఖైదీలకు న్యాయ సహాయం చేయడానికి నన్ను అనుమతించమని జైలు అధికారులకు ఒక విజ్ఞప్తి ఇచ్చాను. కాని నా దరఖాస్తును వారు తిరస్కరించారు. బైకుల్లా జైలు ప్రధానంగా విచారణలో ఉన్న ఖైదీల కోసం మాత్రమే. అక్కడ మమ్మల్ని బారక్ లలో ఉంచారు. ఇక్కడ మనుషులు కిక్కిరిసి ఉండడం, తద్వారా వచ్చే సమస్యలు ఉండేవి గాని, తోటి ఖైదీలతో ఎక్కువ సంబంధానికి అవకాశం ఉండేది. అలా మాకు చాల మంది స్నేహితులయ్యారు.

ఇక్కడిక, నన్ను న్యాయసహాయానికి అనుమతించమని కోరుతూ దరఖాస్తు ఇవ్వవలసిన అవసరమే లేకపోయింది. న్యాయసహాయం కోరుతూ తోటి ఖైదీలు నా చుట్టూ ఎప్పుడూ గుమికూడుతుండేవారు. ఖైదీల కోసం ఉదయం నుంచి రాత్రి దాకా దరఖాస్తులు రాసి పెడుతుండడమే సరిపోయేది. మరీ ముఖ్యంగా లాక్ డౌన్ సమయంలో. అది నిజంగా దారుణమైన పరిస్థితి. లాక్ డౌన్ లో ఏ సంబంధమూ లేకుండా నిర్బంధంలో ఉండడం అంటే రెండు సంవత్సరాల పాటు విచారణలన్నిటి మీద తాత్కాలిక అవరోధపు మీట నొక్కి పెట్టినట్టు.

ములాఖాత్ లు లేవు. కోర్టు నడవడం లేదు. తమ కేసుకు ఏమవుతున్నదో ఖైదీలకు తెలియదు. ఇక జైళ్లలో ఉన్నవారిలో ఆశ్చర్యకరమైనంత ఎక్కువ మంది నిరక్షరాస్యులు. సరే, అక్షరాస్యులైనప్పటికీ ఈ న్యాయశాస్త్ర పరిభాష తెలిసినవారు కారు.

అలా, దాదాపు 350 మంది ఉన్న ఆ జైలులో నేను కనీసం వంద దరఖాస్తులు రాసిపెట్టి ఉంటాను. అంతే కాదు, ప్రతి దరఖాస్తుకూ రెండు ప్రతులో, మూడు ప్రతులో రాయాలి. ఆ దరఖాస్తులలో చాల భాగం తమ మీద ఆరోపణల చార్జిషీట్ కాపీ తమకు ఇవ్వాలని అడిగేంత సాధారణమైనవే. ఆ ఖైదీలకు వారి చార్జిషీట్ ను 90 రోజుల లోపు ఇవ్వలేదు గనుక వారిలో అత్యధికులు డిఫాల్ట్ బెయిల్ పొందడానికి, విడుదల కావడానికి అర్హులే. అలాగే కరోనా సమయంలో మధ్యంతర బెయిల్ ఇవ్వాలని ఎన్నెన్నో దరఖాస్తులు రాశాను. 75 ఏళ్లు పైబడిన వృద్ధ ఖైదీలకు, ఎచ్ ఐ వి, టిబి, ఆస్మా, ఇతర కోమార్బిడిటీ జబ్బులు ఉన్నవారికి, అనారోగ్యంగా ఉన్నవారికి బెయిల్ ఇమ్మని దరఖాస్తులు రాశాను. కాని వారెవరికీ బెయిళ్లు రాలేదు.

నేను చూసిన మరొక సంగతి, మహిళా ఖైదీలు చాల మందిని వారి కుటుంబాలు వదిలేశాయి. కనీసం పురుష ఖైదీల విషయంలో, బైట వారి భార్యలు, లేదా తల్లులు వారికోసం ఎదురుచూస్తూ ఉంటారు. కాని మహిళా ఖైదీలను మాత్రం వారి పురుషులు వదిలేస్తారు.

జైళ్లు కిక్కిరిసి ఉన్న సమస్యను, జైళ్ల మీద ఒత్తిడి తగ్గించవలసిన సమస్యను కోర్టులు తీవ్రంగా పట్టించుకోవాలి. బెయిల్ విషయంలో ఉదారంగా ఉండడం చాల చాల ముఖ్యం. అలాగే ఎవరినైనా ఎక్కువకాలం జైలులో ఉంచడం అంటే ఏమిటో అర్థం చేసుకోవడం అవసరం. ప్రత్యేకించి ప్రస్తుతం ఉన్న పాండెమిక్ సమయంలో జైళ్లలో వ్యక్తిగత దూరం పాటించడం అసాధ్యం. నా ఆరోగ్యం సరిగా లేని ఒక నెలన్నర సమయంలో, మమ్మల్ని చాల మందిని ఒక క్వారంటైన్ బారక్ లో కుక్కారు. దానితో మరింత గందరగోళం జరిగింది. కనుక ఆరోగ్య పరిస్థితులు, వయసు, కోమార్బిడిటీలు దృష్టిలో పెట్టుకుని కోర్టులు ఆరోగ్య కారణాల మీద మరింత ఉదారంగా బెయిల్ ఇవ్వడం చాల ముఖ్యం. “ఈ వ్యక్తిని జైలులో ఉంచడం నిజంగా అవసరమా?” అని జడ్జిలు తమను తాము ప్రశ్నించుకోవాలి.

ఇక జైలు అధికారుల విషయానికొస్తే, వారు ఖైదీలను మనుషులుగా చూడాలి. లెక్క పెట్టుకోవడం, మందగా జమ చేయడం, మనుషులను మూసి పెట్టడం కాకుండా, వారిని క్రియాశీలంగా, పనుల్లో పడేలా చేయడం ఎలాగో ఆలోచించాలి. వారు తమ జీవితాలను మళ్లీ ప్రారంభించడానికి అవకాశం ఇవ్వాలి. ఇది ఒక సందర్భంలో నేను కళ్లారా చూశాను. భీమా కోరేగాం కేసులో నా సహ నిందితురాలు జ్యోతి జగతాప్ ఖైదీలకు పాఠాలు చెప్పడం మొదలు పెట్టినప్పుడు, ఖైదీలు ఆసక్తి చూపారు, ఉత్సాహంగా పాల్గొన్నారు. వాళ్లు ఇంగ్లిష్,

మరాఠీ, హిందీ, లెక్కలు నేర్చుకోదలిచారు. అలాగే ఖైదీల్లో కుటుంబాల విస్మరణకు గురైనవారికి, చిన్నారి పిల్లలు ఉన్నవారికి, వేశ్యాగృహాలకు అమ్మబడినవారికి, మాదకద్రవ్యాలకు అలవాటు పడినవారికి ఆరోగ్య చికిత్స అందించడం కూడ అవసరం.

ప్ర: చత్తీస్ గడ్ లో ముందువరుసలో నిలబడిన న్యాయవాదిగా మన నేర విచారణా వ్యవస్థ వైఫల్యాలను మీరు స్వయంగా చూశారు. న్యాయ నిర్ణయాలను డబ్బు, అధికారం ఎట్లా ప్రభావితం చేస్తాయో, విచారణలో ఉన్న ఖైదీలుగా మనుషులు ఎంత సుదీర్ఘకాలం జైళ్లలో మగ్గిపోతారో, సాధారణ ప్రజలు న్యాయం పొందడానికి ఎటువంటి పోరాటం చేయవలసి వస్తుందో చూశారు. ఇప్పుడు మీరే కటకటాల వెనక్కి వెళ్లారు. మీ అవగాహనల్లో ఏమైనా మార్పులు వచ్చాయా?

జ: న్యాయవాదిగా ఇటువైపున్నప్పుడు నేను దుఃఖాన్ని చూస్తుండేదాన్ని. నేను ఏమి చేయవలసి ఉన్నదో నాకు ఎప్పుడూ తెలుస్తుండేది. ఏమి చేయడం సాధ్యమో ఆలోచిస్తుండేదాన్ని. కాని నేను అటువైపు, కటకటాల వెనక్కి వెళ్లినప్పుడు, బైటిలోకం క్రియాశీలంగా లేకపోతే, ఖైదీకి మిగిలేది ఏమీ ఉండదని తెలిసింది. ఒకవేళ మీ న్యాయవాది తగినంత శ్రద్ధ చూపకపోతే, మీ న్యాయస్థానం తగినంత శ్రద్ధ చూపకపోతే, లేదా, మీరు దరఖాస్తు మీద దరఖాస్తు రాసినప్పటికీ, జైలు అధికారులు వాటిని అసలు బైటికే పంపకపోతే, మీకిక దిక్కు లేదు. ఖైదీకీ న్యాయవాదికీ మధ్య, ఖైదీకీ న్యాయస్థానానికీ మధ్య అఖాతం ఏర్పడే ఈ సందర్భం అత్యంత దుర్భరమైనది. ఏడాది వయసున్న తన కొడుకును తన దగ్గరికి పంపించాలని ఖైదీగా ఉండిన ఒక తల్లి కోసం నేనొక దరఖాస్తు రాశాను. ఆ చిన్నారిని ఎవరో పొరుగింటివారి దగ్గరో, మరెవరి దగ్గరో వదిలేసి ఆమెను జైలుకు తెచ్చారు. నేను రాసిన దరఖాస్తు సఫలం కావడానికి ఎనిమిది తొమ్మిది నెలలు పట్టింది. ఈలోగా తల్లి పరిస్థితి, కొడుకు పరిస్థితి ఎంత ఘోరమో చెప్పనక్కరలేదు. ఒక్క క్షణం సమయానికి స్పందించనందువల్ల కొడుకు దాదాపుగా అనాథ అయిపోయాడు. న్యాయవాదులు మరింత క్రియాశీలంగా ఉండాలి. న్యాయస్థానాలు మరింత క్రియాశీలంగా ఉండాలి. మరింత సమర్థంగా, మరింత మానవీయంగా ఉండాలి.

మూడు సంవత్సరాలు జైలులో ఉన్నతర్వాత నాకు అర్థమైనదేమంటే ప్రభుత్వం అందించే న్యాయసహాయం అత్యంత దారుణమైన దుస్థితిలో ఉన్నదని. చాల మంది ఖైదీలకు ఆ న్యాయసహాయ మార్గంలోకి వెళ్లడమంటే తిరిగిరాలేని చీకటి గుయ్యారం లోకి వెళ్లడమే. చాలమంది ఖైదీలకు తమకు ఏర్పాటు చేసిన న్యాయసహాయపు న్యాయవాది పేరేమిటో తెలియదు. వారి ఫోన్ నంబర్ గాని, చిరునామా గాని తెలియదు. ఆ న్యాయవాది కనీసం ఒక్కసారి అయినా వారి ములాఖాత్ కు వచ్చి ఉండరు. చార్జిషీట్ లో ఏమి ఉన్నదో, కోర్టులో ఏమి జరుగుతున్నదో, ఖైదీకి వ్యతిరేకంగా ఏ సాక్ష్యాధారాలు చూపుతున్నారో ఆ న్యాయవాది ఖైదీకి చెప్పరు. ఆ సాక్ష్యాధారాలలో వేటిని అవతలి పక్షం వక్రీకరించిందో, తొక్కిపట్టిందో చెప్పే అవకాశం కూడ ఖైదీకి రాదు. న్యాయవాది తన కక్షిదారుకు మాత్రమే జవాబుదారీగా ఉండాలనీ, న్యాయ సహాయ సంస్థకు జవాబుదారీగా కాదు అనే మౌలిక అవగాహనే భగ్నమైపోతున్నది.

అయితే నేను కూడ బైట ఉన్నప్పుడు న్యాయ సహాయ వ్యవస్థతో పనిచేశాను గనుక ఆ న్యాయవాదుల సమస్యలు కూడ నాకు తెలుసు. న్యాయసహాయ న్యాయవాదుల ప్రతిఫలం చాలా తక్కువ. ఉదాహరణకు ఒక సెషన్స్ కోర్టు విచారణలో న్యాయసహాయ న్యాయవాదికి చాలా తక్కువగా రు. 3000 ఇస్తారు. లాక్ డౌన్ సమయంలో న్యాయవాదులు లోకల్ ట్రెయిన్లలో వెళ్లడానికి కూడా వీలు లేకపోయింది. ప్రజా రవాణా వ్యవస్థ రద్దయిపోయింది. న్యాయవాది తన ఖైదీని కలవాలంటే బైకుల్లా జైలుకు టాక్సీ తీసుకుని రావలసి వచ్చేది. కనుక న్యాయవాదులు ఎందుకు రాలేదో నేను అర్థం చేసుకోగలను. కాని మనం ఈ యంత్రాంగాన్ని సంస్కరించవలసి ఉంది. లేకపోతే న్యాయ సహాయం అనేది ఒక ప్రహసనం అయిపోతుంది. ఏ హైకోర్టుకైనా వెళ్లి చూడండి. అటార్నీ జనరల్ ఆఫీస్ అనే బ్రహ్మాండమైన భవనం ఉంటుంది. దానిలోపల ఒక అటార్నీ జనరల్, డిప్యూటీ అటార్నీ జనరల్, లెక్కలేనంతమంది భారీ జీతాలు పొందే మనుషులు, అందరూ ప్రభుత్వాన్ని, రాజ్యాన్ని సమర్థించడానికి, పరిరక్షించడానికి ఉంటారు. మరి, న్యాయ సహాయ కేంద్రం ఎక్కడుంటుంది? ఎప్పుడైనా చూశారా? న్యాయసహాయం అవసరమైన సాధారణ ప్రజలను పరిరక్షించడానికి కూడా అటువంటి వ్యవస్థ అవసరం లేదా? ఎందుకు అవసరం లేదు? న్యాయ సహాయ న్యాయవాదులకు కూడా మంచి ప్రతిఫలం ఎందుకు ఉండగూడదు? న్యాయ సహాయానికి గనుక మనకు ఒక సర్వ సమర్థమైన యంత్రాంగం ఉంటే, తప్పనిసరిగా అది ప్రజా పక్ష న్యాయవాదులను కూడా ఆకర్షిస్తుంది.

ప్ర: కాంట్రాక్టు కార్మికులు, గ్రామస్తులు వంటి మీ ఛత్తీస్ గడ్ కక్షిదారులు చాలామంది ఎన్నో ఏళ్లపాటు మీరు వారి పక్కన ఎలా నిలిచారో పత్రికలవారికి చెప్పారు. వారి పట్ల మీ నిబద్ధతకు పురికొల్పినదేది?

ప్ర: నా మీద అతి గొప్ప ప్రభావాల్లో ఒకటి అత్యంత దూరదృష్టి గల కార్మిక నాయకుడు శంకర్ గుహ నియోగిజీది. మౌలికంగా కార్మికరంగంలో పని చేయాలనే ఆలోచన నాకు 1982లో ఆసియాడ్ క్రీడల సమయంలో కలిగింది. అప్పుడు ఆ క్రీడల కోసం నిర్మాణ పనులు చేయడానికి వలస కార్మికులు ఢిల్లీకి వరదలా వచ్చారు. వారు ఆసియాడ్ గేమ్స్ కోసం ఫ్లైఓవర్లు, స్టేడియంలు, ఫైవ్ స్టార్ హోటళ్లు నిర్మించారు. ఆ ఆడంబర మహా భవనాల అట్టడుగున దాగినది ఆ కార్మికులు. వారు ఒరిస్సా నుంచీ, ఛత్తీస్ గడ్ నుంచీ, బీహార్ నుంచీ వచ్చిన నిరుపేదలు. అప్పుడు ఢిల్లీలో పెద్ద పెద్ద కార్మిక క్యాంపులు ఉండేవి. కొన్నిసార్లు ఆ క్యాంపుల చుట్టూ ముళ్లకంచెలుండేవి. ఆ కార్మికులందరూ ముఠా మేస్త్రీలు తోలుకొస్తే వచ్చినవారు. మేం కొందరు విద్యార్థులం ఆ క్యాంపులకు వెళ్లి అక్కడ పిల్లలకు పాఠాలు చెపుతుండేవాళ్లం. ఎ ఐ ఎం ఎస్ ఎస్ నుంచి కొందరు డాక్టర్లు వచ్చి ఆ కార్మికులకు అవసరమైన వైద్యసహాయం చేస్తుండేవాళ్లు. నాకు గుర్తుండిపోయిన ఒక సంఘటన చెపుతాను. మాతోపాటు ఒక ఒరియా మిత్రుడుండేవాడు. ఒక ఒరియా కార్మికుల బృందం దగ్గరికి వెళ్లినప్పుడు మా మిత్రుడు వారితో ఒరియాలో మాట్లాడాడు. "మాకు బాగా ఇంటికి పోబుద్ధవుతున్నది. కాని మా ఠేకేదార్ మమ్మల్ని వెళ్లనివ్వడం లేదు.

ఇప్పటిదాకా మా జీతాలు కూడా ఇవ్వలేదు. మాకు దిక్కు తోచడం లేదు" అని ఒకతను చెప్పాడు. మేం మరోసారి వెళ్లేసరికి ఆ కార్మికుడు లేడు. అతను లేడని గుర్తించడం నాకొక ఆఘాతం. మేం చాలా మామూలుగా ఒక ప్రశ్న వేశాం గాని, అది బాధ్యతారాహిత్యం. ఆ ప్రశ్నకు అతను ఇచ్చిన జవాబు అతని జీవితాన్ని పోగొట్టి ఉండవచ్చు. కాంట్రాక్టర్ అతణ్ని కొట్టి చంపేసి ఉంటాడా? అతను ఎక్కడున్నాడు? అతనికేమయింది? ఈ యుద్ధం చాల కష్టతరమైనదనీ, సుదీర్ఘమైనదనీ వాస్తవం నాకు అర్థమయింది. ఈ యుద్ధంలో కార్మికులతో కొనసాగడం మా బాధ్యత అని తెలిసి వచ్చింది.

అది ప్రారంభం. తర్వాత 1980ల్లో చత్తీస్ గడ్ వెళ్ళడం, నియోగిజీని కలవడం, దానితో నేను కార్మిక సంఘ కార్యక్రమాల్లో పూర్తిగా మమేకమయ్యాను. నలభై ఏళ్ల నిండు వయసులో నన్ను నా సంఘమే న్యాయవాదిగా మార్చింది. కార్మికులు తమలో ఒకరైన న్యాయవాది కావాలనుకున్నారు. తాము పూర్తిగా నమ్మకం పెట్టగలిగిన, తాము స్వేచ్ఛగా మాట్లాడగలిగిన, తమ పోరాటాలను అర్థం చేసుకునే న్యాయవాది కావాలనుకున్నారు. ఎందుకంటే కక్షిదారుల కన్న మెరుగ్గా వాస్తవాలు తెలిసినవారు ఎవరూ ఉండరు. న్యాయశాస్త్రమూ ఉద్యమమూ కలిసి ముందుకు నడవాలి. న్యాయం కోసం పోరాటంలో నా కక్షిదారులు కూడా సమానమైన ముఖ్యమైన భాగస్వాములని నేను గుర్తించాను. వారూ నేనూ ఒకే నాణానికి రెండు ముఖాలం.

ప్ర: గడిచిన మూడు సంవత్సరాల్లో చాల మంది వ్యాఖ్యాతలు మీరు మీ అమెరికా పౌరసత్వాన్ని వదులుకుని త్యాగం చేశారని రాశారు. మీరూ అలాగే అనుకుంటారా?

జ: ఎంతమాత్రమూ కాదు! నేను ఈ దేశాన్ని ప్రాణప్రదంగా ప్రేమిస్తాను. నేను చత్తీస్ గడ్ ను ప్రేమిస్తాను. చత్తీస్ గడ్ ప్రజలను ప్రేమిస్తాను. ఎటువంటి పరిస్థితుల్లోనూ నేను చేసినది త్యాగం కాదు. నిజానికి, నేను నా అమెరికన్ పౌరసత్వం వదులుకుంటున్నప్పుడు, నాతో వాళ్లన్నమాట నాకింకా గుర్తుంది: ''నిజంగా వదులుకోదలచుకున్నారా? గుర్తు పెట్టుకోండి, అలా చేస్తే మీరెప్పటికీ అమెరికా సైన్యంలో చేరే అవకాశం ఉండదు" అన్నారు. (నవ్వు). "నాకు అసలు అమెరికన్ సైన్యంలో చేరే ఉద్దేశం ఎంతమాత్రమూ లేదు" అని జవాబిచ్చాను నేను. కనుక, నాకా పని చేసినందుకు ఎటువంటి విచారమూ లేదు. లేదు. నాకు ఏ విచారమూ లేదు, నిజంగానే. నాకు మరొకసారి జీవించే అవకాశం వస్తే, నేనిప్పుడు చేసిన పనులే మళ్లీ చేస్తాను.

నాకున్న ఒకే ఒక్క విచారం ఏమిటో తెలుసునా, నేను నా బిడ్డకు తగిన సమయాన్నీ, శ్రద్ధనూ ఇవ్వలేదనేదే. తనను నిర్లక్ష్యం చేస్తున్నానని అనుకుంటున్నదని, నేను కావాలని బాగా అనుకుంటున్నదని నాకు చాలా చాలా ఆలస్యంగా తెలిసింది. నిజం చెప్పాలంటే, నేషనల్ లా యూనివర్సిటీలో బోధనా ఉద్యోగం తీసుకుని 2017లో ఢిల్లీకి వెళ్లడానికి నేను చేసిన ప్రయత్నమంతా తాను అనుభవిస్తున్న కొరతను గుర్తించడమే. మేమిద్దరమూ కలిసి ఎక్కువ కాలం గడపడానికి చేసిందే. తాను తన వ్యక్తిత్వాన్ని రూపు దిద్దుకుంటుంటే సహాయం చెయ్యడానికే. అప్పుడే నేను అరెస్టయ్యాను.

ప్ర: ఈ మూడు సంవత్సరాల్లో మీరు నేర్చుకున్న పాఠాలు ఏమైనా ఉన్నాయా?

జ: ఓ, చాలా పాఠాలున్నాయి. ఒకటి, జైలులో ఉన్న కాలంలో నేను చేయడం మొదలుపెట్టినది, ఈ మూడేళ్లలో చేసినది, నా సంగతి నేను చూసుకోవడం (నవ్వు). ఆ పని నేను చాలా చాలా కాలంగా చేయలేదు. ఎప్పుడూ నేను తీరిక లేకుండా ఉండేదాన్ని. బహుశా ఆ కారణం వల్లనే నేను నా బిడ్డను కూడా నిర్లక్ష్యం చేశానేమో. తను కూడా నాలో భాగమే కదా. నేను నా గురించి ఎప్పుడూ పట్టించుకోలేదు. అంటే, జైలులో ప్రతి ఒక్కరూ తమ గురించి తాము శ్రద్ధ తీసుకోవడం నేర్చుకుంటారనుకుంటాను. దొరికిన చిన్న స్థలంలోనే, తక్కువ సమయంలోనే వ్యాయామం చేయడం మొదలుపెట్టాను. అలాగే జైలులో ఒక మూలకు వెళ్లి పాటలు పాడేదాన్ని. నా మనసులో ఆహ్లాదం నింపుకోవడానికి ప్రయత్నించేదాన్ని. అటువంటి ఎన్నో పనులు చేసేదాన్ని.

నేను నేర్చుకున్న మరొకటి, చుట్టూ చూసి ఎన్నెన్ని రకాల జీవన కొనసాగింపు యంత్రాంగాలున్నాయో గుర్తించడం. తమకు కలిగిన దుఃఖాన్ని అధిగమించి జీవనం కొనసాగించడానికి, మనుషులు ఎట్లా దానితో తలపడతారో, వ్యవహరిస్తారో చూశాను. ప్రతి ఒక్కరికీ వారిదైన పద్ధతి ఉంది. కొందరు ప్రతిదాన్నీ పరిహాసంగా మార్చి దుఃఖాన్ని జయిస్తారు. మరి కొందరు తమ కాలమంతా ప్రార్థనల్లో గడిపి దుఃఖాన్ని జయిస్తారు. ప్రతి ఒక్కరికీ ఒక వ్యవహార శైలి ఉంది. అంత దుర్భరమైన కష్టాన్ని వాళ్లు ఎలా అధిగమించి నిలుస్తున్నారో ప్రతి ఒక్కరి నుంచీ నేర్చుకునే అవకాశం ఉంది.

చివరిగా, మంచి ఆహారపు విలువేమిటో కూడ నేను నేర్చుకున్నాను. ఆ జైలు తిండిని కూడా తినగలిగేలా మార్చుకోవడానికి అక్కడి స్త్రీలకు ఎన్నో ఆసక్తికరమైన పద్ధతులున్నాయి. వేరుశనగలు కొనుక్కుని, వాటిని నూరి, చట్నీగా మార్చి, ప్రతి తినుబండారాన్నీ మెరుగు పరిచి, తినగలిగేలా మారుస్తారు.

నా పుట్టినరోజున నా తోటి ఖైదీలు చేసినది నేనెప్పుడూ గుర్తుపెట్టుకుంటాను. వాళ్లు మారీ బిస్కట్లను పొడిగా మార్చి, దాన్ని పిండి ముద్ద చేశారు. దాన్ని కేక్ బేస్ లా తయారు చేశారు. బ్రిటానియా టోస్ట్ ను పంచదార నీళ్లలో నానబెట్టి, ఆ బేస్ మీద రెండో వరుసగా పరిచారు. మళ్లీ దాని పైన బోర్నవిటా ముద్దను చాక్లెట్ లా తీర్చిదిద్దారు. ఆ పైన జామ్ తో నా పేరు రాశారు. నా జీవితంలోకెల్లా నేను తిన్న అత్యంత అద్భుతమైన కేక్ అది.

మిత్రమా, ఒక్కసారి ఆలోచించండి. అంత కష్టభరితమైన పరిస్థితుల్లో, ఒత్తిడి నిండిన దుర్భర పరిస్థితుల్లో మనుషులు ఎంత సృజనాత్మకంగా ఉండగలరు! మనుషులు తలచుకుంటే ఏమి చేయగలరో అది చూపుతుంది. ప్రతి ఒక్కరిలోనూ ఎంతో అద్భుతమైన సృజనాత్మక శక్తి నిద్రాణంగా ఉంది. కచ్చితంగా అది జైలులో వ్యర్థమైపోగూడదు.

(చిత్రాంగదా చౌధురి ఆర్టికల్ 14 సంపాదకవర్గ సభ్యులు, అనేక పురస్కారాలు పొందిన జర్నలిస్టు)

(ఆర్టికల్ 14 సైట్ మీద 18 జనవరి 2022న అచ్చయిన ఇంటర్వ్యూకు అనువాదం: ఎన్ వేణుగోపాల్) వీ

# జిందాల్ సేవలో ఒడిశా ప్రభుత్వ దమనకాండ

*పోస్కోను ఎదిరించి వెళ్లగొట్టిన ఒడిశా గ్రామీణ ప్రజానీకం మీద ఇప్పుడు జిందాల్ ఉక్కు కర్మాగారం కోసం సాగుతున్న దమనకాండను వివరిస్తున్నారు* **భూసారం శివన్న**

ఏది గొప్ప? కొన్ని తమలపాకు, జీడిమామిడి తోటలు, కాసిని రొయ్యల చెరువులు, వాటిపై ఆధారపడి తరతరాలుగా భుక్తి పొందుతూ జీవనం సాగిస్తున్న 40,000 మంది ప్రజలా? లేక పోస్కో, జెఎస్‌డబ్ల్యు వంటి బడా కార్పొరేట్ సంస్థలు రు. 65,000 కోట్లు వెచ్చించి, వేల ఎకరాల్లో  పెట్టాలనుకుంటున్న బృహత్ ఉక్కు పరిశ్రమ, ఓడరేవు, విద్యుత్ ఉత్పాదక కేంద్రం, సిమెంట్ ప్లాంటు వగైరా ఉత్పత్తి వ్యవస్థలా? ఈ ప్రశ్నకు ఇరుకొసలా ఆలోచనాపరుల సమూహాలు మోహరిస్తాయి.

ఒక సమూహం ప్రజల జీవనం, పర్యావరణం ప్రధానమని వాదిస్తుంది. అదే మౌలికమని పట్టుబడుతుంది. బాధిత ప్రజలవైపు నిలబడి వారితో కలిసి పోరాడుతుంది. ఇక్కడ గెలుపు ఓటముల ప్రసక్తి కాదు ప్రధానం. జీవన వనరుల విధ్వంసం, సామాజిక న్యాయం, పర్యావరణ పరిరక్షణ, వాటికై సాగే నిరంతర ప్రజా జీవన సంఘర్షణ ఇవీ అత్యంత ప్రధానం.

రెండో సమూహం పెట్టుబడి శక్తులు, వాటిని అంటి పెట్టుకుని ఉండే ఆలోచనాపరులు, పెట్టుబడికి కాపలాకాసే ప్రభుత్వాలు. ఇటువంటి ప్రభుత్వాలను మార్క్స్-ఎంగెల్సులు, పెట్టుబడి కార్యకలాపాలను, సమిష్టి వ్యవహారాలను చక్కబెట్టే కార్య నిర్వాహక కమిటీలు మాత్రమే అన్నారు. ఎంత అద్భుత విశ్లేషణ. నిరంతరం ఈ దేశంలో మన కళ్లముందు ఆవిష్కరించబడుతున్న నగ్నసత్యమే కదా ఇది.

ఈ నగ్నసత్యాన్ని మరోమారు ఒడిశా ప్రభుత్వం కర్కశంగా ప్రదర్శిస్తోంది. కార్పొరేట్ పెట్టుబడికి చీఫ్ ట్రస్టీ ఐన నవీన్ పట్నాయక్ ప్రభుత్వం థింకియా ప్రజలపై ఉక్కుపాదం మోపి హేయమైన దమనకాండతో వారి ప్రతిఘటనను అణచివేయడానికి శత విధాలా ప్రయత్నిస్తోంది.

ఇదివరలో విదేశీ పెట్టుబడిదారు పోస్కో కంపెనీ వ్యవహారంలో ప్రజల పోరాటానికి, అంతర్జాతీయ ప్రజాహిత ఉద్యమ కార్యకర్తల ఒత్తిడికి తప్పని పరిస్థితిలో తలవొగ్గిన నవీన్ పట్నాయక్ రాటుదేలాడు. ఇప్పుడు జెఎస్‌డబ్ల్యు' వ్యవహారంలో వెనక్కు తగ్గరాదనే పట్టుదలతో తన పోలీసు బలగాలను దించి థింకియా, ఆ చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలపై నిరంతర దాడులు కొనసాగిస్తున్నాడు. నిర్దాక్షిణ్యంగా పచ్చని తమలపాకు తోటలను నేలమట్టం చేయిస్తున్నాడు. జీడి చెట్లను నరికి వేయిస్తున్నాడు. అడ్డు అదుపు లేకుండా ఇళ్లపై పడి ప్రజలను బయటకు ఈడ్చడం, ముసలి, పడుచు, ఆడ, మొగ, పిల్లా, పాప అనే విచక్షణ లేకుండా పోలీసులచే క్రూరంగా బాధించడం, తొక్కిపడేయడం కొనసాగిస్తున్నాడు. ఇష్టానుసారం గ్రామ ప్రజలను అరెస్టులు చేసి కేసులు పెట్టడం, వ్యక్తులను మాయం చేయడం వంటి ఫాసిస్టు చర్యలను విచ్చలవిడిగా అమలుచేస్తున్నాడు. ఈ గ్రామాలకు వెళ్ళే మార్గాలను పోలీసు బలగాలతో నింపి అష్ట దిగ్బంధనం చేసాడు. ప్రజా సంఘాలను, నిజ నిర్ధారణ చేసే కార్యకర్తలను బెదిరించి అటువైపు తొంగిచూడకుండా కట్టడి చేస్తున్నాడు. ఇతర సమాజం నుండి ఈ గ్రామ ప్రజలకు ఏరకమైన సహాయ సహకారాలు అందకుండా కట్టడి చేస్తూ వారిని ఏకాకులు చేసి జిందాల్ కంపెనీకి, తన ప్రభుత్వానికి తలొగ్గే నయా వలసవాద నీతిని  ప్రదర్శిస్తున్నాడు.

ఒడిశా సంయుక్త కిసాన్ మోర్చా, ఇంకా అనేక సంస్థల ఖండనను, లేఖలను బుట్ట దాఖలు చేసాడు. దేశం నలుమూలల నుండి వెల్లువెత్తుతున్న ప్రజా నిరసనలను పెడచెవిన పెట్టి పోలీసు మందబలంతో ఏవిధంగానైనా జెఎస్‌డబ్ల్యు ఉక్కు వ్యతిరేక ప్రజా ఉద్యమాన్ని కాలరాచివేయడానికి కంకణం కట్టుకున్నాడు. ప్రకృతి రమణీయతతో, స్వావలంబనా ఉపాధి నొసగే జగత్‌సింగ్పూర్ జిల్లాను కాలుష్యమయం చేసైనాసరే, ఆ ప్రాంత ప్రజల కాళ్ళు చేతులు బంధించి పెట్టుబడి పాదాల చెంతకు విసిరివేయ దల్చుకున్నాడు. భారత రాజ్యాంగాన్ని, ప్రజల అలజడిని, ప్రజా శ్రేయోభిలాషుల ఖండనలను అతను ఏమాత్రం ఖాతరు చేయడం లేదు. ప్రజలను నిర్వాసితులుగా మార్చి దయనీయమైన జీవనం గడపమని నిర్ణయించాడు ఈ అపర కార్పొరేట్ ప్రియుడు నవీన్ పట్నాయక్.

జగత్‌సింగ్పూర్ జిల్లాలో మూడు గ్రామాలు: థింకియా, నువాగాం, గడకుజంగ్ ప్రజల జీవనోపాధి పూర్తిగా హరించుకుపోతుందని ఈ ప్రాంత ప్రజలు గత 15-16 ఏళ్లుగా ముందు పోస్కో కంపెనీతో పోరాడి సాధించిన విజయం మూన్నాళ్ల ముచ్చటగా మిగిలింది. జిందాల్ రూపంలో ఆ ప్రమాదం ఇప్పుడు ఈ గ్రామ ప్రజలపై మరింత భీకరంగా విరుచుకు పడుతోంది. పోస్కో ప్రతిరోధ్ సంఘటన్ అనే సంస్థ స్థాపించుకుని వారు ఓ మహత్తర పోరాటం నిర్వహించారు. పోస్కో ప్రజా ఉద్యమానికి తలొగ్గి కార్యక్షేత్రం నుండి వైదొలగిన తరువాత గ్రామస్థుల నుండి బలాత్కారంగా లాక్కున్న భూములు వెనక్కు వస్తాయని వారు ఆశించారు. తమ ముఖ్యమంత్రే జిందాల్ కత్తి చేబూని తమకు వెన్నుపోటు పొడుస్తాడని అనుమానం ఉన్నప్పటికీ, ఎక్కడో ఓ ఆశ వారిని నడిపిస్తూ వచ్చింది. ఇప్పుడు ఆ ఆశ అడుగంటిపోయి ఊళ్ళు వదిలి అడవుల్లో తలదాచుకోవాల్సి వస్తోంది.

ఇక్కడ ఓ ఆసక్తిదాయకమైన చిత్రాన్ని పాఠకుల ముందు ఉంచాలి. పోస్కో ప్రాజెక్ట్ గురించి రైతుల నుండి భూములు తీసుకునే క్రమంలో ధింకియా ప్రజలు తమ భూములు ప్రభుత్వానికి స్వాధీనం చేయకుండా గట్టిగా నిలబడి పోరాడారు. నష్టపరిహారం ప్రలోభానికి లొంగకుండా పోరాడి తమ తమలపాకు తోటలను రక్షించుకున్నారు. నౌగాం ప్రజలు ప్రభుత్వ ఒత్తిడికి, నష్టపరిహారం సొమ్ముకు లోబడి తమ తోటలు వదులుకున్నారు. వారు చివరకు రెంటికీ చెడ్డ రేవడిలా మారారు. కొందరు ధింకియా తోటల్లో పనివారిగా మారిపోయారు. వారికొచ్చిన నష్టపరిహారపు సొమ్ము స్థానిక రాజకీయ దళారులను నమ్మి దొంగ చిట్‌ఫండ్ కంపెనీలో పెట్టి సర్వం కోల్పోయారు. అదే దింకియా ప్రజలు తమ తోటలను కాపాడుకోవడమే గాక 35 శాతం మందికి ఉండే తోటలను ఇప్పుడు 65 శాతం మందికి పెంచుకుని నష్టపోయిన తోటి రైతులకు పని కల్పిస్తున్నారు. పెట్టుబడి తన కరకు ముళ్ళ హస్తాలతో రైతుల గొంతులు ఎలా పిసికేస్తుందో, వారి జీవితాలను ఎలా ఛిద్రం చేస్తోందో పై నిజచిత్రం మనకు చూపిస్తుంది. దింకియా ప్రజలు ఇప్పుడు జిందాల్, ప్రభుత్వ జమిలి దమనకాండకు, అణచివేతకు తలొగ్గక నిలబడినారంటే వారి ఆర్థిక స్వావలంబన ఒక ప్రధాన కారణం అని చెప్పాలి. అందుచేతనే వారు ఉన్నత న్యాయస్థానాల మెట్లు ఎక్కగల్గుతున్నారు. ఇప్పుడు జిందాల్ ప్రతిరోధ్ సంఘర్షణ సంస్థ, జిందాల్ బాధిత ప్రజా సంఘటనా సంస్థల్లో సమీకృతులౌతూ బరిగీసి నిలబడ్డారు.

జనవరి 20వ తేదీన ఒడిశా ఉన్నత న్యాయస్థానం ప్రభుత్వానికి అల్టిమేటం ఇచ్చింది. రైతులపై జరుగుతున్న దాడులు వెంటనే ఆపి క్షేత్రస్థాయి రిపోర్టును సీల్డ్ కవర్లో అందించమంది. రైతులకు ఇది ఒకింత ఊరట. అయితే అంతిమ పరిణామం ఎలా ఉంటుందో చెప్పలేం!

ఒడిశా ప్రభుత్వం రైతులపై ఇటువంటి ఫాసిస్టు దాడులకు ఎందుకు బరితెగించింది? కారణాలు అనేకం. అందులో మొదటిది: కేంద్ర ప్రభుత్వం ఈ విషయంలో నవీన్ పట్నాయక్‌కు పూర్తి మద్దతు నివ్వడం. రెండు: ఒడిశా సమాజంలో ఓ బలీయమైన ప్రజా సమూహం నకిలీ అభివృద్ధి నమూనాను ఆలింగనం చేసుకుని భ్రమల్లో విహరిస్తూ ఉండడం. ఇది కేవలం ఒడిశాకే పరిమితం కాదు. యావత్ భారతంలో ఈ అపరిపక్వ చింతన ఇప్పుడు ప్రజల మెదళ్ళను ఆవరించి ఉంది. మూడు: రైతాంగ పోరాటాలు ప్రాంతలవారీ స్థానిక ఉద్యమాలుగానే మిగిలిపోతూ వాటిమధ్య ఐక్యత, క్షేత్రస్థాయి అనుసంధానత లోపించి దేశవ్యాప్త ఉద్యమాల సమీకరణ పెంపొందక పోవడం.

ఒకే రాష్ట్రంలో, వివిధ ప్రాంతాల్లో, వారి వారి ప్రత్యేక సమస్యలపై ఉద్యమించే ప్రజల మధ్య కూడా సంఘీభావం పెంపొందడం లేదు. గిరిజనుల పోరాటాలకు రైతులు దూరంగా ఉంటారు. రైతుల పోరాటాలకు ఉద్యోగులు దూరంగా ఉంటారు. విద్యార్థుల పోరాటాలకు కార్మికులు కదలరు. కార్మికుల పోరాటాలకు మిగతావారు ఎడంగా ఉండిపోతారు. ఇలా పలు జీవనోపాధి రంగాలలో పనిచేసేవారి మధ్య అనైక్యతా అగాధం ఏర్పడి ఉంది. ఉదాహరణకు చత్తీస్‌గఢ్, ఝార్ఖండ్, మధ్యప్రదేశ్, ఈశాన్య భారత రాష్ట్రాల్లో గనులు ఇతర అభివృద్ధి ప్రాజెక్టుల మూలంగా జరుగుతున్న జీవన వనరుల విధ్వంసం పట్ల, అక్కడి ప్రజలపై పోలీసు, పారామిలిటరీ బలగాలు జరుపుతున్న నరమేధం పట్ల మిగతా రాష్ట్ర ప్రజలు ఏమేరకు గళం విప్పుతున్నారు? ఎందుకు తటస్థులుగా ఉండిపోతున్నారు?

ఒడిశాలో ఇపుడు జరుగుతున్న జిందాల్ వ్యతిరేక ఉద్యమానికి ఒడిశాలోని ఇతర ప్రాంత ప్రజలు ఎంతవరకు మద్దతుగా నిలబడుతున్నారు అని చూస్తే అది ఇప్పుడిప్పుడే ఊపందుకుని ఓ ఆశావహ మలుపు కనిపిస్తోంది. ఇందులో ముందుగా చెప్పుకోవలసింది ఈ జిందాల్ గ్రూపే స్థాపించిన ఓ.పి.జిందాల్ విశ్వవిద్యాలయంలో చదువుతున్న 300 మంది విద్యార్థులు జిందాల్ స్టీల్ సంస్థ ఛైర్మన్ సజ్జన్ జిందాల్‌కు చెంపపెట్టు ఉత్తరం రాయడం. జిందాల్ సంస్థ ప్రకటించుకున్న విలువలకు పూర్తి విరుద్ధంగా మీరు దింకియా ప్రాంత ప్రజల హక్కులను కాలరాచి వేయడం చాలా హేయమైనదని, వెంటనే ఈ పోలీసు దాడులను, భూముల దూరాక్రమణను ఆపి రాజ్యాంగ విలువలకు కట్టుబడి ఉండమని వారు తమ లేఖలో హితవు చెప్పారు.

అన్ని వామపక్ష రాజకీయ పార్టీలు, పలు ప్రజాసంఘాలు, జాతీయ హక్కుల కమిషన్, కోర్టులు స్పందించడం మొదలై ఓ ఆశావహ కదలిక ఇప్పుడు కనిపిస్తోంది. ఈ వ్యతిరేకత మరింత విస్తృతిచెంది ఒడిశా ప్రభుత్వ దమనకాండను ఎదుర్కొన్నట్లైతే, ధింకియా ఆ చుట్టు ఉన్న ప్రజలకు వారి భూములు మిగిలే అవకాశం ఉంది. వారి జీవనోపాదికి రక్షణ ఉంటుంది. ప్రజల ఐక్య పోరాటాలు, సంఘటిత శక్తి మినహా వేరే ఏ శక్తి కార్పొరేట్ నకిలీ అభివృద్ధి నమూనాను ఓడించలేదు. పెట్టుబడి కోరలు పీకలేదు.

*(రచయిత సామాజిక కార్యకర్త)*

*మత వేదన వాస్తవ వేదనకు వ్యక్తీకరణే. అదే సమయంలో అది వాస్తవ వేదన పట్ల నిరసన కూడా. మతం అణచబడ్డ జీవి నిట్టూర్పు. హృదయంలేని ప్రపంచపు హృదయం. ఉత్సాహంలేని పరిస్థితుల ఉత్సాహం. అది ప్రజలకు మత్తు మందు. ప్రజల భ్రమాజనిత ఆనందంగా ఉన్న మతాన్ని రద్దుచేయడమంటే ప్రజల వాస్తవమైన ఆనందాన్ని ఆకాంక్షించడమే. ప్రస్తుత స్థితిపట్ల భ్రమల్ని వదిలేయమని కోరడమంటే, భ్రమలు అవసరమయ్యే పరిస్థితుల్ని వదిలేయమని కోరడమే. అందుకే మతం మీద విమర్శ ఏ కన్నీటి ప్రవాహాల వెలుగు మతమో, ఆ కన్నీటి ప్రవాహాల మీద విమర్శకు బీజరూపమే.*

**– కార్ల్ మార్క్స్**

# జిందాల్ ప్రతిఘటనోద్యమంలో మహిళలు

***జిందాల్ ఉక్కు కర్మాగారం కోసం జరుపుతున్న భూసేకరణను ప్రతిఘటిస్తున్న ఉద్యమంలో ఒడిశా మహిళల పాత్రను వివరిస్తూ* ప్రియ రంజన్ సాహు *రాసిన వ్యాసానికి రాజేంద్ర బాబు అర్విణి తెలుగు అనువాదం***

**అ**ది ఒడిశా రాష్ట్రంలోని జగత్ సింఘ పూర్ జిల్లాలో ఉన్న పరదీప్ ఓడరేవు సమీపంలోని గ్రామం. ఆ ఊరి పేరు ధింకియా. ఊరంతా పచ్చని చెట్లు పరచుకొని ఉన్న ఒక సముద్రతీర గ్రామం అది. ఆ గ్రామానికి వెళ్లే రోడ్డుపై కొన్ని పోలీసు వాహనాలు నిలుచుని ఉన్నాయి. ఓ డజన్ మంది పోలీసులు నిలబడి ఉన్నారు. ఆ వాహనాలు గ్రామంలోకి ప్రవేశించటానికి వీలు లేకుండా పోలీసు వాహనాల ముందు రోడ్డు పూర్తిగా తవ్వబడి ఉంది.

వెదురుబొంగులతో తయారు చేసిన గేటు ఒకటి ఆ గ్రామానికి ప్రవేశద్వారంలా ఉంది. ఆ గేటుకు ఈవల సుమారు 500 మీటర్ల దూరంలో దాదాపు 50 మంది స్త్రీలు రోడ్డు వైపు చూస్తూ నిశ్చేష్టంగా, నిశ్శబ్దంగా నిలుచుని ఉన్నారు. వారి ముఖాలలో భయంతో పాటు బాధ కూడా స్పష్టంగా కనిపిస్తున్నది.

కొన్ని వారాల క్రితం, ధింకియా గ్రామ పంచాయితీ సమితి సభ్యుడయిన దేవేంద్ర స్వాయన్‌ను అరెస్ట్ చెయ్యడానికి పోలీసులు ప్రయత్నిస్తే వారిని మహిళలే అడ్డుకున్నారు. నిమిషాల వ్యవధిలో దాదాపు వంద మంది స్త్రీలు గుమిగూడి పోలీసులు గ్రామం నుండి వెళ్లిపోయేలా తీవ్రంగా వత్తిడి చేశారు.

అప్పట్నుంచి గ్రామానికి వచ్చే మూడు దారులలో వెదురు బొంగులతో గేట్లు ఏర్పాటు చేశారు. "పోలీసులు గాని, అధికారులు గాని మా గ్రామంలోకి రాత్రుళ్లు వచ్చి మా వాళ్లను అరెస్ట్ చెయ్యకుండా గేట్ల వద్ద ఎప్పుడు కాపలా కాస్తుంటాము". ఈ మాటలు అన్నది 60 ఏళ్ల పైబడిన వయస్సు గల లతిక పరిద అనే ఓ స్త్రీ.

వీరంతా ఎందుకు గ్రామాన్ని పహారా కాస్తూ కాపలాగా ఉంటున్నారు?

జిందాల్ స్టీల్ వర్క్స్ లిమిటెడ్ (జె.ఎస్.డబ్ల్యు) వారు నిర్మించ తలపెట్టిన సమీకృత కర్మాగారం కోసం జిల్లా అధికార యంత్రాంగం సరికొత్తగా భూసేకరణ ప్రయత్నాలు ప్రారంభించడం వారిలో కోపం పెల్లుబుకడానికి కారణమయింది. ఈ ప్రాజెక్టులో భాగంగా – ప్రతి ఏడాది ఒక కోటి 20 లక్షల టన్నుల ఉత్పత్తి సామర్థ్యం కలిగిన ఉక్కు కర్మాగారం, 900 మెగావాట్ల విద్యుత్ శక్తి ఉత్పత్తి కేంద్రం, ఒక కోటి టన్నుల ఉత్పత్తి సామర్థ్యం కలిగిన సిమెంట్ ఫాక్టరీ, తమ రవాణా అవసరాల కోసం ఓ నౌకాశ్రయం – ఇవన్నీ నిర్మిస్తారట. ఫాక్టరీ కట్టాలన్న తన కోరిక నెరవేర్చుకోలేక పోయిన కొరియన్ ఉక్కు తయారీ కంపెనీ పోస్కో కోసం ఒడిశా రాష్ట్రంలోని పారిశ్రామిక మౌలిక సదుపాయాల అభివృద్ధి సంస్థ (ఇండస్ట్రియల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్) వారు సేకరించిన భూమి పరిసర ప్రాంతంలోనే జిందాల్ కంపెనీని స్థాపించాలని ప్రణాళిక. గ్రామస్తుల తీవ్ర ప్రతిఘటన కారణంగా ఒక దశాబ్దకాలం పాటు అటు ఇటు కదలలేక చివరికి 2017లో వెనుదిరిగిన ప్రాజెక్ట్ అది.

జిందాల్ ప్రాజెక్ట్‌కు 3000 ఎకరాల భూమి కావాలి. నౌగాంవ్, గడకుజంగ, ధింకియ గ్రామ పంచాయతీల కింద ఉన్న భూములలో 2,200 ఎకరాలను ఇండస్ట్రియల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ డెవలప్మెంట్ కార్పొరేషన్ ఇంతకు ముందే పోస్కో కోసం సేకరించి ఉంచింది. ఆ భూములలో చాలా భాగం యథాతథంగా జిందాల్ ప్రాజెక్ట్‌కు బదిలీ అవుతాయి. ఇప్పుడు అధికారగణం ఈ కొత్త ప్రాజెక్ట్‌కు అవసరమయిన 748 ఎకరాల భూమిని సేకరించాలి. వాళ్లు సేకరించ తలపెట్టిన భూమి ధింకియ గ్రామ పంచాయితీ పరిధిలో ఉంది. తమ జీవనాధారమైన, తమ పొలాల్లోని తమలపాకు తీగలను తుంచి పారెయ్యమని, ప్రాజెక్ట్ నిర్మాణానికి మార్గం సుగమం చెయ్యమని అధికారులు తమను భయకంపితులను చేస్తున్నారని ధింకియ గ్రామ మహిళలు వాపోతున్నారు.

ప్రాజెక్ట్ నిర్మాణం కోసం సరిహద్దులను గుర్తిస్తూ, తమలపాకు పొలాలను ధ్వంసం చేస్తూ గ్రామస్తులపై ఎన్నో కేసులు బనాయించారని వారి ఆరోపణ. 'జిల్లా యంత్రాంగం మా తమలపాకు తీగలకు నీళ్ల సరఫరా ఆపేసారు. ఆ కంపెనీ లాభాల కోసం మా జీవనాధారాన్ని ధ్వంసం చేయాలనుకుంటున్నారు. మేం శవాలుగా మారితేనే అది వాళ్లకు సాధ్యమవుతుంది, అంతవరకూ మేం పోరాడుతూనే ఉంటాం' అని కుని మల్లిక్ అనే యువతి తన బాధను వెళ్లబుచ్చారు. ధింకియ, గోవిందపూర్, నౌగాంవ్, గడకుజంగ గ్రామ పంచాయతీలలో గత నవంబర్ మాసంలో ప్రజాభిప్రాయ సేకరణ కోసం ప్రజా దర్బారులు నిర్వహించారు. చాలా మంది ప్రజలు ప్రాజెక్ట్ నిర్మాణాన్ని వ్యతిరేకించారు. అత్యధిక శాతం మహిళలు ధైర్యంగా ముందుకు వచ్చి తమ అసమ్మతిని తెలియజేశారు. కొంతకాలం తర్వాత గోవిందపూర్ గ్రామంలో మళ్లీ ప్రత్యేకంగా ప్రజాభిప్రాయం కోసం సభ నిర్వహించారు.

అధికార యంత్రాగం 90 తమలపాకు పంట పొలాలను గుర్తించిందని, వాటిల్లో గోవిందపూర్, పటనా గ్రామాలలోని 38 తోటలను ధ్వంసం చేశామని ఎరాసమా తహసీల్దారు చౌదరి ప్రగ్యానంద దాస్ ప్రకటించాడు. "చట్ట ప్రకారం మా పని మేం చేస్తున్నాం. తమలపాకు తోట యజమానులకు ఒక్కొక్క ఎకరానికి రు. 17.50 లక్షలు నష్టపరిహారంగా చెల్లించి వారి సమ్మతితోనే ఆ పంటను ధ్వంసం చేస్తున్నాం" అని చెప్పాడు. బలవంతంగా భూ సేకరణ చేస్తున్నారన్న ఆరోపణను ఆయన తోసిపుచ్చాడు. తమలపాకు తోటలకు నీటి సరఫరా

నిలిపివేసిన విషయం తనకు తెలియదని, ఆ విషయం గురించి విచారణ చేస్తామని చెప్పాడు. గోవిందపూర్ గ్రామస్తులు చాలామంది పంటను ధ్వంసం చెయ్యడానికి బరువెక్కిన గుండెలతో ఒప్పుకున్న మాట నిజమేనని, మాముందు మరో మార్గం లేకపోయిందని, అధికారులు మాకు ఇంకో మార్గం లేకుండా చేసి బలవంతపెట్టారని వాపోయారు.

ఇటీవల ప్రభుత్వం తీసుకున్న తమలపాకు తోటల ధ్వంసం కార్యక్రమంలో భారీగా నష్టపోయిన సురేంద్రదాస్ మాటల్లో పోస్కో ప్రాజెక్టను నెలకొల్పాలని ప్రభుత్వం పట్టుబట్టడం వల్ల ఈ ప్రాంతం ఈ పాటికే వేలాది తమలపాకు తోటలను, లక్షల సంఖ్యలో చెట్లు, ముఖ్యంగా మంచి ఫలసాయం ఉన్న జీడి మామిడి చెట్లను నష్టపోయింది. అవి శాశ్వతంగా తుడిచిపెట్టుకుపోయాయి. 'ఇప్పుడు మళ్లీ వారు జిందాల్ ప్రాజెక్ట్ కోసం వస్తున్నారు. ఇది మా వినాశనం కోసమే వచ్చింది. తమలపాకులు, చేపలు, వరి, జీడి మామిడి చెట్లే మా జీవనానికి ఆధారాలు. వాటిని నాశనం చేస్తే ఇక మేం బతకడానికి ఏమీ మిగల్చనట్టే'.

**మహిళల పోరాట స్ఫూర్తి**

ఇదివరకే ఒక దశాబ్ద కాలం పాటు పోస్కో వ్యతిరేక పోరాటంలో గ్రామస్తులు అలిసిపోయారు. ఆ అలసట వారి మొఖాల్లో బాగా కనిపిస్తుంది. ముఖ్యంగా పురుషులు అధికారులతో ఘర్షణ ఎందుకు పెట్టుకోవాలి అన్న ఆలోచనలో పడ్డట్టు కనిపిస్తోంది. కారణాలు అర్థం కానంత క్లిష్టమైనవేమీ కాదు. వందలాది మంది గ్రామస్తులపై బహుళ సంఖ్యలో పోలీసు కేసులు అపరిష్కృతంగా కోర్టుల్లో పడి ఉన్నాయి. పోలీసు స్టేషన్ల చుట్టూ, కోర్టుల చుట్టూ తిరుగుతూనే ఉన్నారు. పైగా, పోస్కో వ్యతిరేక పోరాటాన్ని నడిపించిన వారు ఇప్పుడు జిందాల్ ప్రాజెక్ట్ విషయం వచ్చేసరికి మౌనంగా ఉన్నారు. కానీ, మహిళలు అధికార యంత్రాంగం బలాన్ని, శక్తియుక్తులను ఎదుర్కోవడానికి ఇంకా సిద్ధంగానే ఉన్నారు. నవంబర్ 21, 2021 నాడు గోవిందపూర్‌లో ప్రజాభిప్రాయ సేకరణ కోసం జరిపిన సభలో పురుషులు మౌనాన్ని ఆశ్రయించగా, సత్యవతి స్వాయిన్ అనే వృద్ధ మహిళ ధైర్యంగా ముందుకు వచ్చి అధికారులను 'మీరంతా కంపెనీ నియమించుకున్న గుండాలు' అని నిందించింది. సత్యవతి స్వాయిన్ పోస్కో వ్యతిరేక ఉద్యమంలో అరెస్ట్ కూడా అయ్యింది. 'ప్రభుత్వం వారు, కంపెనీ పెట్టే వత్తిడికి మేం తలవొగ్గము. మేం మళ్లీ అందరినీ సమీకరించి జిందాల్ ప్రాజెక్టను నిలిపేంత వరకు పోరాడతాం' అని అధికారులను ఆమె హెచ్చరించింది.

నిజానికి, పోస్కో కంపెనీ 2005లో మొట్టమొదటిసారి ఆ ప్రాంతంలోకి ప్రవేశించినప్పుడు, నవ నిర్మాణ సంఘటన అనే సంస్థను ఏర్పాటు చేసుకొని పోరాటానికి సిద్ధమయ్యారు మహిళలు. స్త్రీలు పోస్కో ప్రాజెక్టకు వ్యతిరేకంగా పోరాటంలోకి రమ్మని పురుషులను ప్రోత్సహించి ఒప్పించిన సంఘటనలు కోకొల్లలు. ఎన్నో కుటుంబాలలో అవి కలహాలకు దారితీశాయి. అయితే, ఉక్కు కర్మాగారం తమ జీవితాలను నాశనం చేస్తుందని, తమలపాకు చేల పైనే తమ జీవితం ఆధార పడిందని తమ భర్తలను ఒప్పించడంలో స్త్రీలు సఫలీకృతులయ్యారు. ప్రతి సభకు, ప్రతి ప్రతిఘటనా ర్యాలీకి మహిళలే వందల సంఖ్యలో హాజరయ్యారు. చాలాసార్లు పాల్గొన్న పురుషుల సంఖ్య కంటే స్త్రీలే అధిక సంఖ్యలో ఉండేవారు. పోస్కో ప్రాజెక్ట్ కోసం అధికారులు తమలపాకు తోటలను నాశనం చేస్తుంటే వారికి రక్షణగా ఉన్న పోలీసులను ఎదురించింది స్త్రీలే. ఆ మహిళలే పురుషులకు రక్షణ కవచాలవలె పని చేశారు కూడా. తీవ్రమయిన వ్యతిరేకత వ్యక్తం కాగా అధికార వ్యవస్థకు మరో మార్గం లేక ఉక్కు కార్మాగారం ఉత్పత్తి సామర్థ్యాన్ని సాలీనా ఒక కోటి ఇరవై లక్షల టన్నుల నుండి 80 లక్షల టన్నులకు, అవసరమయిన స్థలాన్ని 4004 ఎకరాల నుండి 2,700 ఎకరాలకు తగ్గించాల్సివచ్చింది. దీంతో ప్రతిఘటనా ఉద్యమానికి కేంద్ర బిందువయినా ధింకియను పోస్కో ప్రాజెక్ట్ పరిధినుండి తప్పించారు. ఆ తర్వాతనే పోస్కో సంస్థ తన పరాజయం అంగీకరించి ప్రాజెక్టను పూర్తిగా ఉపసంహరించుకొంది. ఇప్పుడు జిందాల్ కంపెనీ తన ప్రాజెక్ట్ ప్రతిపాదనలతో ముందుకు వచ్చేసరికి ధింకియ ప్రజలు అప్రమత్తమయ్యారు. వారి భూమి ప్రమాదంలో పడిందని వారికి భయం వేసింది.

జిందాల్ ప్రాజెక్టకు వ్యతిరేకంగా ప్రతిఘటనా స్వరం ధింకియ నుండి వినిపించినందున ధింకియ ప్రజలపై కేసులు బనాయించడం ప్రారంభమయింది. మరొక పక్క పోస్కో కోసం ఇదివరకే ఇండస్ట్రియల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ వారు భూసేకరణ జరిపిన గ్రామాలలో భయం గొలిపే నిశ్శబ్దం నెలకొంది. ఇంతవరకు పటన, మహోల గ్రామాలు ధింకియ రెవెన్యూ పరిధిలో ఉండేవి. వాటిని ధింకియ నుండి విడదీసి ప్రత్యేక రెవెన్యూ గ్రామాలుగా ప్రకటించారు. సేకరించాల్సిన 748 ఎకరాలలో 350 ఎకరాలు పటనలో, మరో 350 ఎకరాలు మహోలలో ఉన్నాయి. మిగిలిన 48 ఎకరాలు ధింకియ గ్రామం నుండి సేకరించాలి. దేవేంద్ర స్వాయన్ అభిప్రాయంలో 'మా మూడు గ్రామాల ప్రజలు ఐక్యం కాకుండా ఇది ప్రభుత్వం పన్నిన కుట్ర. మా భూములను సులభంగా సేకరించడానికి అధికారులు ఆడుతున్న నాటకం'.

బహుశా భయం వల్లనో, ఇతర వ్యామోహాలవల్లనో చాలామంది మగవారు పారిశ్రామికీకరణపై తమ అభిప్రాయాలు మార్చు కున్నప్పటికీ, స్త్రీలు మాత్రం సడలిపోని విశ్వాసంతో ఉక్కు కర్మాగారాలను – అది గతంలోని పోస్కో గాని, ఇప్పుడు ప్రణాళికలు సిద్ధం చేసుకుంటున్న జిందాల్ గాని–తిరస్కరిస్తూ ప్రతిఘటనా ఉద్యమాన్ని కొనసాగిస్తున్నారని ఆ మూడు గ్రామ పంచాయత్‌లలోని ప్రజలు ఒప్పుకుంటున్నారు. భూసేకరణ పనిలో నిమగ్నమయి ఉన్న ఒక ప్రభుత్వ అధికారి మాటల్లో చెప్పాలంటే ధింకియ గ్రామంలోని స్త్రీల వలె ఇతర ప్రభావిత గ్రామాలలో మహిళలు గట్టిగా తమ ప్రతిఘటనా స్వరాన్ని వినిపించక పోయినా ప్రభుత్వ యంత్రాంగం పట్ల ఏహ్య భావంతో ఉన్నారు. ఆయన తన భయాన్ని ఈ విధంగా వ్యక్తపరిచాడు: 'ఆ మూడు గ్రామ పంచాయత్‌లలోని ఎనిమిది గ్రామాలలో సర్వే పూర్తయితే, ఈ ఉక్కు పరిశ్రమను సమర్థించే ఒక్క స్త్రీ కూడా అక్కడ మీకు కనిపించదు. అందరిలోనూ అణిచిపెట్టబడ్డ కోపాగ్ని రగులుతూ ఉంది. గతంలో లాగా వారు ఒక సంఘాన్ని ఏర్పరచుకొని, వారి భర్తలను కూడా ఉద్యమంలోకి వచ్చేట్టుగా ఒప్పిస్తే, మరొక పెద్ద ఘర్షణ, సంఘర్షణ, ఉద్యమం పెల్లుబికేలా ఉంది'. వీ

# పౌర స్పందనే సమాజానికి రక్షణ!

***చైతన్యశీలమైన మానవ శక్తిని అణచివేయడానికి, అక్రమ మార్గాలలోకి మళ్లించడానికి పాలకవర్గ సంస్కృతి చేస్తున్న ప్రయత్నాలను వివరిస్తూ, స్పందన ఎంత అవసరమో చెపుతున్నారు* పోటు రంగారావు**

ప్రజాస్వామిక దృక్పథానికి పౌరసమాజమే రక్ష, రక్షణ. దాని చలనమే ప్రజాస్వామిక దృక్పథం మరింత మెరుగవడానికి దారితీస్తుంది. అది ఎంత కదలికలతో, చైతన్యంతో తొణికిసలాడితే సమాజం అంతగా మెరుగైనదిగా మారుతుంది. అయితే నేడు సమాజంలో సహజ నడకలకు బ్రేకులు పడ్డాయి. కృత్రిమ ఆలోచనలు రుద్దబడుతున్నాయి. పౌరుడంటే, పౌరుషానికో, ప్రగతికో మార్గ నిర్దేశకుడిగా వుంటాడనుకున్న స్థానంలో, చాలా సందర్భాలలో నిశ్చేష్టులుగా, తలవంచుకుని పోయేవారిగా, చర్మ సంరక్షణార్థిగా మారి పోతుండటం పౌరసమాజాన్ని, పురోగామి శక్తులను నివ్వెరపరుస్తున్నది.

ఒకనాడు తెలుగు సమాజాన గోడ రాతలు ఎక్కువగా దర్శనమిచ్చేవి. ప్రజా సమస్యల నుంచి, జాతీయ, అంతర్జాతీయ సంఘర్షణల దాకా వివిధ అభిప్రాయాలు నినాదాల రూపంలో గోడల మీద ప్రత్యక్షమయ్యేవి. ముఖ్యంగా వామపక్ష, విప్లవకర శక్తుల ఆ రాతలు సమాజ నినాదాలుగా, కదలికలుగా కనిపించేవి. వినిపించేవి. నేడు అవి కనుమరుగయ్యాయి. నినాదకర్తల క్రియారహితం కంటే, ప్రభుత్వాలు, అధికార యంత్రాంగం నినాదాలను తెరమరుగు చేసే కుటిలత్వం అమలు చేసింది. ముఖ్యమైన కూడళ్ళలో, వాల్ ప్రాజెక్టులు పెట్టి, వారే ప్రభుత్వ ప్రచార నినాదాలో, ఏదో సంస్కృతి పేరునో బొమ్మలు గీస్తున్నారు. పౌరసమాజానికి ఉద్యమకారులు గీసేవి పిచ్చి గీతలుగా ప్రచారం చేసి, తాము అందమైన బొమ్మలు గీస్తున్నామనే మైండ్ సెట్ క్రియేట్ చేశారు. ఇదంతా ప్రజాకదలిక ప్రచారాస్త్రాలను నలిపివేసే చర్యల్లో భాగంగా జరుగుతున్న తంతే.

ఒకనాడు ఉద్యమం, సమస్యల నినాదాలు వుంటే కలెక్టరేట్ల ముందో, సెక్రటేరియట్ వద్దో ధర్నా నిర్వహించడం, గేట్ల ముందు బైఠాయించడం, దీనితో ప్రభుత్వ దృష్టికి ఆ సమస్య వెంటనే వెళ్ళడం, చర్చించడమో, పరిష్కరించడమో జరిగేవి. కానీ, నేడు ఆ కార్యాలయాల ముందు నిషేధం విధించి, ధర్నా చౌక్‌ను ఆమడ దూరంలో ఏర్పాటు చేసి (అసలు ధర్నా చౌక్‌లే వద్దనే దాకా వెళారనుకోండి) మీ చావు మీరు చావండని వదిలివేశారు. ఈ ధర్నాల, ప్రదర్శనల ఛాయలు కూడా వారి చెవికి సోకవు. వారి పనులకు అంతరాయాలు కలగవు. ఈ విధంగా ఉద్యమ కార్యలాపాలను దూరంగా నెట్టి, వాటిని సహజసిద్ధ స్తబ్దతకు, ఇంకా చెప్పాలంటే – సహజ మరణాలకు గురి చేస్తున్నారు. అమెరికా లాంటి అగ్రరాజ్యంలో వైట్ హౌస్ ముందు, ఇంగ్లాండ్‌లో రాజ ప్రసాదాల ముందు నిరసన గళాలు వినిపించుకునే పరిస్థితి వున్నా, మనం దూరదూరంగా నెట్టేసి, శాంతి భద్రతలను కాపాడుతూ, పాలనకు ఆటంకాలు లేకుండా చేస్తున్నామని చెపుతున్నారు. పాలకులు ఎప్పుడూ ప్రజాసమస్యలు, దాని కనుగుణంగా పాలనను కొనసాగిస్తున్నట్లు నటిస్తూ, ప్రజల గొంతులను వినిపించకుండా తొక్కడంలో భాగమే ఇది.

ఇక రాస్తారోకోలకు తరచూ సెక్షన్ 30, నిషేధాలు తెస్తూ, నేరంగా భావిస్తున్నారు. పెట్రోల్, డీజిల్ రేట్లు దగ్గర నుంచి రైతులు, ప్రజల సమస్యను లోకం దృష్టికి తెద్దామని యత్నిస్తూ, రాస్తారోకోలు చేస్తే, ప్రయాణదారులు 5 నిమిషాలు ఓర్చుకోలేని అసహనం వెల్లువెత్తుతున్నది. వైద్యమో, అత్యవసరమో అయితే సరే అర్థం చేసుకోవచ్చు. మిగిలిన వారైనా కారణమేమిటని అర్థం చేసుకోవడం చాలా అరుదుగా మారుతున్నది. స్పీడ్ ప్రపంచం, ఎవరి పరుగు వారిది. ఎవరి జీవితం వారిది. ఎవరి అవసరం వారిది. నలుగురితో పనిలేదు. నలుగురి గురించి, న్యాయాన్యాయాల గురించీ అక్కరలేదు. ఆ విధంగా మనస్తత్వాన్ని మార్చి వేస్తున్నారు. అది సరుకు చుట్టూ ఏర్పడ్డ మనస్తత్వం – సమాజాన్ని నిలకడగా చూడనివ్వడం లేదు. చూడనివ్వదు. అంతా లాభాపేక్షే.

మరోవైపు నిత్య చలన శీలులైన యువతరపు విద్యార్థులకు రాజకీయ వాతావరణం దూరం చేశారు. ఎకడమిక్ వాతావరణమో, లేదా సినీ, క్రికెట్ హీరోల విషతుల్యపు వేష భాషలో, వికృత చేష్టలో అనుసరణీయంగా అలవాటు చేశారు. కళాశాలల్లో ఎన్నికలు నిషేధించారు. కళాశాల వయస్సులో రాజకీయ అవగాహన అవసరం లేదనే ధోరణి పెంచారు. రాజకీయాలంటే కొందరికి సంబంధించినవి అనే భావన కలిగించారు. సాంఘిక శాస్త్రాలే వద్దనే దాకా వెళ్ళారు. అంతా మార్కెట్ ఎకానమీయే. అందునా డబ్బు, అధికారం, అంగబలం, మందబలం, అడ్డదారులు, అవినీతి కూపంలో ఎంతగా మునిగిపోయినా వారిని ఆదర్శంగా తీసుకునే కల్చర్‌ను తీసుకొచ్చారు. లంపెన్లు, రౌడీలు, మాఫియాలు రాజకీయాలలో అధినేతలుగా చలామణి అవుతుంటే, ఇదేమి ప్రజాస్వామికమని, అడ్డదిడ్డంగా మందిని ముంచి వందల, వేల కోట్లు కూడబెట్టిన వారు అధినేతలుగా మారిపోతుంటే, వారికి అసహ్యం వేయడం లేదు. వ్యతిరేకత ఏర్పడడం లేదు. సందు దారుల్లో వారికి అడ్డగోలుగా గొడుగు పట్టి, ఏదైనా సందుల్లోని పదవులో, పంపకాలో, అంపకాలో దక్కించుకోవాలనే

కూపస్థ మండుకాల్లా మారిపోతున్న పరిస్థితి ఏర్పడింది.

ఒకనాడు అనుకరణ, అనుసరణ, ఆహార్యం, నడత, నడక సమాజపు గౌరవం పొందిన వారి, మహనీయుల అడుగుజాడల్లో ఉండేది. మంచి ఉపాధ్యాయుడు, ధీశాలియైన గ్రామ పెద్ద, కుటుంబాన్ని నడపగలిగిన పెద్ద, ఆ తరువాత గాంధీ, నెహ్రూ, నేతాజీ, భగత్ సింగ్, అల్లూరి, సరోజినీ నాయుడు, అనిబిసెంట్, కోట్నీస్, ఇంకా వందలాది మంది స్వాతంత్రోద్యమకారులు, పోరాటయోధులు, వ్యక్తిత్వ వికాసపు నేతలు జీవితానికి అనుసరణీయులుగా వుండేవారు. అక్కడ నుంచి వీరతెలంగాణ మట్టి పొరల్లో నుంచి వచ్చిన పోరాట మట్టి మాణిక్యాలు, నేలకొరిగిన యోధులు, తెభాగా, పున్నప్రా, శ్రీకాకుళం, గోదావరిలోయ ఆ పెల్లుబికిన పోరాట అలల మీద త్యాగాల చాళ్లు పోసిన వారంటే ఉత్తేజం ఉండేది. వారి అమరస్మృతుల గీతలు జీవితాల్లో, సమాజంలో ఒక ఉద్వేగం రేపేవి. కానీ, వారి స్మృతి పథాలు రెండవ కోవకు నెట్టేసి, నేడు సినీమాయా జగత్తు వెండితెర నటీ నటులు ఆదర్శమవుతున్నారు. వారి పంచరంగుల సెల్యూలాయిడ్ విన్యాసాలు, మిక్సింగ్, గ్రాఫిక్స్ కృతిమత్వంతో చేస్తున్న విన్యాసాల చుట్టూ దీపపు పురుగుల్లా చేరి ఆనందించే రోజులు వచ్చాయి. క్రికెట్, సినీ, రౌడీ రాజకీయ విన్యాసాలు తన జీవితాలను అద్ది, భ్రమలకు, పోకిరీలకు పోతున్న స్థితి ఏర్పడింది.

అలానే వ్యక్తిగత ఆదర్శం సమాజానికి శోభగా, తేజస్సుగా భావించి దాని కోసం పరితపించే రోజులు మారిపోతూ, తాగుడు, జూదం, వ్యభిచారం, పోకిరీ వేషాలు, ర్యాగింగ్, మోసాలు, దగాలు తమ జీవితానికి దగ్గరి మార్గాలుగా వెతుకుంటున్న అగమ్యగోచర స్థితి నేడు వున్నది. వస్త్ర ధారణ నుంచి హేర్ కటింగ్ దాకా, గౌరవభాషను వదిలి బూతుల పంచాంగాన్నే ఆనందంగా స్వీకరించే దాకా పెడపోకడలు సాక్షాత్కరిస్తున్నాయి. ఈ పెడపోకడలు కార్పొరేట్ కంపెనీల మార్కెట్ మతలబు నుంచి వచ్చాయి.

ఆటలు, పాటలు మారిపోయాయి. జీవితం, భవిష్యత్తు, వెలుగుల విజ్ఞానపు వీచికల పాటల నుంచి, ఆవలకు జరిగి, వళ్ళు కొక్కెరలు పోయే ఉన్మాదపు ప్రేమ పాటలు ఆదరించబడుతున్నాయి. వందల ఏండ్ల నుంచి వచ్చిన గ్రామీణ క్రీడలు కరిగిపోతున్నాయి. క్రికెట్, పేకాట, ఇతర జూదపు క్రీడలను స్వంతం చేసుకుంటున్నారు. బడుల మీద కంటే, భక్తి మందిరాల మీద ప్రేమ పెరిగింది. ధైర్యం కంటే భయం మీద బతకడం నేర్చుకున్నారు. సహోదరత్వం కంటే శతృత్వం మీద, సామరస్యం బదులు కుల, మత ఉన్మాదపు పోకడలు జీవితపు నడకకు వారధులు అయ్యాయి.

సామూహిక జీవిత పోకడ, రచ్చబండ చర్చలు, గుంపుల చర్చలు, కుటుంబాల అనుబంధాలు, కలయికలు, ఉమ్మడి కుటుంబ జీవనం ఒకనాటి దృశ్యాలు. కానీ మనిషి రోజు రోజుకు ఒకరికి మరొకరు దూరం జరిగిపోతున్న పరిస్థితి. ఒంటరవుతున్న నేపథ్యం. గ్లోబలీకరణ ఈ ఎడబాటును మరింత పెంచింది. మార్కెట్ ఏకానమీతో, సమాజాన్ని శాసించే సరుకుతో మనిషి బంధం పీటముడి వేసుకుంటుంది. ముచ్చట్లు, మతలబులను ప్రక్కకు నెట్టి టి.వి. వచ్చిన తరువాత దానికి అతుక్కుపోయేలా చేసింది. టి.వి. చూస్తున్న సమయంలో మనుషులు వచ్చినా మాట్లాడటం కష్టమైన పరిస్థితి ఏర్పడింది. దాని పరిణామం కొనసాగింపుగా ఆండ్రాయిడ్ ఫోన్లు, డిజిటల్ మీడియా వచ్చిన తరువాత పరిస్థితి మరింత దిగజారింది. అవి శాస్త్ర, సాంకేతిక రంగాలకు ఆవిష్కరణలే కావచ్చు. కానీ, ఇంటిల్లిపాదికి మనిషికో మొబైల్ ఫోన్ వచ్చి, ఎవరి ఫోన్లో వారే, ఎవరి గదిలో వారే, పరిసరాలతో కూడా సంబంధం లేనట్లుగా వ్యవహరిస్తున్నారు. తిండీ, తిప్పలూ, చదువు, గిదువూ, సామాజిక స్పృహ స్పర్శ కోల్పోతున్న స్థితి.

ఈ పరిస్థితి నేడు సాధారణ పరిస్థితిగా ఉన్నది. దీనికి భిన్నంగా శాస్త్ర, సాంకేతిక రంగాలను శోధిస్తూ జీవితపు మాధుర్యాలను, నూతన ఆవిష్కరణలను పొందుతున్న వారెంతో మంది వున్నారు. జెఎన్‌యు, జామియామిలియా, అలీఘర్ నుంచి అనేక యూనివర్సిటీలలో లాఠీలను, కేసులను ఎదిరించి నిలబడి సమాజానికి దారి తెన్ను ఇదని గుర్తుచేస్తున్న చలనతరంగమూ వున్నది. దేశవ్యాప్తంగా అనేక మంది ఉద్యమకారులు, మేధావులు, పత్రికా రచయితలు, కవులు, కళాకారులు, బుద్ధిజీవులు ఏటికి ఎదిరీదుతూ సమాజ పోకడలకు మార్గనిర్దేశనం చేస్తున్న వారు ఎంతో మంది ఉన్నారు. ఊపా చట్టాల్లో ఇరుకున్నా, నిర్బంధాలతో ఒళ్లు హూనమైనా, తమ జీవితాలను కాగడాలుగా మార్చే యోగ్యులు, త్యాగధనులూ ఉన్నారు.

సామ్రాజ్యవాదం, దాని ఫైనాన్స్ క్యాపిటల్ గ్లోబలీకరణతో ప్రపంచ మార్కెట్ కోసం ఘోరమైన యుద్ధాలను, నేరాలను 'ఆధునికం'గా చేస్తున్నది. నెత్తురు చిందని యుద్ధమిది. మార్కెట్ జూదంతో తమ సరుకు కోసం మనుషుల్ని, మమతల్ని, అనుబంధాలను సరుకులుగా మార్చటమే కాదు. ఒకరికొకరు కలియకుండా పరాయీకరణకు గురిచేస్తున్నారు. అందులో నుంచి ఆధునికత, ఆటవికత రెండూ జమిలిగా మానవ సమాజ జీవితంగా మార్చబడుతుంది. అదీ పెట్టుబడికి వ్యాపారవస్తువు అయ్యింది.

అందుకే, మెరుపుల విన్యాసాల, రంగుల కలలలో విహరించడం కాదు. నిజ జీవిత వ్యధార్థ, యధార్థ దృశ్యాల వెనుక పౌరసమాజం నడక సాగించాలి. మానవ సమాజపు స్పర్శ సంఘ జీవనం – మనిషిని మనిషి హత్తుకోవడం. సామూహికతను సమాజానికి అద్దడం. సామూహికత నుంచి చైతన్య స్పృహను పొందడం. ఆ స్పృహనుంచి కదలడం, కదిలించడం, పెనునిద్దర వదిలించటం.

పౌర సమాజపు నిస్తేజం మొత్తం సమాజానికి పెనుప్రమాదం. దాని మౌనం, అసహనం, నిశ్చేష్టత, వికృత పోకడ సమాజానికి అనర్థం. ప్రతిదీ మనది కావాలి. ప్రకృతి, సమాజం మీద మనిషి ఆధిపత్యం రావాలి. చివరకు మనిషి మీద మనిషే జయించాలి. డబ్బు, పదవి పౌరుడి ముందు అతి చిన్నవి కావాలి. అవే పౌర సమాజానికి నిజమైన అర్థం. నిదానంగా వున్న పౌరసమాజం నిత్య కదలికలో ఉండటమే పౌరులకు రక్ష. ప్రజాస్వామ్యానికి అంతరార్థం. పిడికిలి మించని హృదయంతో... అనంత కోటి ఆశలు దాచెను వేదిక లెక్కెను. వాదము చేసెను. అయినా మనిషి మారలేదు. అతని తపన తీరలేదు.

*(రచయిత సిపిఐ (ఎం-ఎల్) న్యూడెమోక్రసీ సహాయ కార్యదర్శి)*

# తమిళనాడులో బిజెపి ప్రయత్నాలు

***బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమం, ఆత్మగౌరవ ఉద్యమం నేపథ్యంలోనే తమిళనాడులో బిజెపి ఎలా బలపడిందో, అది ఇతర ప్రాంతాలకు ఏ సూచనలిస్తుందో వివరిస్తున్నారు* యస్. కృష్ణమూర్తి**

ప్రస్తుతం యుపి, పంజాబ్ తదితర రాష్ట్రాల్లో, ఆ తర్వాత తమిళనాడు మొదలైన చోట్ల ఎన్నికల హడావిడి, ప్రచారాలు ఊపందుకొన్నాయి. తెలుగు రాష్ట్రాల్లో ఎన్నికలకు ఇంకా రెండేళ్లకు పైగా టైమున్నా, రోజూ అదే వాతావరణం. ఎన్ని'కలల్లో' సం'కుల' సమరాలు అంటూ మీడియాలో నిత్యం హెడ్డింగులైనాయి. ఎన్నికలు, కాకపోతే కరోనా ఇవే రోజంతా. ప్రజల సభలకు పోరాటాలకు, వాటిని అణచే నిర్బంధకాండకు మాత్రం చోటు లేదు. కరోనా కారణంగా ఏవి మూతబడినా ఎన్నికలకు విరామం లేకుండా ఎన్నికల కమిషన్ కూడా ముందుకు సాగుతున్నది. ఈ పూర్వరంగంలో తమిళనాడు గురించిన కొన్ని విషయాల చర్చ ఇది.

యుపి తర్వాత దక్షిణాదిలో, ముందు తమిళనాడులో, తర్వాత ముఖ్యంగా తెలంగాణలో అధికారం చేజిక్కించుకోవాలని బిజెపి ముమ్మరంగా ప్రయత్నాలు సాగిస్తున్నది. దానికై కొత్తకొత్త ఎత్తులు వేస్తున్నారు. తెలంగాణ సాయుధపోరాటాన్ని, ఐలమ్మని, కొమరయ్యని, కొమరం భీముని, షోయబుల్లాఖాన్‌ని కూడా సానుకూలంగా – ఐతే 'ముస్లిం నిజాము వ్యతిరేకత'ని జోడించి–ప్రస్తావించి అమిత్ షా మాట్లాడారంటే వారి ఎత్తుగడల్ని అర్థం చేసుకోవచ్చును. తమిళనాడులోనూ అంతే : బిజెపికి అసాధ్యం అని కొందరనుకున్న ఆ రాష్ట్ర శాసనసభలో వారు గత ఎన్నికల్లో నల్గురు ఎమ్మెల్యేలతో ప్రవేశించారు. ఎత్తుగడల్లో భాగంగా వారు–శ్రీరాముడి విగ్రహాన్ని చెప్పులతో కొడుతూ ఊరేగించిన–పెరియార్‌ని కూడా కాదనటంలేదు! ఇది రెండు నాల్కల విధానంలో భాగం. నిన్నటి పెరియార్ భక్తురాలు ఖుష్బూ నేడు బీజేపీలో చేరి, మోదీస్తుతి చేస్తున్నారు. దళితనాయకుడు తిరుమావళన్ మనుధర్మవక్రీకరణ చేసారని, హిందూస్త్రీలను అవమానించారని, క్షమాపణ చెప్పాలని ఆమె, బిజెపి డిమాండ్ చేశారు. ఆ దిశలో దళితులపై హిందువులను కించపరిచారని కేసులుపెట్టి వేధిస్తున్నారు. లోగడ రెండు ద్రావిడ పార్టీలూ దళితవ్యతిరేక, బహిరంగ కులోన్మాద పీఎంకే పార్టీతో ఒప్పందాలు చేసుకున్నాయి, అధికారం పంచుకున్నాయి. తమిళనాడులో పెరియార్‌ని ఎవరు తక్కువ చేసినా సహించం అంటూనే, మరోవైపు బిజెపితో చాటుమాటు వ్యవహారం స్థానంలో బాహాటంగానే ఏడిఎంకె ఎన్నికల ఒప్పందం చేసుకున్నది. లోగడ డిఎంకే కూడా ఎన్‌డిఏలో చేరి, ప్రధాని వాజపేయి కేబినెట్లో చేరినది తెల్సిందే. హిందుత్వ విషయంలో సైతం అవకాశవాదం ఇరుపక్షాలకూ వెన్నతో పెట్టిన విద్య అని తేలిపోయింది. అయినా బ్రాహ్మణ వ్యతిరేకత, శూద్ర రాజకీయాల పేరిట పెరియార్‌ని పైకి తెస్తున్నారు. ఆయన జన్మదినాన్ని 'సామాజిక న్యాయదినం' గాజరపాలని ముఖ్యమంత్రి స్టాలిన్ ప్రతిపాదిస్తే దాన్ని బిజెపి అసెంబ్లీలో బలపరిచింది! దీనివెనుక ఉన్న రాజకీయాలేమిటి?

కమ్యూనిస్టులు కులాన్ని విస్మరించారన్న వాదం తెల్సినదే. ఆ ముసుగులో వర్గపోరాట, విప్లవ రాజకీయాల్ని తిరస్కరించే ప్రయత్నం సాగుతున్నది. తెలుగు మీడియాలో, తెలుగు మేధావుల్లో కూడా ఇది ప్రబలంగానే ఉంది. వర్గపోరాట, కమ్యూనిస్టు రాజకీయాల్ని తిరస్కరించటానికి, లేదా తగ్గించి చూపటానికి ఇలాటి వారు ప్రయత్నిస్తుంటారు. పాలకవర్గాలు, వారి యూనివర్సిటీలు, వారి మీడియా దీనికి పూర్తి ప్రోత్సాహం ఇస్తున్నాయి. బీసీల పేరిట కొందరు, 'శూద్ర రాజకీయాలకు కొత్త దృక్పథం' అంటూ కొందరు ఈ చర్చలు సాగిస్తున్నారు. అంబేద్కర్‌ని, పెరియార్‌ని కలిపి ప్రస్తావించి, వారిద్దరిదీ ఒకటే భావధార అన్నట్టుగా, ఎవరి ప్రయోజనాల్తో వారు మాట్లాడుతుంటారు. తెలుగులో అంబేద్కర్ గురించి విస్తృతంగా చర్చ ఉంది, కానీ పెరియార్ రాజకీయాల గురించి అంతగా లేదు. కొద్ది ప్రస్తావనలున్నా, వారిమధ్య తేడాల గురించి అంతగా చర్చలేదు. అది అవసరం. సైన్సు, సమాజం ఆధునికం అవుతున్నా, కుల, మతతత్వ రాజకీయాలు నానాటికీ ముదురుతున్న నేటి తరుణంలో, ప్రజల్ని ఐక్యం చేసి, ఏకోన్ముఖం చేయాల్సిన అవసరం రీత్యా ఈచర్చ అవసరం.

హిందుత్వ రాజకీయాలు, ఫాసిజమూ, దళిత హత్యాకాండ – ఇలాంటివి బిజెపి ద్వారానే కాక నేడు ఇతరత్రానూ పెరుగుతున్నాయి. ఇవి తమిళనాడు లోనూ వ్యాప్తిచెందుతున్నాయి. శూద్రులకూ ఆధ్యాత్మిక ప్రపంచంలో స్థానం కావాలని, అప్పుడే వారికి ఇండియాలో రాజకీయాధికారం లభిస్తుందనీ ఈ మధ్య ఒక సిద్ధాంతం ముందుకొచ్చింది. ఇది బిజెపి వ్యతిరేకత పేరిట రావటం విశేషం. టిఆర్ఎస్ ఆధ్వర్యంలో తెలంగాణలో యాదాద్రి, చిన్నజీయరు గారి రామానుజ కేంద్రం త్వరలోనే ప్రారంభం కానున్నాయి. ఆంధ్రలో కూడా జగన్ నాయకత్వంలో హిందూ దేవతల సేవలు బాగా పెరిగాయి. అయితే తమిళనాడులోనూ ఈ పరిణామాలు చాలాకాలంగా జరగటం అంతకన్నా విశేషం. ప్రతి చదరపు కిలో మీటరుకి ఎన్ని హిందూ గుళ్లు ఉన్నాయి అని లెక్కదీస్తే, ఈనాడు తమిళనాడు నంబర్ వన్‌గా ఉందని ఒక పరిశీలనలో వుంది అని అక్కడి ఎంపీ కార్తీ చిదంబరం చెప్పారు. అక్కడ 44,000 గుడులు ప్రభుత్వ నిర్వహణలో ఉన్నాయి. వేద పాఠశాలలతో పాటు ఆధ్యాత్మిక విద్య నేర్పుతున్నారు. పూజారులకు శిక్షణ, వేతనాలు ఇస్తున్నారు. "గుప్తరాజుల నాటి స్వర్ణయుగానికి" ఇప్పటికే ద్రవిడ పార్టీలు పునాదులు వేసాయి – ఇదంతా పెరియార్ భజన చేస్తూనే! అలాంటి భక్తులు గతంలో జయలలిత పార్టీలోనే గాక, కరుణానిధి కేబినెట్‌లో కూడా తిష్ట వేశారు.

**పెరియార్ రాజకీయ ప్రయాణంలో ముఖ్య ఘట్టాలు**

పెరియార్ పెద్దగా చదువుకోకపోయినా (ఐదేళ్ల పాటు స్కూలు విద్య), తమిళనాట భావజాల రంగంలో పెద్ద ముద్ర వేసారు. తొలి దశలో ఇంట్లో వైష్ణవ గురువుల ప్రవచనాలు ఆయనలో భక్తిభావాన్ని నాటినా, ఆయన పాతికేళ్ల వయసులో జరిపిన కాశీయాత్రలో చేదు అనుభవాలు ఆయన్ని బ్రాహ్మణ వ్యతిరేక దృక్పథం కల నాస్తికుడిగా మార్చేశాయి. 1919లో తన 40వ ఏట కాంగ్రెసులో చేరి, 1925 దాకా గాంధీతో కలిసి ప్రయాణించారు. మద్రాసు రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడిగా ఉండేవారు. 1924లో వైక్కం సత్యాగ్రహంలో పాల్గొన్నారు. కాంగ్రెసు 'బ్రాహ్మణిస్టు' పార్టీగా వారి అదుపులో ఉందని భావించి, 1925లో ఆ పార్టీని విడిచిపెట్టి, తర్వాత 'బ్రాహ్మణేతర' జస్టిస్ పార్టీలో చేరారు. 1938-44 మధ్యకాలంలో ఆయనే ఆ పార్టీ అధ్యక్షుడు. 'శూద్రుల' నాయకత్వంలోని జస్టిస్ పార్టీ పూర్వపు మద్రాసు రాష్ట్రంలో (ఆంధ్ర ప్రాంతం కూడా ఆనాడు అందులో భాగమే) 1920-37 మధ్య 17లో 13 ఏళ్లపాటు కాంగ్రెసుని ఓడించి, అధికారంలో ఉంది. నాటి ముఖ్యమంత్రులంతా 'శూద్రులే'. వారిలో తెలుగువారూ ఉన్నారు (ఉదా: బొబ్బిలి రాజా). ఆ పార్టీ నాయకులు చాలామంది జమీందారులే. ఆ రకంగా బ్రాహ్మణేతర జమీందారుల, కులీనవర్గాల పాలకవర్గ ప్రతినిధిగా ఆ పార్టీ ఉండేది. 1937లో జస్టిస్ పార్టీ ఓడిపోయి, కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడింది. 1939 నుంచి 1944 దాకా పెరియారే ఆ పార్టీ నాయకుడు. 1944 తర్వాత ఆ పార్టీని ద్రవిడ కజగం (డి.కె.) అన్న సామాజిక సంస్థగా మార్చారు పెరియార్. "ఆత్మ గౌరవ ఉద్యమం" పేరిట నడిపారు. ఆయనతో విభేదించిన కొందరు జస్టిస్ పార్టీని 1957 దాకా కొనసాగించారు. ఆ పార్టీకి ఆనాడే బ్రాహ్మణులతోనే కాక, దళితులతోనూ వైరుధ్యాలు ఏర్పడినాయి, పెరిగాయి. పాత మద్రాసు రాష్ట్రం ఇండియా నుంచి వేరే దేశంగా విడిపోవాలని పెరియార్ కోరారు. 1949లో అన్నాదురై నాయకత్వంలోని ఒక వర్గం పెరియార్ నుంచి విడిపోయి, డి.ఎం.కె. పార్టీగా ఏర్పడింది. ఆ పార్టీ పెరియార్ ద్రవిడ రాజకీయాల్నే అనుసరించినా, వేర్పాటువాదాన్ని మాత్రం 1960ల్లో వదులుకొన్నది. హిందీని రుద్దటానికి బద్ధ వ్యతిరేకత కొనసాగింది.

**పెరియార్ - కమ్యూనిస్టు వ్యతిరేకత**

పెరియార్‌లోనూ, పెరియార్ వాదుల్లోనూ కమ్యూనిస్టు వ్యతిరేకత గురించి కొంత తెల్సుకోవాలి: ఎన్నికల, కుల రాజకీయాల్లో భాగంగా 'లేటుగా వచ్చిన జబ్బు' అది. "కమ్యూనిస్టులు మానవ విలువల కోసం" నిలబడలేదని, వారికి ఓట్లు రావని భయమని చెప్పారు పెరియార్ చివరి (1973 డిసెంబరు) ఉపన్యాసంలో! భారత కమ్యూనిస్టు పార్టీ ప్రారంభ సభ 1925 అధ్యక్షోపన్యాసం ఇచ్చిన సింగరవేలు చెట్టియార్ (పెరియార్ మిత్రుడు), తొలి కమిటీలో వేలాయుధన్, కామేశ్వరరావు మద్రాసువారే. కాంగ్రెసుకి 1925లో రాజీనామా ఇచ్చిన పెరియార్ 1931-32 లో రష్యాలో చాలా నెలలు ఉన్నారు. లెనిన్ సమాధిని, స్టాలిన్ మేడే ర్యాలీని చూశారు. అక్కడి పార్టీని కలిశారు. ఆ రోజుల్లోనే కమ్యూనిస్టు మేనిఫెస్టోని, తన మిత్రుడు రామనాథన్‌తో కల్సి అనువదించారు. తిరిగి రాగానే, తిరు(శ్రీ) వంటి గౌరవవాచకాలు వద్దు, తోళర్-కామ్రేడ్ వంటి పదాలు వాడాలన్నారు. తర్వాతి మూడునెలల్లో 40 బహిరంగ సభలు పెట్టి రష్యా సోషలిజాన్ని ప్రశంసిస్తూ మాట్లాడారు. కాని బ్రిటిష్ పాలకులు కమ్యూనిస్టు పార్టీపై కుట్రకేసులకు, నిర్బంధాలకు పూనుకున్న సందర్భంలో పెరియార్ తన ప్రాధాన్యాలతో దూరంగా ఉండదలిచారు, బ్రిటిష్ ఒత్తిడితో 1935లో వెనక్కి తగ్గి ఒక ప్రకటన చేశారు. కాని చివరిదాకా రష్యా అభిమానిగానే మిగిలారు. 1949లో స్థాపించబడిన తమ పార్టీది 'నిజమైన కమ్యూనిస్టు ప్రిన్సిపుల్' అని అన్నాదురై ఆ తర్వాతా అన్నారు. డీఎమ్‌కే, ఏడీఎమ్‌కే జెండాల్లో సగం ఎరుపు, ముఖ్యమంత్రి స్టాలిన్ పేరు యాదృచ్ఛికం కాదు. ఈ కమ్యూనిస్టు ద్వేషం నిర్హేతుకం, అవాంఛనీయం. ఇది పాలకవర్గాల వాణి. ముఖ్యంగా తెలుగు నేలపై వేలాదిగా ప్రాణాలర్పించి పీడితుల కోసం నిలబడ్డది వారే. కమ్యూనిస్టుల తప్పులని విమర్శించవచ్చు కాని గుడ్డి ద్వేషం చాలా తప్పు.

**'దళితులహత్యాకాండలో తమిళనాడులో ప్రభుత్వాల పాత్ర'**

'గత రెండేళ్లలోనే 100 హత్యలు జరిగాయని, పోలీసులు కప్పిపుచ్చుతున్నారని' ఒక దళిత మేధావుల వేదిక (ఐసిడిఎ) ప్రకటించింది (ది హిందూ 2015 జూలై 6). వారు రెండురోజుల 'నిజనిర్ధారణ' పర్యటన తర్వాత ఒక నివేదికను విడుదల చేసారు. గత కొద్ది ఏళ్లలోనే 300 మంది దళితులను హత్య చేసిందీ, వాటిల్లో డజను కేసుల్లో మాత్రమే కేసులు పురోగమించిందీ ఉభయ ద్రవిడ పార్టీల పాలనలోనే, అని ఆ తర్వాత మరో రిపోర్టు... ఇవి కనీసం దశాబ్ద కాలంగా సాగుతున్నాయి.

"బ్రాహ్మణాధిపత్య భావజాలం"ని నిరసిస్తున్నట్టు చెప్పుకునే వీరి పాలనల్లో, కీలవేన్మణి మారణకాండ (1968) నుంచి నేటిదాకా దళితుల అణచివేత కొనసాగుతూనే వుంది. ఎన్నికల్లో గెలిచిన దళిత సర్పంచులను సైతం అణగదొక్కుతూ, దళితులను వేటాడి తరిమిన దుశ్చరిత్ర తమిళనాడు విశిష్టతగా తయారైంది బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమం ప్రతినిధులైన ఈ పార్టీల వల్లనే. నేటికీ వందలాది గ్రామాల్లో రెండు గ్లాసుల విధానం, ప్రభుత్వ శ్మశానాల్లో సైతం దళిత వ్యతిరేక కుల వివక్ష కొనసాగుతున్నాయని అక్కడి హైకోర్టు తీర్పుల్లో బైటపడింది.

అందుకే 'దళితులు హత్య చేయబడిన కేసుల్లో ప్రభుత్వాల అలసత్వమూ, కోర్టుల ఉదాసీనతా మనదేశంలో మామూలే. కాని తమిళనాడులో ప్రభుత్వాలు ఇలాటి హత్యాకాండలో పాలు పంచుకోటం చాలా అరుదేనని, వీటిని బైటపెట్టాలని' హక్కుల ఉద్యమనేత ఆనంద్ తెల్తుంబుడే దశాబ్దం కిందటే 2011లో పిలుపునిచ్చారు. 'ఒక పాలక పార్టీ తన రాజకీయ ప్రణాళికలో భాగంగా ఇలాటి మారణకాండను బాహాటంగా సాగించటం అరుదే కానీ, బట్టబయలు చేయాల్సిన వాస్తవం' అన్నారాయన. ఒక నిజనిర్ధారణ కమిటీ నివేదిక సందర్భంగా ఆయన ఆధారాలతో ఈ మాటచెప్పారు. (కౌంటర్ కరెంట్స్, 2011 అక్టోబరు 30). 'ఆత్మగౌరవ భూమిలో పరువు హత్యల' పై కౌంటర్ కరెంట్స్ ఆన్‌లైన్ మేగజీన్ డిసెంబరు 6, 2021 వ్యాసం చూడండి). ఇటీవలి లాక్ డౌన్ కాలంలో - అన్నా డీఎంకే హయాంలో- ఇలాటి దౌర్జన్యాలు ఐదు రెట్లు పెరిగిపోయాయని దళిత సంఘాలు కొన్ని వివరాలు ప్రకటించాయి.

కొంగు వెల్లాల గౌండర్లనే ఓబీసి కులానికి చెందిన విద్యావంతుడైన యువరాజ్ యువకుల గుంపుతో ఒక మాఫియా బృందాన్ని ఏర్పరిచి, తమ కులంలో కులాంతర పెళ్లిళ్లకు వ్యతిరేకంగా బాహాటంగా క్యాంపేన్

చేస్తున్నాడని, ప్రత్యేకించి దళితవ్యతిరేక గూండాగిరీ చేస్తున్నారని 'దళిత మేధావుల వేదిక రిపోర్టు'లో ఆరోపించారు. ఈ 'యువరాజు' బృందం క్యాంపేన్ గురించి 2012 లోనే వార్తలు వెలువడ్డాయి (ఉదా.కి ది హిందూ నామక్కల్ నుంచి జూలై 16, 2012). పియంకె రామదాసుతో ఉత్తేజితుడైన ఇతను తిరుచెంగోడు ప్రాంతంలో ఒక 'కుల మాఫియా'ని ఏర్పరిచి స్వైర విహారం చేశాడు. ఆ రోజుల్లోనే ధర్మపురి ప్రాంతంలో ఇలవరసన్ అన్న దళిత యువకుడి హత్య పెద్ద కలకలం రేపింది. అదే తరహాలో మరో హత్య ఇంజనీరింగు పట్టభద్రుడు గోకుల్ రాజు (తన క్లాస్ మేట్ స్వాతితో కొన్నేళ్ల పరిచయం తర్వాత పెళ్లి చేసుకున్నాడు). గోకుల్ రాజు మృతదేహాన్ని సేలం వద్ద రైల్వే పట్టాలపై పడేసి, 'యువరాజు' అలాటి జంటలకు హెచ్చరిక చేశాడు. ఆ కుటుంబమే కాక ఇలాంటి వారంతా కులాంతర పెళ్లిళ్లకు వ్యతిరేకంగా ఈ మాఫియా సహాయాన్నే కోరారు. పోలీసుల ప్రోత్సాహ సహకారాలున్నాయని గోకుల్ రాజ్ హత్య ఉదంతంలో బహిరంగమైంది.

పెరుమాళ్ మురుగన్ అన్న ప్రఖ్యాత రచయిత రచనారంగం నుంచి నిష్క్రమించటం దేశవ్యాప్త కలకలానికి దారితీసింది తెల్సిందే. దానివెనుక ఈ మాఫియా హస్తమే ఉందని తమిళ సోషల్ మీడియాలో బహిరంగ రహస్యమైంది. మదురైకిచెందిన దళిత రచయిత స్టాలిన్ రాజంగం ఈ మాఫియా పాత్రను వెల్లడించారు (ఇండియా టుడే 2015 జూలై 7). ఇండియన్ ఎక్స్‌ప్రెస్ (డిసెంబరు6, 2020) కూడా ఈ లింకుని ప్రస్తావించింది.

అలా వ్యవహరిస్తున్న మరో బృందం వన్నియార్లు. తమ కులం యువతులను 'ఆకర్షించిన' దళిత యువకులను శిక్షించాలని, అలాటి యువకుల కాళ్లూ చేతులూ తెగ నరికి బుద్ధి చెప్పాలని వన్నియార్ల నాయకుడు, మాజీ ఎంఎల్ఏ జె. గురు లోగడ పిలుపునిచ్చారు. వేయి మంది వన్నియార్ మూకలు దళిత వాడలపై దాడులు నిర్వహించి, వందలాది ఇళ్లు తగులబెట్టారు (ఉదాహరణకి 2012లో). ఇలాంటి దహనాలు అనేకం జరిగాయి. ఆ నాయకుడినే పరోక్షంగా 'జై భీమ్' సినిమాలో అవమాన పరిచారని పిఎంకె వారి ఆరోపణ! హిందుత్వ గుంపుల 'లవ్ జిహాద్' వంటిదే తమిళనాడులో బాహాటంగా సాగుతున్నది. కానీ అది మీడియాలో రాకుండా అక్కడి పాలక వర్గాలు చూస్తున్నాయి. ఫూలే, అంబేద్కరు, పెరియార్‌లను ఆరాధించే తెలుగు ప్రాంతాల్లోని 'ఉద్యమ'కారులు వీటిపట్ల మౌనం దాల్చటం గమనార్హం. అయినా ఓట్లుమావి, సీట్లుమీవా అంటూ ప్రజల్ని కులరాజకీయాల్తో చీల్చి, పక్కదారి పట్టించి, దోపిడివర్గాలు తమ పీడనను కొనసాగిస్తున్నాయి.

**అంబేద్కర్–పెరియార్ : కుల వ్యవస్థ గురించి భిన్నమైన దృక్పథాలు**

చాలామంది పైపై పరిశీలనతో కుల వ్యవస్థ విషయంలో అంబేద్కర్‌నీ, పెరియార్‌నీ కలిపి చెప్తుంటారు. కాని వారి మధ్య పోలికలకన్నా తేడాలే ఎక్కువ. అంబేద్కర్, పెరియార్ ఇద్దరూ సంస్కరణవాదులే, రాజకీయులే అయినా, అంబేద్కర్ ఆధునిక విద్య, విజ్ఞానం, అనేక విషయాల్లో అపారమైన స్కాలర్‌షిప్ కలవారు. కుల వ్యవస్థ గురించి తన థీసిస్‌లో: "శాస్త్ర విజ్ఞానంలో సెంటిమెంట్‌ని బహిష్కరించాలి. దేనినైనా వస్తుగత దృక్కోణంతోనే నిర్ధారించాలి. విషయ పరిశీలనలో ఏదో ఒక మొగ్గ (బయాస్) లేకుండా జాగ్రత్త వహించాలి" అని అంబేద్కర్ నొక్కిచెప్పారు. ఈ సూత్రాన్ని ఇటీవలి కాలంలో విస్మరిస్తున్నారు. ఓట్ల రాజకీయాలు నేటి పరిశోధనలను నిర్ణయిస్తున్నాయి.

కుల వ్యవస్థను మనువు, బ్రాహ్మణులు ఉద్దేశపూర్వకంగా సృష్టించారని పెరియార్ చెప్తారు. ఆయన ప్రచారం, కార్యక్రమం దానికి అనుగుణంగానే ఉన్నాయి. ఇవి బహుళ ప్రచారంలో ఉన్నాయి. కాని అంబేద్కర్ ఇలా అంటారు:

"మనువు అన్నవాడు ఉండి ఉంటే, ఆయన కులవ్యవస్థని సృష్టించాడన్న కథనాన్ని నమ్మితే, ఆయన చాలా సాహసవంతుడేనని చెప్పాలి. కులసూత్రాన్ని ఎవరో ఒకరు నిర్దేశించారంటే అది అనూహ్యం. మనువు కులధర్మాన్ని (లా ఆఫ్ క్యాస్ట్) ఇవ్వలేదని, ఇవ్వగలిగేవాడూ కాదని నేను నొక్కి చెప్పదలిచాను. మనువుకన్నా చాలాముందే కులం ఉండేది. ఆయన దాన్ని బలపరిచాడు, తాత్వీకరించాడు. అంతేకానీ, ఆయనే నేటి హిందూ సమాజాన్ని నిర్దేశించాడనటం (ఆర్డెయిన్) సరికాదు. అప్పటికే ఉన్న కుల నిబంధనలని ఒక సంహితగా "కోడిఫై" చేసి, కులధర్మాన్ని ప్రచారం చేయటంతో ఆయన పని ముగిసింది..."

"కులవ్యవస్థ వ్యాప్తి, అభివృద్ధి చాలా బృహత్తరమైనవి. దానిని ఏ ఒక్క వ్యక్తో, లేదా ఏదో ఒక వర్గమో సృష్టించటం సాధ్యంకాని పని. కులాన్ని బ్రాహ్మణులు సృష్టించారన్న వాదన కూడా ఇలాటి వాదనే. మనువు గురించి పైన చెప్పినదాని తర్వాత, ఇక అదనంగా చెప్పాల్సిన అవసరమే లేదు, ఒక్క విషయాన్ని ఎత్తి చూపటం తప్ప: "పై భావన ఆలోచనపరంగా తప్పు. ఉద్దేశ్యాల రీత్యా చూస్తే దురుద్దేశపూరితమైనది అంటారు అంబేద్కర్. "బ్రాహ్మణులు చాలా దుశ్చర్యలకు పాల్పడి ఉండవచ్చును. అలా చేశారని నేను ధైర్యంగా చెప్పగలను. కానీ బ్రాహ్మణేతర జనాభాపై కులవ్యవస్థని వారే రుద్దారు అని చెప్పడం సరికాదు. అది వారి శక్తికి మించిన పని. తమ శుష్కతత్వంతో ఈ క్రమానికి వారు దోహదం చేసి ఉండవచ్చును. కానీ ఈ పథకాన్ని వారే ఆవిష్కరించారనటం – కచ్చితంగా సాధ్యంకానిపని. తాము అనుకున్న రీతిలో ఎవరైనా ఒక సమాజాన్ని రూపుదిద్దటం అద్భుతం! ఇది జరగని పని."

కొలంబియా యూనివర్సిటీలో 1916 మే 9 నాడు అంబేద్కర్ సమర్పించిన ప్రసిద్ధ సిద్ధాంతపత్రంలోని వాక్యాలివి. "భారతదేశంలో కులాలు: వాటి మెకానిజం, పుట్టుక, అభివృద్ధి" శీర్షికతో యాంత్రపాలజీ సెమినారులో సమర్పించిన సిద్ధాంతపత్రం ఇది. 47పేరాలుగా రచించిన ఆయన తొలి ప్రామాణిక రచన ఇది. అలాగని ఈ వ్యాసంలోని భావాలను ఆయన తర్వాతికాలంలో మార్చుకున్నారని భావిస్తే అది పొరపాటే. "కులనిర్మూలన"(1936) అన్న ప్రసిద్ధరచనని 1944లో మూడో ఎడిషన్లో ఆయనే మళ్లీ ప్రచురించారు. అందులో పై థీసిస్‌ని మార్చకుండా యథాతథంగా చేర్చారు. తర్వాతికాలంలోనూ మార్చుకోలేదు. కులసమస్యపై అందరూ తరచుగా కోట్ చేసే భాగాలు కొన్ని ఈ వ్యాసంలోనివే.

మనుధర్మాన్ని, భగవత్ గీతని అంగీకరించని ముస్లిముల్లో కూడా అంతరాలు, 100కి పైగా కులాలున్నట్టు, 'అంటరానివారు' కూడా (పస్మండాలు) ఉన్నట్టు మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్, బీహారుల్లో అనేక పరిశోధనలు చూపెట్టాయి. కులం ఆధారంగా తమకూ రిజర్వేషన్లు కావాలన్న డిమాండ్లను కొన్ని (ఉదా. ప్రత్యేకించి దక్షిణాదిలో, బీజేపీ

పాలిత రాష్ట్రాల్లో సైతం) రాష్ట్రాల్లో అంగీకరించి, అమలు చేయటమూ మనకి తెల్సిందే.

"కులవ్యవస్థని, కులాలని శాస్త్రనిర్మితమైనవిగా, శాస్త్ర సమ్మతమైనవిగా, ధర్మబద్ధమైనవిగా సనాతన హిందువులు భావిస్తుంటారు. 'ఆ కారణంగా అవి తప్పు కావు, కాజాలవ'ని నమ్ముతుంటారు. దీనికి విరుద్ధంగా నేను చాలా గట్టిగా వాదించాను. మతాలు శాస్త్ర పునాదిపై ఉంటాయని నమ్మి అలా చెప్పలేదు. కులం పుట్టుక – ఎవరో, ఏ పరమాత్ముడో ఆదేశిస్తే ఏర్పడినదా? లేక మానవ సమాజ జీవనంలో కొన్ని ప్రత్యేక పరిస్థితులలో అచేతనంగా ఏర్పడిన పెరుగుదలా దీని గురించి చాలా వివాదమే సాగింది. ఈ రెండో అభిప్రాయానికి దోహదంచేసే అభిప్రాయాలు నా ఈ పత్రంలో కన్పిస్తాయి... ధర్మ ప్రవచనాలు, ప్రచారమూ కుల వ్యవస్థని రూపొందించ లేదు. ప్రచారాలతో ఆ వ్యవస్థ రద్దూ సాధ్యం కాదు. కులవ్యవస్థ మత సమ్మతమూ, శాస్త్రీయమూ అని నమ్మించే వైఖరి తప్పు అని చెప్పటమే నా లక్ష్యం అన్నారాయన.

కుల వ్యవస్థను బలపరిచేవారే కాక వ్యతిరేకిస్తున్నాం అనుకునేవారూ అలాగే ("శాస్త్రసమ్మతమైనవి"గా) భావిస్తున్నారన్నది గమనార్హమైన ముఖ్య విషయం. తాము అంగీకరించకపోయినా, 'బ్రాహ్మణులు రుద్దిన మనుధర్మమే ఈ వ్యవస్థను సృష్టించింది' అనటం అంటే దానర్థం అదే.

మనుధర్మ శాస్త్రం ప్రతులని అంబేద్కర్ 1927 డిసెంబర్ 25నాడు తగలబెట్టిన సంఘటన ప్రసిద్ధమే. మహద్ చెరువులో నీటికోసం దళితుల పోరాటం (1927 మార్చి19–20) కొనసాగింపుగానే ఈ "ప్రతీకాత్మిక" (సింబాలిక్) కార్యక్రమాన్ని ఆయన చేపట్టారు. ఆరోజు ఆ దహనం తనకి సన్నిహితుడైన బ్రాహ్మణమిత్రుడు సహస్రబుద్ధే చేతులమీదుగా జరిపించారు అంబేద్కర్. ఆయన అవగాహనకి ప్రతిరూపమే ఈ కార్యం అని భావించవచ్చును.

పెరియార్‌ది ద్రవిడ జాతి సిద్ధాంతం. కులాన్ని ఆర్యులతో ముడిపెట్టి, చెప్తుంటారు. దీన్ని అంబేద్కర్ కొట్టిపారేశారు. "ఒక కుటుంబం, లేదా తెగ ఆర్యజాతియా, ద్రవిడ జాతియా? అన్నదాన్ని – "విదేశీ మేధావులు వచ్చి విభజన రేఖ గీసిందాకా" ప్రజలు పట్టించుకోలేదు, అని రాసారు. ప్రజల్లో ఉన్న తేడాలని చూపెట్టి, వాటిని కులం పుట్టుకతో ముడిపెట్టటాన్ని అంబేద్కర్ వ్యతిరేకించారు.

**రాజకీయాల్లో వేరు దారులు**

దళితులకు ఆర్థిక, రాజకీయ, సామాజిక సమానత, సమాన అవకాశాలు కల్పించాలన్నది అంబేద్కర్ ప్రధాన లక్ష్యం, కార్యక్రమం. కొద్దిమంది దళిత కులీనవర్గాలకు తప్ప, దళిత జనబాహుళ్యానికి అది నేటికీ చాలావరకు మిగిలిపోయిన కర్తవ్యంగానే ఉన్నది. పాలకవర్గ శక్తులు అంబేద్కర్‌ని చివరికి రాజ్యాంగ సభకు కూడా స్వంత బలంతో, స్వరాష్ట్రంలో ఎన్నికల్లో గెలవనీయలేదు. 1951–52 తర్వాత, తొలిసారిగా వయోజన ఓటింగ్ ఆధారంగా జరిగిన ఎన్నికల్లోనూ, 1954 ఉప ఎన్నికలోనూ కూడా రిజర్వుడు సీటులోనే ఓడించారు. ఎన్నికల్లో రిజర్వుడు సీటులోనే తాను ఓటమి పాలవటాన్ని చవిచూసిన ఆయన కేంద్ర, రాష్ట్ర శాసన సభలకు రిజర్వేషన్‌ని రద్దుచేయాలని చెపుతూ 1955 డిసెంబర్ 27 నాడు ఉపన్యసించారు. 'వాటి ప్రయోజనకాలం ముగిసిందనీ, నిష్ఫలమనీ' భావించి, యస్‌సి ఫెడరేషన్ మహా సభలోనే తీర్మానం చేయించారు. (ఈ విషయాన్ని ఎవరూ –రిజర్వేషన్ వ్యతిరేకులుకూడా – పెద్దగా చెప్పరు. అందరికీ ఓటుబ్యాంకు రాజకీయాలు కావల్సినవే). ఆ పూర్వరంగంలోనే తానే స్థాపించిన యస్ సి ఫెడరేషనుని (ఆ పార్టీ అభ్యర్థిగానే పోటీ చేసి ఓడారు) రద్దుచేయటానికి, కులప్రాతిపదికపై కాని రిపబ్లిక్ పార్టీ స్థాపనకు నిర్ణయించి 1956 సెప్టెంబరు 30న ప్రకటించారు. (1956 డిసెంబరు 6న 65 సంవత్సరాల వయసులో చనిపోయారు.) 1990 దాకా – కాంగ్రెసేతర పార్టీలు తమ అవసరం కోసం తలపెట్టిందాకా – అంబేద్కర్ రచనల్ని ప్రచురించటానికి కూడా పాలకవర్గ శక్తులు సిద్ధం కాలేదు.

కాగా బ్రాహ్మణ వ్యతిరేక దృక్పథంతో, 'శూద్రులకు అధికారం కావాలన్న'ది పెరియార్ లక్ష్యం. 20వ శతాబ్ది తొలిభాగంలో నాటి మద్రాసు రాష్ట్రంలో అన్ని రంగాల్లో, పదవుల్లో బ్రాహ్మణ ఆధిక్యత ఉన్న పరిస్థితుల్లో పెరియార్ చేసిన ప్రతిపాదనలవి. మద్రాసులో బ్రాహ్మణుల ప్రాభవం రాజాజీతోనే 1954 తర్వాత –అంతరించిపోయింది. తర్వాత వచ్చిన నాయకులు అంతా బ్రాహ్మణేతరులే: కామరాజ నాడార్ మద్రాసు ముఖ్యమంత్రిగా 1954 నుంచి 1963 దాకా దాదాపు పదేళ్లు కొనసాగారు. ఆ తర్వాత ఆయన నాలుగేళ్లపాటు (1964–67) కాంగ్రెసు అధ్యక్షుడిగా కొనసాగారు. కామరాజు తర్వాత, భక్తవత్సలం చివరి కాంగ్రెసు ముఖ్యమంత్రిగా చేసారు. తర్వాత నేటివరకూ బ్రాహ్మణేతర పార్టీలదే పైచేయి. ఆ పరిస్థితి పోయినా పెరియార్ ఉద్యమం, వారి వారసుల పార్టీ కులం చుట్టూరానే తిరుగుతూ వచ్చింది. ద్రవిడ రాజకీయ శక్తులు కులతత్వాన్ని, ముఖ్యంగా దళిత వ్యతిరేకతత్వాన్ని బాహాటంగా ప్రదర్శించటం మనం కళ్లారా చూస్తున్నాము. ఇది ఈనాటిదికాదు.

డి.ఎమ్.కె. పక్షాన మొదటిసారిగా 1957లో గెల్చిన 15 మంది ఎమ్మెల్యేలూ, 1962లో గెల్చిన 50మందిలో 35 మందీ వన్నియార్లేనని, ఎం.జి.ఆర్. తర్వాతి కాలంలో 1989 లో గెల్చిన వారిలో మూడింట రెండువంతుల మందీ వన్నియార్ బెల్టునుంచేనని ఎన్నికల విశ్లేషణలు చూపెట్టాయి. ఈ స్థితిలో పి.ఎమ్.కె. రామదాసు వన్నియార్ల 'ఆత్మగౌరవం' కార్డు ప్రయోగించి, అన్నా డిఎమ్‌కే కూటమిలో చేరి, 1998లో పోటీచేసిన 5 సీట్లలో నాలుగింటి పార్లమెంటు సీట్లు గెలిచారు. నాటినుండి వన్నియార్ల ఓట్ల కోసం దళిత వ్యతిరేక రాజకీయాలు చేస్తున్న పి.ఎమ్.కె.ని ఆకట్టుకోవటానికి డిఎమ్‌కే– అన్నా డిఎమ్‌కేలు పోటీపడుతున్నాయి. కాగా దళిత వ్యతిరేక రాజకీయాలు చేస్తున్న పిఎమ్‌కె నుంచి ఆ పార్టీ ప్రధాన కార్యదర్శి దళిత ఎళిమలై (వాజపేయీ మంత్రివర్గ సభ్యుడు) బయటికి వెళ్లి, అన్నా డిఎమ్‌కేలో కలిశారు.

ఈనాడు ద్రవిడ పార్టీ అన్నా డిఎమ్‌కె సాయంతోనే బిజెపి తమిళనాడులో అడుగు పెట్టింది. దళిత వ్యతిరేక పిఎమ్‌కెకి గౌరవం దక్కింది. నేటి అవకాశవాద,ఎన్నికల రాజకీయాల్లో చైనా గోడలేమీలేవు. ఆత్మగౌరవ ఉద్యమంలో గౌరవమేమీ మిగల్లేదు. పీడితులకు వీరెవ్వరూ మిత్రులు కారు.

(రచయిత సామాజిక కార్యకర్త)

(మిత్రుల సహకారంతో రాసిన వ్యాసమిది. కృతజ్ఞతలు.)

వీ

# శాస్త్రీయ శ్రామిక వర్గ మౌలిక సిద్ధాంతం

**యు. ఎ. ఖారిన్** *రచించిన 'ఫండమెంటల్స్ ఆఫ్ డయలెక్టిక్స్' పుస్తకం లోని రెండవ అధ్యాయం లో నాలుగవ ఉపశీర్షిక : అనువాదం - రాజేంద్ర బాబు అర్విణి*

గతితార్కిక, చారిత్రిక భౌతికవాదం రూపుదిద్దుకోవడంతో తత్వశాస్త్రం ఒక సైన్స్‌గా మారింది. ఇదివరకే మనం గమనించినట్టుగా మార్క్సిస్టు సిద్ధాంతం కంటే ముందు ఆవిర్భవించిన తత్వశాస్త్రం కూడా శాస్త్రీయ పరిజ్ఞానంతో ముడివడి ఉన్నది. కాని, భౌతికవాదానికి ముందు వెలుగులోకి వచ్చిన సిద్ధాంతాలు ఒక స్థిరమయిన అభిప్రాయం వ్యక్త పరచకుండా అధిభౌతిక లక్షణాలకు పరిమితం అయి ఉండినవి. భావవాదాన్ని నమ్మిన కొంతమంది తత్వవేత్తలు ప్రతిపాదించిన సిద్ధాంతాలలో కొన్ని అనుకూల అంశాలు ఉన్నప్పటికీ ప్రముఖంగా భావవాదం వాస్తవాన్ని వక్రీకరించే ప్రయత్నమే చేసింది.

ఏది ఏమైనప్పటికి, మార్క్స్ సిద్ధాంతానికి ముందు వచ్చిన సిద్ధాంతాలు ప్రత్యేక శాస్త్రాలతో తమ సంబంధాన్ని ఏక పక్షంగానే కొనసాగించాయి. తత్వశాస్త్ర అంతస్సారం, ప్రత్యేక శాస్త్రాలలోని విషయ సంగ్రహంలలోని భిన్నత్వం ఏమిటో స్పష్టత లేదు. హెగెల్ వంటి సిద్ధాంతకర్తలు అన్నింటిని ఆలింగనం చేసుకొనే పద్ధతిని ప్రవేశ పెట్టగా, మార్క్సిజం తత్వశాస్త్రం అంతస్సారాన్ని సరికొత్త పద్ధతిలో నిర్వచించింది.

భౌతిక శాస్త్రం, రసాయన శాస్త్రం, జీవశాస్త్రం, చరిత్ర, న్యాయ శాస్త్రం, గణితం మొదలైనవి వాస్తవ ప్రపంచంలోని విభిన్న అంశాలకు సంబంధించిన నియమాలు, దృగ్విషయాల గురించి అధ్యయనం చేసే పనికి పూనుకుంటాయి. వాటివలె కాక గతితార్కిక భౌతికవాదం చైతన్యానికి వస్తువుకు మధ్య ఉండే సంబంధాన్ని గురించి శాస్త్రీయమైన అవగాహనను కల్పిస్తుంది; పదార్థ సాధారణ లక్షణాలను తెలియపరుస్తుంది; దాని పరిణామ దశలలోని ప్రాథమిక సూత్రాలను గురించి అధ్యయనం చేస్తుంది; దానికి సంబంధించి మానవుడు గ్రహించగలిగే వాస్తవాల రూపాలను, పద్ధతులను గురించి పరిశీలిస్తుంది; సంఘ అభివృద్ధికి కారణమయిన ప్రాథమిక ప్రేరణ శక్తిని కచ్చితమైన రీతిలో ఎత్తి చూపుతుంది.

క్లుప్తంగా చెప్పాలంటే, మానవుని ఆలోచనల గురించి, సంఘ పురోగతి, ప్రకృతిలో సంభవించే పరిణామాల గురించిన సాధారణ నియమాలను గతితార్కిక భౌతికవాదం అధ్యయనం చేస్తుంది. చారిత్రిక అనుభవాలు, మానవ జాతి ఏ రకమయిన ఆచరణ అవలంబించిందో అధ్యయనం చేసి వాటిని సాధారణీకరించి, సామాన్య శాస్త్రాలలో, సామాజిక శాస్త్రాలలో నూతన ఆవిష్కరణలను ఆధారం చేసుకొని మార్క్సిస్టు తత్వశాస్త్రం ఆ సాధారణ నియమాలను పరిశీలిస్తుంది.

గతితార్కిక భౌతిక వాదపు శాస్త్రీయమయిన ఆలోచనా పద్ధతి ఏమాత్రం తొట్రుపాటు పడకుండా ఒక పక్షం వహిస్తుంది. మార్క్సిస్టు తత్వశాస్త్రం నిరంతరం గతితార్కిక భౌతిక కారణాలను విశ్లేషిస్తుంది. ఇది అన్ని రకాల భావవాద, అధిభౌతికవాద సిద్ధాంతాలను ఖండిస్తుంది. శ్రామికవర్గ ప్రాపంచిక దృక్పథం, సామాజిక స్పృహను వ్యక్తపరిచే గతితార్కిక చారిత్రిక భౌతికవాదం కమ్యూనిస్టు సిద్ధాంతానికి సైద్ధాంతిక ప్రాతిపదిక. ఏ సిద్ధాంతమైనా వర్గ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని వాస్తవాలపై వెలుగును ప్రసరింపజేస్తుంది. శ్రామిక వర్గానికి చెందిన ప్రాథమిక ఆసక్తులు సామాజిక ప్రగతికి సంబంధించిన పోకడలను నిర్దేశించే అంశాలకు అనుగుణంగా ఉంటాయి కాబట్టి కార్మిక వర్గ సిద్ధాంతానికి శాస్త్రీయమయిన లక్షణాలు ఉంటాయన్నది వాస్తవం. ఆ పోకడలను, లక్షణాలను మార్క్సిస్టు తత్వం వెలుగులోకి తెస్తుంది కాబట్టి, ప్రపంచం విప్లవాత్మకంగా మార్పు చెందడంలో అది సైద్ధాంతిక ఆయుధంగా ఉపయోగపడుతుంది.

'రాజ్యం చేత, పాలక వర్గాల చేత అణిచివేతకు గురిచేయబడ్డ శ్రామికుల తరపున తీవ్రంగా ఆలోచించడం మాత్రమే కాదు, మెరుగైన సామాజిక సమీకరణల కోసం పోరాటం అవసరమని వారు భావించారు' అని మార్క్స్, ఎంగెల్స్‌ల గురించి రాస్తూ లెనిన్ అన్నాడు.

మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతం మానవతావాదాన్ని పట్టించుకోదని, 'మానవునికి' సంబంధించిన సమస్యల పట్ల ఉదాసీనంగా ఉంటుందని తరుచుగా విమర్శలు చేస్తూ ఉంటారు. అట్టి విమర్శలు ఆధార రహితమయినవి. మానవ అస్తిత్వాన్ని గురించిన, మానవుని ఉనికి గురించిన సాధారణ సూత్రాలపైనే ఎక్కువ కేంద్రీకరించి 'మనిషి'ని తత్వశాస్త్ర పరిధి నుంచి మినహాయిస్తారని గతితార్కిక భౌతిక వాదాన్ని సమర్థించే వారిని కొందరు విమర్శిస్తారు. భారతీయ తత్వశాస్త్రం మానవుని ఉనికి, మానవ జీవితానికి అర్థం మొదలైన వాటిని గురించి చర్చిస్తుంది కాబట్టి అది మార్క్సిజం వైపు కాకుండా బూర్జువా సిద్ధాంతమైన అస్తిత్వవాదం వైపే ఎక్కువ మొగ్గు చూపిస్తుందని కొంతమంది వాదిస్తారు.

అయితే, ఈ భావవాద సిద్ధాంతం మనిషి ఎదుర్కొంటున్న సమస్యలకు పరిష్కారం కనుగొనలేక పోయింది. అలాగే పెట్టుబడిదారీ వ్యవస్థ మనిషి జీవితంలో సృష్టించిన క్లిష్ట పరిస్థితులను దూరం చెయ్యడానికి సరి అయిన పరిష్కార మార్గాలను సూచించలేక పోయింది. మానవుడు ఎదుర్కొంటున్న సమస్యలకు అన్ని కోణాల నుండి యథార్థంగా శాస్త్రీయమైన వివరణ కేవలం గతితార్కిక భౌతికవాద సిద్ధాంతం మాత్రమే ఇవ్వగలుగుతుంది. మార్క్సిస్టు లెనినిస్ట్ సిద్ధాంతం 'మనిషి'ని గురించి పట్టించుకోదని వాదించడం సరి అయినది కాదు. నిజానికి అది 'మనిషి'ని ఉన్నతీకరిస్తుంది; అది, మనిషి సరైన రీతిలో ప్రపంచాన్ని

# చిలే రాజకీయ పరిణామాలు

*చిలేలో అధ్యక్షుడిగా ఎన్నికైన బోరిక్ కు పాలన పరంగా మితవాద పార్టీలతో పాటు సామ్రాజ్యవాద శక్తులతో సమస్యలుంటాయని, వీటిని ప్రజా చైతన్యంతో ఎదుర్కోవాలని అంటున్నారు* **ఎ. నర్సింహారెడ్డి**

దక్షిణ అమెరికా దేశమైన చిలేలో గత డిసెంబర్ 19న జరిగిన అధ్యక్ష ఎన్నికలు ఈసారి ప్రపంచదేశాల దృష్టిని ఆకర్షించాయి. దశాబ్దాల తరబడి మిలిటరీ పాలనలో మగ్గిన ప్రజలు ఆర్థిక వ్యవస్థ తిరోగమనం వంటి వాటితో విసిగిపోయారు. దీనితో ప్రభుత్వంపై వ్యతిరేకత పెరగడంతో పాటు వామపక్ష పాలనవైపు ఓటర్లు మొగ్గు చూపించారు. చిలే అధ్యక్ష ఎన్నికల్లో అత్యంత పిన్నవయస్కుడైన విద్యార్థి నేత 35 ఏళ్ల గాబ్రియేల్ బోరిక్ దేశ అధ్యక్షుడుగా ఎన్నికవడంతో నవశకానికి నాంది ప్రస్తావన జరిగింది. అలనాటి అయెండీ (అలెండీ) తాత్వికత ప్రజల్లో సజీవంగా ఉన్నదని, సామ్రాజ్యవాదులకు ఈ విజయం చెంపపెట్టని వామపక్ష వాదులు సంతోషిస్తున్నారు. ఎల్‌సాల్వడార్ దేశాధ్యక్షులుగా 2019లో బాధ్యతలు చేపట్టిన యువకుడు నాయిబ్ బుకెలే తర్వాత అత్యంత యువకుడైన దేశాధ్యక్షుడు బోరిక్ పేరు లాటిన్ అమెరికాలో మారు మోగిపోతోంది. ఇప్పుడు ఆయన ప్రభుత్వం ఎలాంటి పాలన చేస్తుందో, ఎలాంటి సంస్కరణలు దేశంలో తీసుకువస్తుందో అని యావత్ లాటిన్ అమెరికా బోరిక్‌నే ఆసక్తిగా గమనిస్తోంది.

యువకుడు, అనుభవంలేని బోరిక్‌ను ఎన్నుకుంటే లాటిన్ అమెరికాలోనే అత్యంత సుస్థిరమైన, అభివృద్ధికరమైన ఆర్థికవ్యవస్థ దెబ్బ తింటుందని ప్రత్యర్థులు ఎంతగా ప్రచారం చేసినా ఫలితం లేకపోయింది. ప్రజలు గాబ్రియేల్‌కే పట్టం గట్టారు. బోరిక్ గెలుపుతో చిలే రాజధాని శాంటియాగోలో అభిమానుల సంబరాలు మిన్నంటాయి. లాటిన్ అమెరికాలో అత్యంత ధనిక దేశంగా భాసిల్లుతున్న చిలేలో ప్రజలు ఆర్థిక విధి విధానాలపై విసుగెత్తిపోయారని ఈ ఎన్నికలు రుజువు చేశాయి. ఆంటోనియా కాస్ట్ విధానాలతో విసిగిపోయిన జనం బోరిక్‌కు పట్టంకట్టారు. అంతేకాకుండా మిలిటరీ పాలనకు మద్దతుగా కాస్ట్ చేసిన వ్యాఖ్యలు ప్రజల్లో అసహనం పెంచాయి. చిలే యూనివర్సిటీ విద్యార్థినేతగా బోరిక్‌కు మంచి పేరుంది. ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిగిన నిరసనలకు ఆయన మద్దతిస్తూ వచ్చాడు.

దేశంలో ప్రైవేటుమయమైన విద్యావిధానాన్ని సంస్కరించడానికి, ప్రజలకు మేలైన విద్య అందించడానికి 2011-13 మధ్య చిలే దక్షిణ ప్రాంతంలోని మగల్లాన్స్ ఏరియాలో జరిగిన విద్యార్థి ఉద్యమానికి నాయకత్వం వహించడం ద్వారా బోరిక్ వెలుగులోకి వచ్చారు. 2013, 2017 సంవత్సరాల్లో చిలే పార్లమెంటు దిగువ(డిప్యూటీస్) సభకు ఎన్నికయ్యారు. గత డిసెంబర్ 19న జరిగిన ఎన్నికల్లో దేశాధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు. నవంబర్ 21న జరిగిన మొదటి రౌండ్ ఎన్నికలలో సంప్రదాయవాద కాస్ట్‌కు కాస్తంత ఎక్కువ పాయింట్లు వచ్చాయి. అయితే, డిసెంబర్ 19 నాటి తుది రౌండ్‌లో విశేష జనాదరణతో బోరిక్ తిరుగులేని ఆధిక్యం కనబరిచారు. అధికారిక గణాంకాల ప్రకారం బోరిక్‌కు 56 శాతం ఓట్లు రాగా, ఆయన ప్రత్యర్థి కాస్ట్‌కు 44 శాతం ఓట్లు వచ్చాయి. మార్చి 11న అధ్యక్ష బాధ్యత స్వీకరించనున్నారు.

పారిశ్రామికంగా మెరుగ్గా ఉన్న చిలేలో అధికశాతం ప్రజలకు మేలు చేసే హామీలను బోరిక్ ఇచ్చాడు. కార్మికులకు, సాధారణ ప్రజలకు పెన్షన్, ఆరోగ్య రంగాన్ని ప్రక్షాళించడం, పనిగంటలను తగ్గించడం, పౌరహక్కుల పరిరక్షణ, పర్యావరణ అనుకూల పెట్టుబడులు ఇత్యాది హామీలను జనం విశ్వసించారు. దేశంలో పడిపోతున్న జీవన ప్రమాణాలు, పెరిగిపోతున్న ఆర్థిక అసమానతలు తొలగించి సమానత్వాన్ని పెంపొందిస్తానని చేసిన హామీలతో ఎన్నికల గోదాలోకి దిగిన బోరిక్ అక్కడి ప్రజలను ఆకర్షించాడు.

---

అర్థం చేసుకోవడానికి, దానిని విప్లవాత్మకమైన పద్ధతిలో మార్చడానికి లెక్కలేనన్ని మార్గాలను విశదీకరిస్తుంది. నిజానికి ముఖ్యమైన విషయమేమిటంటే, గతితార్కిక, చారిత్రిక భౌతికవాదం నిజమైన మానవతావాదం. అది అస్తిత్వ వాదం లాగా మనిషి బాధలు, పెట్టుబడిదారీ సమాజంలో బాధాకరమైన మనిషి ఉనికి మాత్రమే చెప్పి ఊరుకోదు, లేదా ప్రజల మధ్య సత్సంబంధాలు నెలకొనాలని ఆశించి ఊరుకోదు. మానవతా ఆదర్శ వాదం నిజమైన రీతిలో నిలదొక్కుకోవడానికి మార్గాలను సూక్ష్మంగా తెలియపరుస్తుంది. గతంలోని భావవాదం (మరీ ముఖ్యంగా ఆధునిక అస్తిత్వ వాదం), లోతుగా ఆలోచించే తత్వం గల భౌతికవాద ప్రాపంచిక దృక్పథాల వలె కాకుండా, గతి తార్కిక భౌతికవాద ప్రాపంచిక దృక్పథం నేటి అన్నింటికీ మించి ఉన్నత స్థాయిలో ఉన్న ప్రాపంచిక దృక్పథంగా చెప్పవచ్చు. కార్మిక వర్గ నాయకత్వంలో నియమ నిబంధనలకు లోబడి శ్రామిక ప్రజలు సాధించే సామాజిక సంబంధాల పరివర్తనయే ఈ ప్రాపంచిక దృక్పథానికి మొదటి ప్రాధాన్యత. ఉమ్మడి ఆర్థిక, సామాజిక ప్రయోజనాలకై ఏర్పడే ప్రజా సమూహ స్థాపనయే దాని లక్ష్యం. మానవుని సంపూర్ణ వ్యక్తిత్వం రూపొందడానికి అనుకూలమయిన అత్యంత ఉన్నతమయిన మానవతా సమాజాన్ని స్థాపించే లక్ష్యంతో సహజంగా ప్రకృతి సిద్ధంగా ఉండేవాటిని ఉపయోగించుకోవడం, సామాజికంగా ఉనికిలో ఉండే ప్రస్తుత వాస్తవాలను మార్చడం ఈ దృక్పథానికి ఉండే ప్రత్యేకత. వీ

చిలే దక్షిణ అమెరికాలోని పశ్చిమ ప్రాంతంలో 1.92 కోట్ల మంది జనాభాతో ఉన్న అతి చిన్నదేశం. అంటార్కిటాకు అత్యంత సమీపంలో ఉన్న చిలే దేశానికి ఉత్తరాన పెరూ, ఆగ్నేయ దిశగా బొలీవియా, తూర్పువైపు అర్జంటీనా దేశాలున్నాయి. అధిక భాగం లాటిన్ అమెరికా దేశాల్లో రాజకీయాలు, ఆర్థిక వ్యవస్థ రెండూ అస్థిరమే. చిలే దీర్ఘకాల ఆర్థిక అస్థిరత్వంతో, నియంత జనరల్ పినోషె సైనిక పాలనలో పెట్టిన పాతకాలపు నిరంకుశ రాజ్యాంగానికి కట్టుబడింది. సామాజిక వ్యయం, సబ్సిడీల లాంటి ఊసే లేకుండా లాభసాటి వ్యాపార వాతావరణంతో సంపన్న వర్గాల స్వర్గమైంది. సహజ వనరులు ఇబ్బడిముబ్బడిగా ఉన్నప్పటికీ తీవ్ర అసమానతలు, అవినీతితో చిలే నలిగిపోతున్నది. చిలే సమాజంలో 47 శాతంగా ఉన్న కార్మిక వర్గం, 43 శాతంగా ఉన్న మధ్యతరగతి రాజకీయార్థిక వ్యవస్థలో పరివర్తన రావాలన్న ఆకాంక్షతో ఉన్నారు. ప్రజా ఉద్యమ ప్రభావంతో నియంత పినోషె ప్రజలపై రుద్దిన రాజ్యాంగం స్థానే నూతన రాజ్యాంగాన్ని రూపొందించడం కోసం ప్రజాభిప్రాయ సేకరణ చేపట్టడం జరిగింది. 85 శాతం ప్రజలు మార్పును స్వాగతించారు. అంతేగాకుండా నూతన రాజ్యాంగ రచన నేడున్న కాంగ్రెస్ ద్వారా కాకుండా రాజ్యాంగ రచనకు నూతనంగా రాజ్యాంగ పరిషత్ సభను 2020 జూలైలో ఎన్నుకోవడం జరిగింది. ఈ రెండూ పెట్టుబడి అనుకూల ప్రభుత్వం మెడలు వంచి సాధించిన ప్రజా విజయాలు. ప్రజలు కొత్త రాజ్యాంగాన్ని రాసుకుంటున్న ప్రస్తుత తరుణంలో ఇటీవలివరకూ ప్రజాందోళనలకు నేతృత్వం వహించిన బోరిక్ అధ్యక్ష స్థానంలోకి రావడం ప్రజలు సాధించిన చారిత్రక విజయం.

చిలేకి దక్షిణ ప్రాంతంలోని మగల్లాన్స్‌లో 1986లో జన్మించిన బోరిక్ విద్యార్థినేత నుంచి అంచెలంచెలుగా ఎదిగారు. యూనివర్సిటీలో లా చదువుతుండగానే విద్యార్థి సంఘం అధ్యక్షుడిగా ఎన్నికయ్యారు. దేశంలో అసమానతలు, అవినీతికి వ్యతిరేకంగా చేపడుతున్న సామూహిక ఆందోళనలకు మద్దతిచ్చారు. గత కొన్నేళ్లుగా చిలేలో ఆర్థిక అసమానతలు విపరీతంగా పెరిగాయి. 2019 అక్టోబర్ 18న మెట్రో, బస్ ఇంధన చార్జీల పెరుగుదలతో అక్కడి ప్రజల ఆగ్రహం కట్టలు తెంచుకుంది. నిత్యావసరాల ధరలు పెరిగాయి. ప్రజలపై ఆర్థికభారం పెరుగుతున్నదన్న భావన పెరిగిపోయింది. దీనితో అధికారంలో ఉన్న పినేరాపై నిరసనలు పెల్లుబికాయి. అలా మొదలై, చిలేలో అనేక నెలలుగా సాగుతున్న నిరసనలు ఆధునిక విప్లవానికి ప్రతీకలు. వెరసి, పాత రాజ్యాంగానికి పాతరేసి, సమాజంలోని విభిన్నతనూ, దశాబ్దాలుగా దూరం పెట్టబడిన అణగారిన వర్గాలనూ ప్రతిబింబించే కొత్త రాజ్యాంగం దిశగా అడుగులు పడ్డాయి.

తాజాగా దేశాధ్యక్ష ఎన్నికల్లో వామపక్ష బోరిక్ విజయం ప్రజలు కోరుకుంటున్న మార్పుకు పడ్డ రాజముద్ర. కానీ, రెండేళ్ల క్రితం వీధుల్లోకి రప్పించిన అనేక అంతర్లీన సమస్యలు ఇప్పటికీ అలాగే ఉన్నాయి. ఆర్థిక అసమానతలు, మితిమీరిన విశ్వవిద్యాలయ ఫీజులు, నూటికి 80 మందికి నెలవారీ కనీస వేతనం (418 డాలర్లు) కన్నా తక్కువ ఫించను, ఇలా ఎన్నో. ఆర్థిక వ్యవస్థ ఆధారపడ్డ రాగి ఎగుమతులకు కొత్త రాజ్యాంగం పెట్టే కఠిన పర్యావరణ నిబంధనలతో ఇబ్బంది తలెత్తవచ్చు. కరోనా దెబ్బతో ఇప్పటికే కుటుంబాలు కుదేలయ్యాయి. వార్షిక ద్రవ్యోల్బణం ఏడేళ్ల గరిష్ఠానికి చేరింది. అయితే, ఆర్థికంగా బాధ్యతాయుతంగా ఉంటూనే, దేశంలో సాంఘిక హక్కులను విస్తరిస్తామన్నది బోరిక్ మాట. అందుకే, వచ్చే మార్చిలో ఆయన పాలన చేపట్టాక, శ్రామిక వర్గాలకు తోడ్పడే మార్పులు వస్తాయని జనం భావిస్తున్నారు. వాగ్దాన పాలనకై యువతరం నుంచి ఒత్తిడి తప్పదు.

**చరిత్రలో చిలే**

స్పానిష్ వలస పాలన నుండి 1817 ఫిబ్రవరి 17లో బెర్నార్డో ఓ 'హిగ్గిన్స్ నేతృత్వంలో చిలే స్వాతంత్ర్యం పొందింది. ఆ తరువాత పలుమార్లు అంతర్యుద్ధాలను చవిచూసింది.1920 ప్రాంతం నుంచి దేశంలో మార్క్సిస్టు ప్రభావం పెరిగింది. 1920లో పటిష్టమైన ఓటు బ్యాంకుతో సంస్కరణవాద సంకీర్ణ ప్రభుత్వానికి ఆర్టురో అలెశాండ్రి పాల్మా అధ్యక్షుడిగా ఎన్నికయ్యారు. అయితే అధ్యక్షుడు, పార్లమెంట్ మధ్య కలహాలు స్వల్పకాలిక సైనిక నియంతృత్వానికి దారి తీశాయి. జనరల్ లూయిస్ అల్టామిరానో ఆధ్వర్యంలో 1924లో మిలిటరీ తిరుగుబాటు జరిగింది. రాజకీయ అస్థిరత ఏర్పడింది. 1927లో ప్రజాస్వామ్యబద్ధంగా జరిగిన ఎన్నికల్లో ఇబానెజ్ డెల్ కాంపో భారీమెజార్టీతో ఎన్నికయ్యారు. నూతన రాజ్యాంగం ఏర్పాటు జరిగింది. ఆయన నియంతృత్వ పాలన కొనసాగించారు. 1946 నుంచి దేశంలో రాడికల్ పార్టీ పట్టుకొనసాగింది. 1946లో అతివాద నినాదాలతో అధికారంలోకి వచ్చిన గొంజాలిజ్ మెడెలా, ఆ తర్వాత నియంతృత్వం కొనసాగించాడు. 1952లో జరిగిన ఎన్నికల్లో గెలిచిన ఇబానెజ్ డెల్ కాంపో సామ్రాజ్యవాద అమెరికా విధానాలనే అనుసరించారు.

1970లో అధికారంలోకి వచ్చిన సాల్వడార్ అయెండె (అలెండీ) సుప్రసిద్ధ కవి, సోషలిస్టు భావాలు కలవాడు. అమెరికా విధానాలను అనుసరించడానికి నిరాకరించాడు. గనులన్నింటిని సమాజపరం చేశాడు. ఆయన చేపట్టే రాడికల్ విధానాలు మొత్తం లాటిన్ అమెరికాని ప్రభావితం చేసి పెట్టుబడిదారీ వ్యతిరేక ఉద్యమాలను సృష్టిస్తాయని అమెరికా భయపడింది. ఆనాటి అమెరికా అధ్యక్షుడు నిక్సన్ అయెండె ఎన్నిక ఎంతమాత్రం ఆమోదయోగ్యం కాదని తమ జాతీయ భద్రతా సమితి సమావేశంలో ప్రకటించాడు. ఇందుకోసం సైనిక పరమైన అవకాశాన్ని కూడా పరిశీలించమని సిఐఎని ఆదేశించాడు. తక్షణావసరాలకు గాను 10 మిలియన్ డాలర్లు విడుదల చేశాడు. దీనికంతటికి నిక్సన్ భద్రతా సలహాదారు హెన్రీ కిసింజర్ నేతృత్వం వహించాడు. అయెండె ప్రభుత్వాన్ని గద్దెదింపడానికి అమెరికా ద్విముఖ వ్యూహం అనుసరించింది. ఒకటి ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని మలచడం. రెండు, త్రివిధ దళాల (సైనిక, నౌక, వైమానిక) అధిపతుల కూటమి ద్వారా తిరుగుబాటు చేయించడం.

ఈ కుట్రలో భాగంగానే మిలటరీ నియంత జనరల్ ఆగస్టో పినోషె (పినోచెట్) అమెరికా సిఐఎ సహకారంతో 1973 సెప్టెంబర్ 11 నాడు అయెండె ప్రభుత్వాన్ని కుట్ర ద్వారా కూల్చారు. దేశాధ్యక్షుడు

అయెండీని అమెరికా సిఐఏ ప్రోద్బలంతో హత్య చేశారు. అయెండె ప్రజాహిత కార్యక్రమాలతో సమసమాజ నిర్మాణ స్వప్నంతో పాలన సాగించారు. ఆయన స్థానంలో అధికారం చేపట్టిన పినోషె 1990 వరకు సైనిక నియంతృత్వాధికారాలతో పాలన సాగించాడు. పినోషె 1980లో నూతన రాజ్యాంగాన్ని తప్పుడు ప్రజాభిప్రాయ సేకరణ ద్వారా సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలకు అనుకూలంగా మార్పు చేశాడు. అధ్యక్ష తరహా పాలన పద్ధతి ప్రవేశ పెట్టాడు. సామ్రాజ్యవాద అనుకూల ఆర్థిక సంస్కరణలు అమలు చేశాడు. ఆయన పాలనలో చిలే అల్లాడిపోయింది.

పినోషె పాలించిన 17 ఏళ్లలో 3200 మందిని ఉరితీశాడు. వేలాది మంది కనిపించకుండా పోయారు. 80 వేల మంది జైలు పాలయ్యారు. ప్రభుత్వ అరాచకాలను ప్రశ్నించినవారినల్లా ప్రభుత్వ వ్యతిరేకులని, దేశద్రోహులని ముద్ర వేశాడు. మానవ హక్కుల ఉల్లంఘనకు పాల్పడ్డాడు. పినోషె సైనిక నియంతృత్వ పాలనలో ప్రభుత్వ, పాలనాపరమైన కీలక పదవులన్నింటిని బంధుమిత్రులకు కట్టబెట్టాడు. ప్రభుత్వరంగ సంస్థలన్నింటిని ప్రైవేట్‌పరం చేశాడు. దేశీయ పరిశ్రమల రక్షణ కొరకు ఉన్న టారిఫ్‌లను రద్దు చేశాడు. అభివృద్ధి పేరుతో లక్షలాది ఎకరాల వ్యవసాయ భూమిని ప్రజల నుండి లాక్కొని కార్పొరేట్లకు కట్టబెట్టాడు. ప్రపంచీకరణ విధానాలు అమలులోకి తెచ్చిన లాటిన్ అమెరికన్ దేశాలలో చిలే మొదటిది. దీని ఫలితంగా కొద్దిమంది పెట్టుబడిదారుల ఆస్తులు, లాభాలు బాగా పెరిగిపోయాయి. కార్మికుల, రైతుల జీవితాలు చితికిపోయాయి. నిరుద్యోగం, పేదరికం పెరిగింది. ఆర్థిక అంతరాలు తీవ్రమయ్యాయి. ఫలితంగా ప్రజల్లో అసంతృప్తి పెరిగింది.

దేశాధ్యక్షుడు, నియంత పినోషె అధ్యక్ష స్థానంలో కొనసాగాలా వద్దా అనే దానిపై 1988లో జరిగిన ప్రజాభిప్రాయ సేకరణలో ఆయనకు వ్యతిరేకంగా ప్రజలు ఓటు చేశారు. అందువల్ల అధ్యక్ష పదవి నుండి వైదొలగాలన్న డిమాండ్‌తో 1990లో ప్రజా ఉద్యమం ప్రజ్వరిల్లింది. ప్రజా ఒత్తిడికి తలొగ్గక తప్పలేదు. అధ్యక్ష పదవికి రాజీనామా చేశాడు. కానీ 1998 వరకు సాయుధ దళాల కమాండర్‌గా కొనసాగుతూ ప్రభుత్వ విధానాలను ప్రభావితం చేశాడు. భద్రతా దళాల సభ్యులపై మానవ హక్కుల విచారణను తరచు అడ్డుకున్నాడు. ఇలా 1998 వరకు కొనసాగాడు. 1990లో రాజ్యాంగ సవరణ జరిగి ప్రజాస్వామ్య పద్ధతి పునరుద్ధరించబడింది. అయితే సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థల దోపిడీకి ఉపయోగపడే నిబంధనలు అలాగే ఉన్నాయి. అందువల్ల నియంత పినోషె తొలగిపోయినా ప్రజల జీవితాల్లో మార్పు రాలేదు. ఆ తర్వాతి అధ్యక్షులు రుయిజ్ తగ్లె, రికార్డో లాగోస్, మిచెల్లీ బచెలెట్, సిసిలియా మొరెల్, సెబాస్టియన్ పినేరా పాలనలో ప్రజల జీవితాల్లో చెప్పుకోదగ్గ మార్పులు రాలేదు.

గత అధ్యక్షుడు పినేరా సంపన్న బిలియనీర్లలో ఒకడు. 2019 అక్టోబర్ 18న మెట్రో రేట్లు బాగా పెంచిన సందర్భంలో ప్రజలు పెద్ద ఎత్తున నిరసనలు చేపట్టారు. ఆ నిరసనలు ఆర్థిక విధానాలు మారాలనే డిమాండ్‌గా ముందుకు వచ్చాయి. పినోషె ప్రారంభించిన ప్రయివేటు పెన్షన్ విధానాన్ని రద్దు చేయాలని, విద్య, వైద్య వ్యవస్థను పటిష్టం చేయడానికి నిధులు పెంచాలనే డిమాండ్లతో పాటు స్థానిక గిరిజన తెగల హక్కులు కాపాడాలనే డిమాండ్ ముందుకు వచ్చింది. పైన పేర్కొన్న సమస్యలకు కారణం దేశంలో అమలు జరుగుతున్న మార్కెట్ శక్తుల ఆధీనంలోని ప్రపంచీకరణ ఆర్థిక విధానాలూ, వాటిని కాపాడుతున్న రాజ్యాంగమేనని ప్రజలు గ్రహించారు. రాజ్యాంగాన్ని మార్చుకుంటే తప్ప ప్రజానుకూల ఆర్థిక విధానాలు అమలు జరపడం సాధ్యం కాదని, కాబట్టి రాజ్యాంగాన్నే మార్చాలనే లక్ష్యంతో పోరాటాలను ఉధృతం చేశారు. దేశాధ్యక్షుడు పినేరా దేశంలో అక్టోబర్ 18న అత్యవసర పరిస్థితి ప్రకటించారు. మరుసటి రోజు నుంచి కర్ఫ్యూ విధించాడు. ప్రజలపైకి సైన్యాన్ని పంపాడు. పోలీసుల, సైన్యం అరాచకాలకు అంతులేదు. చెప్పలేనంత భయంకర వాతావరణాన్ని సృష్టించారు. మహిళలపై సైనికులు అత్యాచారాలకు తెగబడ్డారు.

కర్ఫ్యూలు, కాల్పులు, అరెస్టులతో ప్రభుత్వం ఎంత బెదిరించినా సాధారణ పౌరుల ఆగ్రహావేశాలు చల్లారలేదు. పది లక్షల మంది ప్రజానీకం చిలే రాజధాని శాంటియాగో ప్లాజాను దాదాపు నెలరోజుల పాటు ఆక్రమించి తమ డిమాండ్లకు తలొగ్గితే తప్ప అక్కడ నుంచి కదిలేది లేదని బైటాయించారు. అధ్యక్షుడు పినేరా రాజీనామా చేయాలని ముక్తకంఠంతో ప్రజలు నినదించారు. మహిళలే ముందుండి నడిపించిన ఆ ఉద్యమంలో పోలీసు కాల్పులకు 36 మంది చనిపోగా, 12,000 మంది గాయపడ్డారు. వేలాది మందిని ఖైదు చేశారు. అదే సమయంలో ఉద్యమకారుల డిమాండ్లు పెరిగాయి. నీరు, భూమి కబ్జా పెట్టి సామాన్యులకు దక్కకుండా చేస్తున్న ప్రభుత్వ విధానాలు రద్దు కావాలంటూ డిమాండ్ చేశారు. ఆదివాసీ తెగలకు కనీస హక్కులు ఎందుకు లేవని ప్రశ్నించారు. ప్రజా ఉద్యమానికి తలొగ్గిన ప్రభుత్వం నవంబర్ 15న చిలే నేషనల్ కాంగ్రెస్ 2020 ఏప్రిల్‌లో రాజ్యాంగ మార్పుకు సంబంధించి ప్రజాభిప్రాయ సేకరణ జరుపుతామని ఉద్యమకారులతో అంగీకారానికి వచ్చింది. ఇది చిలే ప్రజల గొప్ప చారిత్రాత్మక విజయం.

అక్టోబర్ 25న కొత్త రాజ్యాంగం ముసాయిదాను తయారు చేయడానికి జరిగిన ప్రజాభిప్రాయ సేకరణలో 75 లక్షల మంది పాల్గొనగా వారిలో 78.27 శాతం మంది అనుకూలంగా స్పందించారు. అయితే రాజ్యాంగ రచన ఎలా జరగాలి, రాజ్యాంగ పరిషత్‌లో సభ్యులు ఎవరు ఉండాలి, ఎవరు ఉంటే ఆర్థిక, సామాజిక విధానాలు ప్రజానుకూలంగా ఉంటాయని ఆలోచించి రాజ్యాంగ పరిషత్ సభ్యుల ఎంపికకు కూడా ప్రజాభిప్రాయ సేకరణ జరపాలని నిర్ణయించుకున్నారు. అందుకు మొదటి మెట్టుగా రాజ్యాంగం మార్చాలా లేదా అనే అంశంపై, దానితో పాటు రాజ్యాంగ పరిషత్‌లో సభ్యులను ప్రజలే నేరుగా ఎన్నుకోవాలా లేదా ఇతర పద్ధతిని అనుసరించాలా అనే అంశంపై ప్రజాభిప్రాయ సేకరణ జరపాలని నిర్ణయించుకున్నారు. 2020 అక్టోబర్ 25న జరిగిన ప్రజాభిప్రాయ సేకరణలో రాజ్యాంగాన్ని మార్చాలని, సభ్యులను ప్రజలే ఎన్నుకోవాలనే ప్రతిపాదనలు ఆమోదం పొందాయి. 2021 ఏప్రిల్‌లో 155 మంది

రాజ్యాంగ పరిషత్ సభ్యులను ఎన్నుకున్నారు. ఇందులో స్త్రీ, పురుషులకు సమ ప్రాతినిధ్యం కల్పించడం చారిత్రాత్మకం కానుంది.

**సవాళ్ల మధ్య బోరిక్**

అధ్యక్ష ఎన్నికల ఫలితాలు వెలువడిన అనంతరం గాబ్రియేల్ తన మద్దతుదారులను ఉద్దేశించి విజయోత్సవ ప్రసంగం చేశారు. చిలే నియంత పినోషె అమలు చేసిన సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాల్లో భాగమైన చిలే ప్రైవేట్ పెన్షన్ వ్యవస్థను రద్దు చేస్తానని హామీ ఇచ్చారు. మన హక్కులు, మానవ హక్కులుగానే గౌరవింపబడాలి కానీ వినియోగ వస్తువుల్లా లేదా వ్యాపారంలా చూడరాదని వ్యాఖ్యానించారు. ఆర్థిక అసమానతలు రూపుమాపడానికి కృషి చేస్తానని చెప్పారు. న్యాయం, సమానత్వంతో కూడినదిగా తన పాలన ఉంటుందని హామీ ఇచ్చారు. కనీస వేతనాలు పెంచడం, విద్య, ఆరోగ్య సంరక్షణకు అయ్యే వ్యయాన్ని తగ్గించడం, సామాజిక భద్రతా వ్యవస్థను విస్తరించడం వంటి చర్యలు తీసుకోవడం ద్వారా అసమానతలను తగ్గిస్తామని హామీ ఇచ్చారు. సర్వ పరివ్యాపిత అభివృద్ధి పట్ల బోరిక్‌కు మంచి దార్శనికత ఉంది.

లాటిన్ అమెరికా దేశాల్లో స్థిరమైన ఆర్థిక వ్యవస్థ ఉన్న చిలేలో సంపదలో 75 శాతం ఒక శాతం మంది వద్దనే ఉన్నట్లు విమర్శలున్నాయి. ఈ ఆర్థిక అసమానతలను తొలగిస్తానని బోరిక్ హామీ ఇచ్చాడు. చిలేలోని కరెన్సీ పెసో డాలర్‌తో పోలిస్తే గణనీయంగా దిగజారింది. వామపక్ష భావజాల అభ్యర్థులు ఎన్నికకావడంతో చిలేలో స్టాక్ మార్కెట్లు కూడా పదిశాతం తగ్గాయి. మైనింగ్ స్టాక్స్ భారీగా దెబ్బతిన్నాయి. చిలేలో మైనింగ్ నుంచే ఎక్కువ ప్రభుత్వ ఖజానాకు రాబడులుంటాయన్న సంగతి తెలిసిందే. వాణిజ్య పారిశ్రామిక రంగాలకు పన్నులభారం పెరగవచ్చన్న ఆందోళన ఇప్పుడు పెరిగింది. ప్రత్యర్థి ఆంటోనియో కాస్టు పన్నులు తగ్గిస్తామన్న హామీకి విరుద్ధంగా బోరిక్ ఆర్థిక అసమానతలు తొలగిస్తామన్న హామీతోనే పన్నులపెంపు భారం ఉండవచ్చన్న కలవరం వ్యక్తం అవుతోంది. అలాగే ప్రభుత్వ క్రమబద్ధీకరణ, నిఘా వ్యవస్థలు కూడా పెరుగుతాయని ఫలితంగా ఇన్వెస్టర్లు కొంతమేర ప్రతికూలతలు ఎదుర్కొంటారన్న ప్రచారానికి బీజం పడింది. బోరిక్ దేశాన్ని సమైక్య ప్రగతిబాటలవైపు ఎలా కొనసాగిస్తాడన్నదే ఇప్పుడు ప్రపంచ దేశాల అధినేతల్లో ఆసక్తి పెరిగింది.

ఈ సమస్యలు అటుంచితే, మొత్తం మీద లాటిన్ అమెరికాలో రాజకీయాలు మలుపు తిరిగాయి. ఆ ప్రాంత ప్రజాస్వామ్యాలు రాజీ లేని భావాలతో ముందుకు సాగేందుకు యత్నిస్తున్నాయి. పెరూ, నికరాగ్వా, హొండూరస్, ఇప్పుడు చిలే నాలుగింటా వామపక్ష అభ్యర్థులే అధ్యక్షులయ్యారు. రాబోయే మే లో కొలంబియాలో, అక్టోబర్‌లో బ్రెజిల్‌లో జరిగే అధ్యక్ష ఎన్నికల్లోనూ లెఫ్టే విజయమని సర్వేల అంచనా. వామపక్ష భావజాలానికి అక్కడి ప్రజల్లో సానుకూలత పెరుగుతున్నట్టు అర్థమవుతోంది. వెనిజులా, చిలే సహా లాటిన్ అమెరికా ప్రాంతమంతా ఇప్పుడు ప్రజలకు ప్రాతినిధ్యం కల్పించే, ప్రగతిశీల 'నూతన సహస్రాబ్ది వామపక్షవాద' విజృంభణను వీక్షిస్తోంది. సాదరంగా స్వాగతిస్తోంది. విద్యార్థి నేత నుంచి దేశాధినేతగా ఎదిగిన బోరిక్ ఏలుబడిలో చిలే ప్రజల ఆకాంక్షలు నెరవేరుతాయని, వారి జీవితాలు మెరుగుపడతాయని ఆశిద్దాం. అదే సమయంలో సామ్రాజ్యవాదుల పట్ల అప్రమత్తంగా ఉండాలి. ప్రజలను నిత్య చైతన్యం చేస్తూ సామ్రాజ్యవాద కుట్రలను ప్రతిఘటించడానికి సంసిద్ధం చేయాలి.

త్వరలో ఏర్పడబోయే నూతన రాజ్యాంగ నిబంధనలు సమాజ పరివర్తనకు దోహదపడేలా ఉండాలి. పెట్టుబడిదారుల నుండి వనరులు, పరిశ్రమలు, విద్య, వైద్యం ప్రజాపరం కావాలి. పరిశ్రమలు, వ్యవసాయం, సహజ వనరులు జాతీయం చేయాలి. నియంతృత్వ ఉద్యోగస్వామ్యం నుంచి పాలన పగ్గాలు ప్రజలు చేపట్టాలి. భూస్వాముల భూములు భూమిలేని రైతులకు పంపిణీ చేయాలి. ప్రభుత్వ నేతలు ప్రజావ్యతిరేకంగా మారినప్పుడు వెనుకకు (రికాల్) పిలిచే నిబంధన ఉండాలి. పోలీసులు, సైన్యం రద్దు చేయబడి ప్రజాసైన్యం ఏర్పాటు కావాలి. ప్రజా ద్రోహులను విచారించి శిక్షలు వేయాలి. జనతా ప్రజాతంత్ర వ్యవస్థ ఏర్పడాలంటే ప్రజాతంత్ర రాజ్యాంగం ఉండాలి. అశేష శ్రామిక వర్గానికి, రైతాంగానికి, పేద ప్రజలకు వెన్నుగా, దిక్సూచిగా నిలిచే విప్లవ పార్టీ ఉండాలి. ఇది నిత్యం ప్రజలను అప్రమత్తం చేసే భావజాలాన్ని, పెట్టుబడిదారీ, భూస్వామ్య వర్గాలు తిరిగి తలెత్తకుండా నిరోధించే చైతన్యాన్ని అందించాలి. అప్పుడు మాత్రమే దశాబ్దాల ప్రజా నెత్తుటి త్యాగాల ఫలాలు ప్రజలు అనుభవిస్తారు. అయితే ప్రపంచీకరణ మౌలిక వ్యవస్థలను అలాగే కొనసాగిస్తే ఫలితం ఉండదు.

చిలే ఆర్థిక స్థితి సజావుగా లేదు. చిలే కరెన్సీ పెసో 18 శాతం దిగజారింది. బోరిక్ ప్రజలకు ఇచ్చిన హామీలు నెరవేర్చడానికి నూతన రాజ్యాంగం ఏ మేరకు అనుమతిస్తుందో చూడాలి. మరో విషయం చిలే ఎగువసభ (సెనెట్), దిగువసభ (డిప్యూటీస్)లో గాబ్రియేల్ పార్టీకి మెజారిటీ లేదు. మొత్తం 12 పార్టీలు ఉండగా అత్యధిక పార్టీలు మితవాద పార్టీలే ఉన్నాయి. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాలు ప్రపంచ దేశాలను శాసిస్తున్న నేపథ్యంలో గాబ్రియేల్ బోరిక్‌ను సజావుగా పాలన చేయనిస్తారా? సామ్రాజ్యవాదులు ఎంతకైనా తెగిస్తారన్నది చారిత్రక సత్యం. పార్లమెంటు దిగువ సభ డిప్యూటీల చాంబర్‌లో 155 స్థానాలకు గాను వామపక్ష కూటమి పార్టీలకు వచ్చింది 37 మాత్రమే, రెండు పచ్చి మితవాద కూటములకు 105 వచ్చాయి. ఇదేవిధంగా ఎగువ సభలోని 50 స్థానాలకు గాను వామపక్షాలకు ఐదు, స్వతంత్రులు ఇద్దరు మిగిలిన 43 మితవాద పార్టీలకే వచ్చాయి. కనుక ప్రజలు రాజ్యాంగాన్ని మార్చుకున్నా, అభ్యుదయవాదిని అధ్యక్షునిగా ఎన్నుకున్నా, చిలే చట్టసభలు అవరోధంగా ఉండే అవకాశాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి. అందువలన బోరిక్ పాలన కత్తి మీద సాము లానే ఉంటుంది. ఒకవైపు దేశీయ మితవాద పార్టీలు, మరోవైపు పొంచి ఉన్న అమెరికా సామ్రాజ్యవాద కుట్రలు ఎదుర్కొనేందుకు ఉద్యమంలో రాటుదేలిన మిలిటెంట్ శ్రేణులలో వర్గ చైతన్యాన్ని కల్గించాలి. సాధించిన విజయాలను పదిలపర్చుకొంటూనే ప్రజలు ఇంకా సామ్రాజ్యవాద శక్తులతో పోరాడవల్సే ఉంది.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)*

# బైడెన్ ప్రజాస్వామ్య సదస్సు ఓ ప్రహసనం

*ప్రపంచ దేశాలలో ప్రజాస్వామ్యం గురించి చర్చించడానికి సదస్సు ఏర్పాటు చేసిన అమెరికా అధ్యక్షుడు తన దేశంలో ప్రజాస్వామ్యం సంగతి చూసుకోవాలని అంటున్నారు* **సంతోష్**

గత డిసెంబర్ 9, 10 తేదీల్లో అమెరికా అధ్యక్షుడు జో బైడెన్ ఏర్పాటు చేసిన ప్రజాస్వామ్య సదస్సుకు వంద దేశాధినేతలను ఆహ్వానించారు. ఈ సమావేశం ఆన్‌లైన్‌లో జరిగింది. సదస్సు ఉద్దేశం ప్రపంచ వ్యాప్తంగా ప్రజాస్వామ్యాన్ని బలోపేతం చేసేందుకు, ప్రజాస్వామ్యాన్ని దెబ్బతీయడానికి నియంతలు చేసే ప్రయత్నాలు అడ్డుకునేందుకు ఉద్దేశించిందని పేర్కొనడం ఆత్మవంచన తప్ప మరోటి కాదు. ఈ సదస్సు ప్రపంచ భౌగోళిక రాజకీయాల్లో తన ప్రాధ్యాతను పెంచుకోవడానికేనన్నది యథార్థం. బైడెన్ మాట్లాడుతూ ప్రజాస్వామ్య వ్యవస్థలు అనేక సవాళ్లను ఎదుర్కొంటున్న స్థితిలో ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించటం అమెరికాకు, ఇతర ప్రజాస్వామ్య దేశాలకు అత్యవసరం అన్నారు. విభిన్న దృక్పథాలు కలిగిన ప్రపంచ నాయకులు అంకితభావంతో పని చేయడం ప్రజాస్వామ్య పునరుత్తేజానికి అత్యవసరం అని బైడెన్ భావిస్తున్నారు. ప్రజాస్వామ్య పటిష్టత, నిరంకుశవాదాన్ని ప్రతిఘటించడం, అవినీతిపై పోరు, మానవ హక్కుల పట్ల గౌరవాన్ని పెంపొందించడం వంటి మూడు అంశాలపై ప్రధానంగా ఈ సదస్సు చర్చిస్తుందని బైడెన్ పేర్కొన్నాడు. చైనా, రష్యా దేశాలను నియంతృత్వ దేశాలని నిర్వచించి వారిని ఈ సమావేశాలకు దూరం పెట్టారు. నియంతృత్వం నుండి రక్షించుకోవటమే నేటి ప్రజాస్వామ్య దేశాల విధి అని చెబుతూ బైడెన్ చైనా, రష్యా వ్యతిరేక కూటమిని ఏర్పాటు చేసుకుంటున్నారు.

అసలు అమెరికా పుట్టుకనే దురాక్రమణతో ప్రారంభమైంది. ఆది నుంచి అమెరికాది ప్రజాస్వామ్య వ్యతిరేక దురాక్రమణ దుర్బుద్ధే. ఉత్తర అమెరికాలోని మూలవాసులైన రెడ్ ఇండియన్స్‌ను హతమార్చి, వారి శ్మశాన దిబ్బలపై యూరప్ వలసవాసులు అమెరికా స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నారు. ఆఫ్రికా నుంచి బానిసలను తెచ్చి గనుల్లో, కర్మాగారాల్లో వెట్టిచేయించి, తద్వారా సృష్టించబడిన సంపదను స్వంతం చేసుకొని సంపన్న రాజ్యంగా ఎదిగింది. పక్కనే ఉన్న దక్షిణ అమెరికా (లాటిన్ అమెరికా)ను తమ పెరడుగా చేసుకొని అపార ఖనిజ సంపదను దోచుకొని అగ్రరాజ్యంగా ఎదిగింది. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో జపాన్‌లోని హిరోషిమా, నాగసాకిలపై బాంబులు వేసి భస్మీపటలం చేసినప్పటి నుండి ఇప్పటి వరకు అమెరికా వంద దేశాలపై ప్రత్యక్ష, పరోక్ష యుద్ధాలు చేసింది. మానవ హక్కులపై గౌరవాన్ని పెంచడం సమావేశ లక్ష్యాలలో ఒకటి, అమెరికా మానవ హక్కుల పరిరక్షణ మొనగాడిగా ప్రచారం చేసుకుంటుంది. అమెరికాకు మానవ హక్కుల గురించి మాట్లాడే నైతిక హక్కు ఉందా?

ఈ సదస్సుకు తన అడుగులకు మడుగులొత్తే దేశాలను మాత్రమే ఆహ్వానించింది. అమెరికా పాడే పాటకు తాన అంటే తందాన అనేవారికే అక్కడ చోటు అని స్పష్టం అవుతోంది. ప్రజాస్వామ్య పునరుద్ధరణ పేరుతో ప్రజాస్వామ్య వ్యతిరేక చర్యలకు పాల్పడడం అమెరికాకు అవసరం. దీనికి ఇతర దేశాల మద్దతు కూడా ఉందని చూపేందుకు భారత్, పాకిస్తాన్ వంటి దేశాలను చేర్చుకున్నది. అగ్రరాజ్యం అధిపత్యాన్ని సవాల్ చేస్తున్న దేశాలను పక్కన పెట్టింది.

అమెరికా నేతృత్వంలోని నాటో సభ్యదేశాలైన టర్కీ, హంగేరీలను సదస్సుకు ఆహ్వానించలేదు. ఈ సమావేశం లక్ష్యం ప్రజాస్వామ్యాన్ని గౌరవించడం కాదు, పెరుగుతున్న రష్యా, చైనా ప్రాబల్యాన్ని అడ్డుకోవడానికి వంద దేశాల మద్దతు కూడగట్టడం లక్ష్యంగా కనిపిస్తోంది. అమెరికానే ప్రజాస్వామ్య సంక్షోభాన్ని ఎదుర్కొంటుంటే, అది ప్రపంచ దేశాలల్లో ప్రజాస్వామ్య పునరుద్ధరణకు సమర్థవంతమైన నాయకత్వం అందించగలదా! బైడెన్ మాట్లాడుతూ అమెరికాలో ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించడానికి, ప్రజాస్వామ్య సంస్థలను బలోపేతం చేయడానికి నిరంతరం కృషి చేయాల్సిన అవసరముందని అంగీకరించాడు. సిబిఎస్ న్యూస్ చేసిన సర్వే అమెరికాలో ప్రజాస్వామ్యం పలు సమస్యలతో సంక్షోభంలో కూరుకుపోయిందని తేల్చి చెప్పింది.

సదస్సుకు ఆహ్వానించిన 110 దేశాలలో అంగోలా, కాంగో, ఇరాక్, కెన్యా, మలేషియా, పాకిస్తాన్, సెర్బియా, జాంబియా, ఇండియా, ఫిలిప్పీన్స్, ఇండోనేషియా, పోలాండ్ దేశాల్లో ప్రజాస్వామ్యం అధమస్థానంలో ఉందని ఫ్రీడమ్ హౌస్, వి–డెమ్ 2020 నివేదిక తెలిపింది. సదస్సులో పాల్గొన్న 89 దేశాల నేతల్లో పలువులు నియంతలు, అవినీతిపరులు, హక్కులను గౌరవించని నేతలున్నారు. బ్రెజిల్ అధ్యక్షుడు జైర్ బోల్సనారో, ఫిలిప్పీన్స్ అధ్యక్షుడు రోడ్రిగో డ్యూటర్ వంటి నేతలు తమ తమ దేశాల్లో నియంతృత్వ ప్రభుత్వాలను ఏర్పాటు చేసిన వారే. బోల్సనారో ఆదివాసీల హక్కులను కాలరాచే విధానాలు రూపొందించాడు. అమెజాన్ వర్షాధార అడవుల వినాశనానికి, కరోనా వైరస్ ముప్పును గుర్తించడానికి తిరస్కరించడం ద్వారా వేలాది మంది ప్రజలు మృత్యువాత పడేందుకు అనుమతించిన నేతగా తీవ్ర విమర్శలు ఎదుర్కొన్నాడు. ఇక రోడ్రిగో డ్యూటర్ మాదక ద్రవ్యాలపై పోరు పేరుతో వేలాది మందిని చట్టవిరుద్ధంగా హత్యలు చేయించడంలో పేరు మోశాడు. జర్నలిస్టులను, మానవ హక్కుల కార్యకర్తలను జైల్లో పెట్టడం ద్వారా విస్తృత రీతిలో అణచివేత చర్యలకు పాల్పడ్డారు.

చైనాకు వ్యతిరేకంగా ఉండే తైవాన్‌కు ఆహ్వానం పంపారు. అలాగే వెనిజులా అధ్యక్షుడు మధురో నేతృత్వంలోని చట్టబద్ధమైన ప్రభుత్వాన్ని కూలదోయాలన్న ప్రయత్నాలకు సహకరించే గెయిడోకు ఆహ్వానం పంపారు. ఇక దక్షిణాసియాకు చెందిన దేశాల్లో అమెరికా ఆహ్వానం అందుకున్న దేశాలను పరిశీలించినట్లయితే, అమెరికా నీచపుటెత్తుగడలు స్పష్టమవుతాయి. పాకిస్తాన్‌ను ఆహ్వానించారు. (కాని హాజరు కావడానికి తిరస్కరించింది), బంగ్లాదేశ్‌ను కానీ శ్రీలంకను కానీ ఆహ్వానించలేదు. భారత్, నేపాల్, మాల్దీవులను ఆహ్వానించారు. ప్రజాస్వామ్య దేశంగా పాకిస్తాన్ కన్నా బంగ్లాదేశ్ ఎందులో తీసిపోయింది? ఆఫ్ఘనిస్తాన్‌ను అందుబాటులో ఉ

ంచుకోవాల్సిన అవసరమే పాకిస్తాన్‌కు ఆహ్వానం పంపేలా చేసిందా? అంటే అంతేనని చెప్పుకోవాల్సి వస్తోంది. మొత్తంగా ఈ సదస్సు నిర్వహణ తీరు గమనిస్తే పౌరుల హక్కులు, అవినీతిపై పోరాటం, ప్రజాస్వామ్య విలువల పరిరక్షణ కంటే రష్యా, చైనా అధికార నమూనాలకు వ్యతిరేకంగా అమెరికా భౌగోళిక రాజకీయ ప్రయోజనాలే అమెరికాకు ప్రధానం అయినట్లు కన్పిస్తోంది.

మాది అతి పురాతన ప్రజాస్వామ్యం అని చెప్పుకునే అమెరికాలో ప్రజాస్వామ్యం ఎంతగా కుప్పకూలిందో గత ఏడాది జనవరిలో అమెరికన్ కాపిటల్ హిల్‌పై జరిగిన దాడి, రక్షణగా ఉన్న పోలీసులపై జరిగిన కాల్పులు తిరుగులేని నిదర్శనం. తన ప్రపంచాధిపత్యాన్ని సవాల్ చేసే దేశాలపై దండెత్తి, ఆ దేశాలను సర్వనాశనం చేసిన చరిత్ర అమెరికాది. చిలేలో ప్రజాస్వామ్యబద్ధంగా ఎన్నికైన తొలి కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని సైనిక కుట్ర ద్వారా కూల్చివేసిన దుర్మార్గ చరిత్ర అమెరికాది. అమెరికన్ రాజకీయ వ్యవస్థ పట్ల ఆ దేశ ప్రజల్లో అసంతృప్తి ఎంతగా గూడుకట్టుకుందో ప్యూ రిసెర్చి సెంటర్ ఇటీవల నిర్వహించిన సర్వేలో మరోసారి స్పష్టమైంది. 17 శాతం మంది అమెరికన్లు మాత్రమే అమెరికా ప్రజాస్వామ్యం ఇతర దేశాలకు అనుసరణీయమని చెప్పారు. జర్మనీకి చెందిన రాబర్ట్ బాష్ ఫౌండేషన్ జరిపిన అధ్యయనంలో 50 శాతం మంది అమెరికన్లు తమ ప్రజాస్వామ్యం పని చేయడం లేదని కుండబద్దలు కొట్టారు.

రాజ్యాంగం పట్ల, ప్రజాస్వామ్యం పట్ల నమ్మకం లేని భారత ప్రధాని మోడీ ప్రజాస్వామ్య సదస్సులో మాట్లాడుతూ ప్రపంచంలోనే అతిపెద్ద ప్రజాస్వామ్య దేశానికి తాను ప్రాతినిధ్యం వహిస్తున్నానని చెప్పుకున్నారు. ప్రజాస్వామ్య స్ఫూర్తి తమ దేశ నాగరికతలోనే అంతర్లీనంగా ఉందని ఘనంగా చెప్పుకున్నాడు. మాది అతి పెద్ద ప్రజాస్వామ్యం అని చెప్పుకునే మన దేశంలో కేంద్రంలో మోడీ నేతృత్వంలోని బిజెపి ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత అన్ని రాజ్యాంగ వ్యవస్థలు, ప్రజాతంత్రయుత సంస్థలపైన దాడులు పెరిగిపోయాయి. రాజ్యాంగ మౌలిక విలువైన లౌకికవాదం, ఫెడరలిజాన్ని దెబ్బ తీసేందుకు మోడీ ప్రభుత్వం చేయని యత్నం లేదు. ప్రజాస్వామ్యానికి ప్రాణప్రదమైన అసమ్మతి తెలిపే హక్కుపై ఉక్కుపాదం మోపుతున్నది.

మోడీ పాలన కాలంలో జెఎన్‌యు, జామియా మిలియా విశ్వవిద్యాలయాల్లో విద్యార్థులపై, మైనారిటీలపై దాడులు, దేశద్రోహం కేసులు బనాయించడం, ప్రభుత్వాన్ని విమర్శించిన మేధావులను, జర్నలిస్టులను రాజకీయ నాయకులను ఊపా వంటి చట్టాలను ఉపయోగించి జైళ్లలో కుక్కడం, సోషల్ మీడియా గొంతు నొక్కడం, వ్యక్తిగత గోప్యతను హరించడం వంటి నిరంకుశ చర్యలకు ఒకవైపు నిర్లజ్జగా పాల్పడుతూ, మరోవైపు నిరంకుశాధికారంపై పోరాడతామని చెప్పడం ప్రజలతో క్రూర పరిహాసమాడడమే. మధ్యప్రదేశ్, కర్ణాటక, గోవా, ఉత్తరాఖండ్‌లలో ప్రజాస్వామ్య బద్ధంగా ఎన్నికైన ప్రభుత్వాలను కూలదోయడం ప్రజాస్వామ్యాన్ని నిలువునా ఖూనీ చేసింది. అవినీతి, మానవ హక్కుల గురించి ఇక ప్రత్యేకించి చెప్పాల్సిన అవసరం లేదు. ప్రజాస్వామ్యాన్ని పదహారడుగుల లోతున పూడ్చి పెట్టే ఈ బాపతు అంతా కలసి ప్రజాస్వామ్యానికి తామే పేటెంట్ అన్నట్లుగా మాట్లాడడం చాలా హాస్యాస్పదం. ప్రజాస్వామ్య సదస్సు పేరుతో క్వాడ్‌ల తరహాలో దక్షిణ ఆసియాలో చైనాకు వ్యతిరేకంగా మరో కూటమిని ఏర్పాటు చేయడమే బైడెన్ ప్రభుత్వ అసలు ఎజెండా. పెట్టుబడిదారీ వ్యవస్థలో ప్రజాస్వామ్యంలోని డొల్లతనం ఇప్పటికే అనేకసార్లు బయటపడింది.

బైడెన్ ప్రజాస్వామ్య సదస్సు ఏర్పాటు పట్ల చైనా విదేశాంగ శాఖ ఒక నివేదికను విడుదల చేసింది. అందులో అమెరికా ప్రభుత్వం డాలర్లతో పాలించబడుతోంది. సమాజం వర్ణ వివక్షతో విడిపోయిందంటూ అమెరికా ప్రజాస్వామ్యంలోని లోపాలను, దుర్వినియోగాన్ని ఎత్తి చూపింది. లోపభూయిష్టమైన ప్రజాస్వామ్యాన్ని ఎగుమతి చేయడం వల్ల ప్రపంచ దేశాలకు హాని జరుగుతుందని పేర్కొంది. అమెరికా తన స్వంత వ్యవస్థను, ప్రజాస్వామ్య విధానాలను మెరుగుపరుచుకుంటే బాగుంటుందని హితవు పలికింది. అమెరికాలో అందరికి ఓటు హక్కు ఉన్నప్పటికీ అక్కడ మైనారిటీ ఉన్నతవర్గాల పాలన సాగుతోందని పేర్కొంది. ప్రపంచాన్ని దిగ్భ్రాంతికి గురిచేసిన కాపిటల్ భవనం దగ్గరి అల్లర్లు, పాతుకు పోయిన జాత్యహంకారం, కొవిడ్-19 మహమ్మారిని అదుపు చేయటంలో జరిగిన విషాదకరమైన సంఘటనలు, సంపద అంతరాలను పెంచడం, పేరుకు మాత్రమే వాక్ స్వాతంత్ర్యం వంటి అనేక దుర్లక్షణాలను నివేదిక ప్రస్తావించింది. అమెరికా ప్రేరేపించిన 'వర్ణ విప్లవాలు' ప్రాంతీయ అస్థిరత్వాలకు దారితీశాయి. వారి ఆంక్షల దుర్వినియోగం అంతర్జాతీయ నియమాలను ఉల్లంఘించింది, ప్రపంచ విమర్శలను మూట గట్టుకుంది అని ఈ నివేదిక తెలిపింది. 'ప్రజాస్వామ్యం అనేది మానవాళి అందరూ పంచుకునే ఉమ్మడి విలువ. ఇది అన్ని దేశాలకు ఉన్న హక్కు, కొంత మందికి రిజర్వ్ చేయబడిన ప్రత్యేక హక్కు కాదు' అని నివేదిక తెలిపింది.

రష్యా విదేశాంగ మంత్రిత్వ శాఖ ప్రతినిధి మాట్లాడుతూ కాపిటల్ హిల్ సంఘటన దయనీయమైంది. ప్రజాస్వామ్య నిబద్ధ పాలనకు ఎవరు అర్హులో, ఎవరు కారో నిర్ణయించాల్సింది ప్రపంచ ప్రజలేనన్నారు. ఈ శిఖరాగ్ర సదస్సు ప్రచ్ఛన్న యుద్ధ మనస్తత్వంపై ఆధారపడి ఉందని రష్యా విదేశాంగ శాఖ పేర్కొంది. ఇది ప్రపంచాన్ని విభజించే, పోటీ పడేట్లు చేసే కుటిల యత్నంగా ఆరోపించింది. ఇక హంగేరీ పార్లమెంట్ సభ్యుడు గెర్గెలీ గులియాస్ పత్రికల వారితో మాట్లాడుతూ 2020లో జరిగిన అమెరికా అధ్యక్ష ఎన్నికలు బూటకమని మిలియన్ల కొద్ది అమెరికన్లు భావిస్తున్నారని అన్నారు. అమెరికాలో ఉన్నంత జటిలమైన ప్రజాస్వామ్య సమస్యలు మా దేశంలో లేవు అన్నారు. మీరు దేశీయంగా ప్రజాస్వామ్యాన్ని రక్షించలేనప్పుడు ప్రపంచ వ్యాప్తంగా ప్రజాస్వామ్యాన్ని ఎలా రక్షిస్తారు? అన్నారు. "మీ ఇల్లు మంటల్లో ఉన్నప్పుడు మీరు ప్రపంచ ఫైర్‌మెన్ కాలేరు" అని అట్లాంటాలోని ప్రగతిశీల బృందం 'బ్లాక్ వోటర్స్ మేటర్ ఫండ్' సహ వ్యవస్థాపకుడు క్లిఫ్ అల్బ్రైట్ అన్నారు.

అమెరికాలో నేడు కొనసాగుతున్నది ఒకటైతే అది బయటి ప్రపంచానికి చెబుతున్నది మరొకటి. 1980లో అధ్యక్షుడు రోనాల్డ్ రీగన్ హయాంలో నేషనల్ ఎండోమెంట్ ఫర్ డెమోక్రసీ (ఎన్ఇడి)ని ఏర్పాటు చేశారు. స్వేచ్ఛా మార్కెట్ విధానాలను నిలబెట్టాలన్నది ఎన్ఇడి లక్ష్యంగా నిర్దేశించారు. అమెరికాను వ్యతిరేకించే దేశాల్లో ప్రతిపక్ష గ్రూపులకు నిధులు అందజేసే సాధనంగా ఎన్ఇడి మారిపోయింది. 1999లో వాజ్‌పేయి ప్రభుత్వం ఆ ఎన్ఇడిలో చేరింది. తాజాగా బైడెన్ అమెరికా విదేశాంగ శాఖ నిర్వహించే ఫండ్ ఫర్ డెమోక్రటిక్ ఇనిషియేటివ్ ప్రోగ్రాంకు 422 కోట్ల డాలర్ల నిధులను అందజేయనున్నట్లు తెలిపారు. ఇక ఈ నిధులను అమెరికా భౌగోళిక రాజకీయాల ప్రయోజనాల కోసం వాడుతుంది. అమెరికాలో నల్ల జాతీయులు శ్వేత జాత్యహంకారానికి గురవుతున్నారు. ప్రపంచ ప్రజాస్వామ్యం కోసం పోరాడే యోధుడుగా తనకు తాను ఫోకస్ చేసుకునే బదులుగా అమెరికాలో ఏం జరుగుతుందనే దానిపై బైడెన్ దృష్టి పెడితే బాగుంటుంది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# లోలోపలి రాజ్యాన్ని నడుపుతున్నదెవరు?

**ఎన్. వేణుగోపాల్**

జర్నలిస్టు జోసీ జోసెఫ్ రాసిన 'ది సైలెంట్ కూ - ఎ హిస్టరీ ఆఫ్ ఇండియాస్ డీప్ స్టేట్' - The Silent Coup - A History of India's Deep State - ఇంగ్లిష్ చదవగలిగిన వాళ్లందరూ వెంటనే చదవవలసిన పుస్తకం. ఈ పుస్తకం భారత రాజ్యం లోపలి రాజ్యం (డీప్ స్టేట్) చరిత్రను, అది మొత్తంగా రాజ్యాధికారాన్ని కైవసం చేసుకోవడానికి జరిపిన, జరుపుతున్న నిశ్శబ్ద కుట్రను విప్పి చెప్పడానికి ప్రయత్నించింది.




డీప్ స్టేట్ (రాజ్యాంతర్గత రాజ్యం) అనే భావన 1990ల్లో టర్కీలో కుర్దిష్ తిరుగుబాటుదారులను అణచివేయడానికి మాదకద్రవ్యాల ముఠాలతో, మాఫియా ముఠాలతో చేతులు కలిపి దేశ సైన్యం ఏర్పాటు చేసుకున్న రహస్య పాలక బృందంతో మొదలయిందంటారు. ఇటీవలి కాలంలో సామాజిక శాస్త్రాలలో, ప్రత్యేకంగా రాజనీతి శాస్త్రంలో బాగా ప్రచారంలోకి వచ్చింది. ఒక రాజ్యపు రాజకీయ నాయకత్వానికి బైట, స్వతంత్రంగా, తన సొంత ప్రయోజనాల కోసం, లక్ష్యాల కోసం పనిచేస్తుండే రహస్య, అనధికార ఆధిపత్య శక్తుల కూటమిని డీప్ స్టేట్ అంటున్నారు. అయితే రాజకీయ నాయకత్వానికి మొత్తంగా ఇది దూరంగా, స్వతంత్రంగా ఉన్నట్టు కనిపించినా, చాల సందర్భాల్లో ప్రధాన రాజకీయ నాయకత్వపు కనుసన్నల్లోనే ఇది నడుస్తుంటుంది. రాజకీయ నాయకత్వంతో భావజాల అనుబంధాన్ని పంచుకుంటుంది.

ప్రధానంగా వ్యతిరేకార్థంలోనే వినియోగంలో ఉన్న ఈ మాట రాజ్యపు సహజ, చట్టబద్ధ పౌర అధికారపు పరిధి దాటి ప్రవర్తించే రాజ్యాంతర్గత శక్తుల ప్రాబల్యాన్ని సూచిస్తుంది. బైటికి చూడడానికి అధ్యక్షులు, రాష్ట్రపతులు, ప్రధాన మంత్రులు, మంత్రులు, చట్టసభల సభ్యులు, ఉన్నతాధికారులు ఎవరున్నా, వారందరూ ఈ డీప్ స్టేట్ తయారు చేసిన వ్యూహాల ప్రకారం, ఆ వ్యూహాలను సమర్థించడానికి, ముందుకు తీసుకుపోవడానికి పని చేస్తుంటారు. డీప్ స్టేట్ అనేది ఒక చిన్న రాజకీయార్థిక ప్రయోజనాల ముఠా. ఒక రకంగా చెప్పాలంటే అమెరికాలో సిఐఎ, ఇజ్రాయెల్ లో మొసాద్, సోవియట్ యూనియన్ ఉన్న రోజుల్లో కెజిబి వంటి నిఘా సంస్థలనూ, వాటి అనుబంధ సంస్థలనూ, వాటి మిలాఖత్తుతో నడిచే చిన్న రాజకీయ బృందాన్నీ డీప్ స్టేట్ అనవచ్చు.

ఈ 'రాజ్యం లోపలి రాజ్యం' కన్న ముందు అసలు రాజ్యం, రాజ్యాధికారం అనే మాటల గురించి ఆలోచించాలి. అవి ఆలోచనాపరులకు కొత్తవి కాదు గాని వాటి పూర్తి అర్థాన్ని గుర్తించినవారు తక్కువే. ఒక వర్గానికో, కులానికో, మతానికో, కులనిర్మూలన భావానికో, తమ భావజాలానికో రాజ్యాధికారం సంపాదించడం కోసం పోరాడుతున్నామని అనేవాళ్లలో చాలమంది కూడ ఆ మాటను ప్రభుత్వాధికారానికి మాత్రమే కుదించి చూస్తున్నారు.

రాజ్యం అంటే ప్రభుత్వం, రాజ్యాంగయంత్రం, పాలనాధికారం, అధికారవర్గం, పాలనారీతి, ఒకానొక ప్రభుత్వ విభాగం వంటి పరిమిత అర్థాలు మాత్రమే ఎక్కువగా ప్రచారంలోకి వచ్చి, పూర్తి అర్థం కనబడకుండా పోతున్నది. పోలీసులు, సైన్యం, జైళ్లు, అణచివేత సాధనాలు రాజ్యానికి ప్రధానమైన, బైటికి కనబడే సాధనాలు. ప్రభుత్వం, అందులోని ఉన్నతాధికారులు రాజ్యానికి బైటికి కనబడే మరొక రూపం. కాని ఈ కనబడే రూపాల వెనుక సారం క్లిష్టమైనది. సమాజంలోని సంపద మీద, వనరుల మీద, మానవశ్రమ మీద, మొత్తంగా సమాజం మీద ఆధిపత్యం వహించే వర్గపు రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక ప్రయోజనాల గుచ్ఛమే రాజ్యం. ఆ అర్థంలో రాజ్యం అంటే పాలకవర్గ ప్రయోజనాల సమాహారం. పాలకవర్గంలోని భిన్న ముఠాల ప్రయోజనాలను కాపాడుతూ, వాటి మధ్య సమన్వయం సాధించే మధ్యవర్తి అది. సమాజంలో ఉత్పత్తి సాధనాల మీద యాజమాన్యం ఉన్నవారి యథాస్థితిని కాపాడడానికీ, కొనసాగించడానికీ, విస్తరించడానికీ ప్రయత్నించే యంత్రాంగం అది. సమాజంలో వర్గపోరాటం జరగకుండా చూసే, అణచివేసే సాధనం అది. కాని ఈ కీలకమైన రాజ్య ప్రయోజనాలన్నీ రహస్యమైనవి, బహిరంగంగా ప్రకటించడానికి వీలులేనివి. అందువల్ల రాజ్యం ప్రభుత్వం అనే సంక్షేమ ముఖం బైట పెట్టి, లోలోపల మాత్రం అణచివేత సాధనాలనే ప్రధానంగా చూస్తుంది.

అంటే ఎటువంటి రాజ్యానికైనా రాజ్యాంతర్గత రాజ్యం, బహిరంగంగా కనబడని రాజ్యం, గద్దె మీద కూచున్నవారి కంటె ఎక్కువ దూరదృష్టి, విహంగ దృష్టి, భావజాల నిబద్ధతా, కరుడుగట్టిన హింసాత్మకతా ఉన్న 'రాజ్యం లోపలి రాజ్యం' అవసరం అవుతుంది. ఈ పని సాధారణంగా భద్రతా, నిఘా సంస్థలు చేస్తాయి గనుక 'రాజ్యం లోపలి రాజ్యం'గా ఎదిగే అవకాశం వాటికే వస్తుంది. అవి పాలకవర్గాల ఆర్థిక ప్రయోజనాలనూ, ప్రభుత్వంలో ఉన్నవారి రాజకీయ ప్రయోజనాలనూ కలగలుపుతాయి. అలా నిఘా సంస్థల అధిపతుల - కార్పొరేట్ సంపన్నుల - రాజకీయ నేతల దుష్టత్రయం కలిస్తే అదీ 'రాజ్యం లోపలి రాజ్యం'.

భారతదేశంలో అటువంటి 'రాజ్యం లోపలి రాజ్యం' ఎప్పుడు, ఎలా, ఎవరితో ఏర్పడింది, ఎలా పని చేస్తున్నది తెలుసుకోవడం ఆయా సంస్థల రహస్య పని విధానాల వల్ల చాల క్లిష్టమైన వ్యవహారం. ఆ 'రాజ్యం లోపలి రాజ్యం'లో ఒక భాగమైన కార్పొరేట్ పన్నాగాలు ఎలా సాగుతున్నాయో సుదీర్ఘకాలం జర్నలిస్టుగా పరిశీలించి, అధ్యయనం చేసిన అనుభవంతో జోసీ జోసెఫ్ తన మొదటి పుస్తకం రాశారు. ముంబాయి ఆదర్శ్ హౌజింగ్ కుంభకోణం, 2010 కామన్ వెల్త్ క్రీడల కుంభకోణం వంటి కీలకమైన వార్తా కథనాలను బైట పెట్టినది ఆయనే. ఈ క్రమంలోనే ఆయన రాజకీయ, కార్పొరేట్ రంగాల వార్తా కథనాలతో పాటు భారత భద్రతా వ్యవహారాల వార్తా కథనాలు సేకరించే

పనిలో ఎన్నో భారత భద్రతా, నిఘా, సైనిక, అర్ధసైనిక, పోలీసు బలగాలతో సంబంధంలోకి వచ్చారు. సంవత్సరాల తరబడి, వేలాది మంది అధికారులను, గూఢచారులను, నిజాలు బైటపెట్టినవాళ్లను, అవినీతికరమైన ఉన్నతాధికారులను, పన్నుల అధికారులను, బ్లాక్ మెయిల్ పరిశోధకులను కలిసి చేసిన పరిశోధన ఈ పుస్తకం.

ఈ పుస్తకం ఎ టేల్ ఆఫ్ ముంబాయి, మెనీ టేల్స్ ఆఫ్ ఇండియా అనే రెండు భాగాలలో, మొదటి భాగంలో ఐదు అధ్యాయాలతో, రెండో భాగంలో ఏడు అధ్యాయాలతో తయారైంది. రెండు వందల అరవై పేజీలకు మించని ప్రధాన రచనకు 348 పాదసూచికల వివరణలు, ఆధారాలు, ఈ పుస్తకం ఎటువంటి సందేహానికి తావులేని, కచ్చితమైన, సాధికారికమైన, ధృవీకరించుకోగలిగిన సాక్ష్యాధారాలతో తయారైందని చూపుతాయి. అచ్చంగా వాస్తవాలతో నిండి కాల్పనికేతర రచనగా వెలువడిన ఈ పుస్తకం దేశం మీద ప్రేమ, దేశ భవిష్యత్తు పట్ల ఆందోళన ఉన్న ఎవరినైనా కాల్పనిక రచన కంటె ఎక్కువ రోమాంచకారిగా చదివిస్తుంది. మనం ఎన్నుకున్న, పన్నులు కట్టి పోషిస్తున్న ప్రభుత్వం, ఆ ప్రభుత్వంలోని కొందరు వ్యక్తుల చేతుల్లో నడుస్తున్న రాజ్యాంగబద్ధ సంస్థలు ఎంతెంత దుర్మార్గమైన పనులు, ఎంత రాజ్యాంగ వ్యతిరేకమైన, చట్టవ్యతిరేకమైన, అమానుషమైన పనులు సాగిస్తున్నాయో అడుగడుగునా కనబడి ఆగ్రహం కలుగుతుంది, దేశ భవిష్యత్తు పట్ల దుఃఖం కలుగుతుంది.

మొదట, మొత్తం పుస్తకానికి జోసీ జోసెఫ్ రాసిన ముందుమాట లోంచి కొన్ని వాక్యాలు చూడండి: "నైపుణ్యం గల భద్రతా యంత్రాంగం ఆధునిక రాజ్యపు కేంద్రం. రాజ్యానికి అత్యుత్తమ రక్షణ అది. కాని, దాన్ని సరిగా నిర్వహించక పోయినట్టయితే, అది ఆ దేశపు అత్యంత ఘోరమైన పీడకలగా మారిపోగలదు. భద్రతా యంత్రాంగంలో అత్యంత శక్తిమంతమైన అంగం సైన్యం. అది పాలనను తన చేతుల్లోకి తీసుకునే సంభావ్యత నిజమవుతుందేమోనన్నదే ప్రపంచమంతటా ఉన్న భయం. కొన్ని అంచనాల ప్రకారం, 1950 నుంచి ఇప్పటివరకు ప్రపంచవ్యాప్తంగా 460 సైనిక కుట్ర ప్రయత్నాలు జరిగాయి. వాటిలో 233 విజయం సాధించాయి.... భారత సైన్యం దేశంలోని ప్రజాస్వామ్యాన్ని కూలదోయబోదనే విశ్వాసం నుంచి చాలామంది భారతీయులు సాంత్వన పొందుతారు. వారిలో నేనూ ఒకడిని.... అయితే, ఒక ప్రజాస్వామ్యాన్ని కూలదోయడానికి సైనిక కుట్ర ఏకైక మార్గమేమీ కాదు. విదేశీ శక్తి దురాక్రమణ, పాలనను కూలదోసే తిరుగుబాటు, లేదా పాలకుల హత్యలు వంటి ఇప్పటికే గుర్తించిన ప్రమాదాలు ఎన్నో ఉన్నాయి. కాని ఒక కొత్త ప్రమాదం కూడ ఉందని అంతకంతకూ ఎక్కువ సాక్ష్యాలు దొరుకుతున్నాయి. ఆ ప్రమాదాన్నే నేనీ పుస్తకంలో పరీక్షించబోతున్నాను. అది లోలోపలి నుంచి వచ్చే ప్రమాదం. దేశపు పాలకవర్గంలో అత్యున్నత ముఠా ప్రజాస్వామ్యాన్ని కూలదోయడం అనేదే ఆ ప్రమాదం. ....దాన్ని వాళ్లు ఎలా సాధించగలరు? ప్రత్యేకంగా క్రియాశీలంగా పాల్గొనడానికి సిద్ధంగా లేని సైన్యం ఉన్న భారతదేశంలో అది ఎలా జరుగుతుంది? ప్రతి ప్రభుత్వోద్యోగీ తాను ఏ ఒక్క వ్యక్తి ఆదేశాలకూ తల వంచబోనని, రాజ్యాంగాన్ని ఎత్తిపట్టడమే తన విధ్యుక్తధర్మమని ప్రమాణం చేసే చోట అది ఎలా సాధ్యమవుతుంది? ఇక్కడే, భద్రతా యంత్రాంగంలోని సైనికేతర అంగం తన పాత్ర పోషిస్తుంది. రాజ్యపు పోలీసు బలగాలు, నిఘా యంత్రాంగాలు, కేంద్ర స్థాయి దర్యాప్తు సంస్థలు, పన్నుల శాఖలు, అటువంటి అనేక సంస్థలు అత్యున్నత పాలక వర్గ ముఠా సాధనాలుగా మారిపోతాయి..."

ఇది కేవలం సైద్ధాంతిక పరికల్పన మాత్రమేనా, ఈ పని నిజంగా జరుగుతున్నదా లేదా చూడడానికి గత రెండు మూడూ దశాబ్దాల భారత చరిత్రను జోసెఫ్ అవలోకనం చేస్తారు. దేశవ్యాప్తంగా అటు మూల కశ్మీర్ నుంచి ఇటు మూల కేరళ దాకా, ఒకదిక్కు గుజరాత్ నుంచి మరోదిక్కు ఈశాన్య రాష్ట్రాల దాకా సైనికేతర భద్రతా బలగాలను పాలకవర్గ ముఠాలు ఎలా ఉపయోగించుకున్నాయో, ఉపయోగించుకుంటున్నాయో డజన్ల కొద్దీ ఉదాహరణలతో సాధికారంగా వివరిస్తారు. కంట తడిపెట్టకుండా, ఆగ్రహం, అసహ్యం కలగకుండా, ఈ కాన్సర్ ను అరికట్టడానికి ఏమైనా చేయలేమా అని ఉద్రేకపడకుండా ఈ పుస్తకం చదవడం కష్టం.

వాటిలో కొన్ని విషాద గాథలు. మనుషులను వారి కుటుంబాల నుంచీ, ఉద్యోగాల నుంచీ, వృత్తులనుంచీ బైటికి లాగి నిస్సహాయులుగా మార్చి, రోజుల తరబడీ వారాల తరబడీ నిర్బంధ శిబిరాలలో చిత్రహింసలు పెట్టి, చేయని నేరాలు ఒప్పించి, కేసుల్లో ఇరికించి, ఏళ్ల తరబడి జైళ్లలో నిర్బంధించిన కథనాలు. పోలీసులు, అర్ధ సైనిక బలగాలు చెప్పినవన్నీ పచ్చి అబద్ధాలని చివరికి తేలిన దారుణ ఘటనలు. కొన్ని హాస్యాస్పద గాథలు. మహా ఘనత వహించిన భారత భద్రతా బలగాలలో ఒకదానికీ మరొకదానికీ సమన్వయం లేకపోవడం, అంతర్గత కుట్రలు, రాజకీయ నాయకుల, కార్పొరేట్ సంపన్నుల, చివరికి ఎవరు ఆర్థిక ప్రయోజనాలు చేకూరిస్తే వారికి సేవకులుగా పనిచేసిన రాజ్యాంగబద్ధ అధికారుల గాథలు. రెండు ప్రధాన ఘటనల్లో ఒకటి కేవలం ఒక బోగస్ పారిశ్రామిక సంస్థ యజమానులను ఎదిరించి, ఉద్యోగం వదిలేసిన వ్యక్తి మీద శక్తిమంతులైన యజమానులు పోలీసులను ఉపయోగించి తప్పుడు కేసుల్లో ఇరికించిన గాథ. ఆ వ్యక్తినీ అతని కుటుంబాన్నీ చిత్రహింసలతో వేధించిన గాథ. పది సంవత్సరాల తర్వాత ఆ ఉద్యోగి చెప్పిన యాజమానుల అక్రమాలే నిజమై వాళ్లు ప్రభుత్వరంగ బ్యాంకులకు వేల కోట్ల రూపాయలు ఎగ్గొట్టి విదేశాలకు పారిపోయిన కథ. ఈ మొత్తం లో ఆ యజమానులకు సహకరించిన పోలీసు యంత్రాంగం.

సోదాలు, జప్తులు, తప్పుడు పంచనామాలు, అబద్ధపు కేసుల బనాయింపు, తప్పుడు సమాచారాల సేకరణ, అక్రమ నిర్బంధాలు, చిత్రహింసలు, నార్కో టెస్ట్ పేరిట జరిగిన ఘోరాలు, తప్పుడు ఒప్పుకోలు ప్రకటనలు, ఖైదీల మీద జైలు అధికారులు జరిపిన దారుణాలు, ఉద్దేశపూర్వకంగా పత్రికలను, న్యాయస్థానాలను తప్పుదారి పట్టించడం, పారదర్శకత లేని దర్యాప్తులు, నిజంగా దర్యాప్తు జరపవలసిన దిశలో కాకుండా సరిగ్గా వ్యతిరేక దిశలో దర్యాప్తు జరపడం, నిజమైన నేరస్తులకు పోలీసుల, నిఘా సంస్థల, దర్యాప్తు సంస్థల సహకారం, అలా సహకరించిన అధికారులకు పదోన్నతులు, పోలీసు చట్టాలలో ఉన్న అప్రజాస్వామికత, టాడా, పోటా, యుఎపిఎ, సాయుధ బలగాల ప్రత్యేక అధికారాల చట్టం వంటి అప్రజాస్వామిక చట్టాలు, హక్కుల కార్యకర్తల, న్యాయవాదుల హత్యలు, వంటి వందలాది ఉదంతాలను జోసెఫ్ క్రమబద్ధంగా,

సోదాహరణంగా, సాధికారికంగా వివరించారు. ఆయా ఉదంతాలను బట్టి ప్రస్తావనవశాత్తూ ఆ వ్యవహారాలలో దేశంలోని 22 అత్యున్నత నిఘా, దర్యాప్తు, భద్రతా సంస్థల భాగస్వామ్యం ఎలా ఉందో, ఎంత ఉందో వివరించారు.

ఈ క్రమంలో జోసెఫ్ చూపిన నిదర్శనాల జాబితా చూస్తే సమకాలీన భారత చరిత్ర చదివినట్టు ఉంటుంది. ముంబాయి వాహిద్ ఉదంతం, గోధ్రా ఉదంతం, గుజరాత్ మారణకాండ, హరేన్ పాండ్యా హత్య, సోహ్రాబుద్దీన్ షేక్, కౌసర్ బీ, తులసీరాం ప్రజాపతిల బూటకపు ఎన్ కౌంటర్లు, ముంబాయి అల్లర్లు, ముంబాయి పోలీసు వ్యవస్థకూ మాఫియాకూ ఉన్న అన్యోన్యమైత్రి, ఎన్ కౌంటర్ స్పెషలిస్టులు, దశాశ్వమేధ్ ఘాట్, శ్రమజీవి ఎక్స్ ప్రెస్, ఢిల్లీ, సంకట్ మోచన్ దేవాలయం, గోరఖ్ పూర్ మార్కెట్, హైదారాబాద్ లుంబినీ పార్క్, గోకుల్ చాట్ భండార్, ఉత్తరప్రదేశ్ కోర్టులు, జైపూర్ వంటి చోట్ల బాంబు పేలుళ్ల కేసులు, బాట్లాహౌజ్ ఎన్ కౌంటర్, తాజ్ మహల్ హోటల్ మీద దాడి, హేమంత్ కర్కారే హత్య, సంఝౌతా ఎక్స్ ప్రెస్ పేలుళ్లు, అభినవ్ భారత్ వంటి హిందూ తీవ్రవాద సంస్థలు, లష్కర్ ఎ తోయెబా, ఇండియన్ ముజాహిదీన్ వంటి ఇస్లామిక్ తీవ్రవాద సంస్థలు, అంతులేని కశ్మీర్ విషాదగాథ, ఖలిస్తానీ ఆందోళన, ఆపరేషన్ బ్లూస్టార్, శ్రీలంక తమిళ ఈలం ఉద్యమం, భారత శాంతి రక్షక దళాల హింసామయ, విషాదమయ ప్రహసనం, ఇండియన్ ఎయిర్ లైన్స్ విమానపు 1999 హైజాక్, పంజాబ్ ఖలిస్తాన్ ఉద్యమాన్ని అణచడం పేరుతో పోలీసులు 25,000 మంది యువకులను మాయం చేయడం, మితిమీరిన అధికారాలు సంపాదించుకుని, ఆ అధికారాన్ని అమాయక సాధారణ పౌరుల మీద హింసాత్మకంగా ఉపయోగించడం, మణిపూర్ లో సైనిక, అర్ధసైనిక బలగాల అకృత్యాలు, ఛత్తీస్ గడ్ లో సాల్వా జుడుం అకృత్యాలు, గుజరాత్ నమూనా పేరుతో నరేంద్ర మోడీ %--% అమిత్ షా తయారుచేసిన అక్రమ, హింసాపూరిత, ముస్లిం వ్యతిరేక భద్రతా యంత్రాంగ మానసిక స్థితి, మొదట మితిమీరిన అధికారాలు పొంది విచ్చలవిడిగా ప్రవర్తించి, చివరికి జైలు పాలైన పోలీసు అధికారి వంజారా, తాను చేసిన నేరాల్లో మోడీకీ, షాకూ ఉన్న పాత్రను విప్పిచెపుతూ రాసిన రాజీనామా ఉత్తరం, జడ్జి లోయా అనుమానాస్పద మరణం, అమిత్ షా మీద కేసు ఉపసంహరణ, స్వచ్ఛంద సంస్థల మీద మోడీ పగ, మోడీ మీద హత్యా ప్రయత్నాలు అనే ఎడతెగని అబద్ధాల కథ, భీమా కోరేగాం అబద్ధపు కేసు, ఆర్సెనాల్ కన్సల్టింగ్ వాస్తవాల వెల్లడి... ఇదీ ఈ మూడు దశాబ్దాల చరిత్ర.

ఈ మొత్తం కథనం భారత భద్రతా బలగాలలో విస్పష్టంగా ఉన్న ముస్లిం వ్యతిరేకతను, ప్రతిదానికీ ముస్లింలను అనుమానించే మానసిక స్థితిని, హిందూ తీవ్రవాద సంస్థల విధ్వంసాల గురించి స్పష్టంగా తెలిసిన తర్వాత కూడా వాటిని దాటవేయడాన్ని, తక్కువ చేసి చూపడాన్ని, మోడీ–షాల గుజరాత్ నమూనా తర్వాత భద్రతా బలగాలను వినియోగించి భిన్న స్వరాలను వేధించడాన్ని అద్భుతంగా వివరిస్తుంది. అక్కడక్కడ జోసెఫ్ చేసిన కొన్ని వ్యాఖ్యలు తప్పనిసరిగా వినవలసినవి.

"ఈ పుస్తకపు మౌలిక వాదన – పోలీసు, నిఘా యంత్రాంగాలను జవాబుదారీగా మార్చవలసిన తక్షణ అవసరాన్ని గుర్తింపజేయడం."

ఎన్నికల కమిషన్ గురించి చెపుతూ "కీలక సమయాల్లో ఒక ఎత్తుగడగా మరొక పక్కకు చూడడంలో నైపుణ్యం సాధించిన భారత రాజ్యాంగ వ్యవస్థల పనితీరే ఇవాళ దేశపు ప్రజాస్వామ్యానికి ఎదురవుతున్న సవాళ్లలో ప్రధానమైనది."

"దురభిప్రాయాలు, చీకటికోణాలు లేని భద్రతా యంత్రాంగం మాత్రమే, క్షేత్రస్థాయి పరిస్థితి గురించి లోతైన అవగాహన ఉన్న యంత్రాంగం మాత్రమే ప్రజాస్వామ్యానికి అత్యంత కీలక అవసరం."

"భారతదేశం సైనిక కుట్రల నుంచీ, ప్రభుత్వాల కూల్చివేత నుంచీ సురక్షితంగా ఉన్నదని అనిపించవచ్చు. కాని మన భద్రతా సంస్థలలోని చీకటిశక్తులకు కళ్లాలు బిగించవలసిన అవసరం ఉన్నదనడానికి ఈ పేజీల్లోనూ, వేరే చోట్లా తగినన్ని ఆధారాలున్నాయి"

"2008 ముంబాయి దాడుల తర్వాత ఏర్పాటైన ఎన్ఐఎ తన వృత్తి నైపుణ్యాన్ని రాజకీయ యజమానుల వేదిక మీద బలి ఇచ్చినట్టే కనబడుతున్నది."

"దేశానికి నిజమైన శత్రువులను కనిపెట్టే బదులు, భారత భద్రతా సంస్థలు తమ చేతికి అందినవారిని వేటాడాయి. తీవ్రవాదుల కోసం వెతికే బదులు, అమాయకులను అదుపులోకి తీసుకున్నాయి. సమాచార సేకరణలో, విశ్లేషణలో నైపుణ్యం మెరుగుపరుచుకునే బదులు, తామే అబద్ధపు సమాచారాన్ని ఉత్పత్తిచేయడం మొదలుపెట్టాయి."

ఇవీ, ఇటువంటివీ ఎన్నో నిజాలు బైటపెట్టకుండా ఉండడానికి, సత్యాన్వేషణను ఆపివేయడానికి తనకు ఎన్నెన్నో లంచాలు ఇవ్వజూపిన, బెదిరించిన అత్యున్నత ప్రభుత్వాధికారుల ఉదాహరణలు కూడ జోసెఫ్ రాశారు. ఎక్కడో ఒక చిన్న, స్థానిక, సుపరిచిత ఘటనను వివరిస్తూ, అక్కడి నుంచి సుదూరమైన అంతర్జాతీయ వ్యవహారాల లోకీ, చరిత్ర లోకీ, మానవ స్పందనల లోకీ సునాయాసంగా వెళ్లడం జోసీ జోసెఫ్ రచనా శైలి. అది చదువరుల ఆలోచనా, విశ్లేషణా పరిధిని అంతకంతకూ విశాలం చేస్తుంది.

నాకు తోచిన, నేను గుర్తించిన లోపాలు లేవని కాదు గాని, మొత్తంగా పుస్తకం ఇచ్చే అవగాహనతో పోలిస్తే ఆ పొరపాట్లను వదిలేయవచ్చు.

పుస్తకం లోంచి డజన్ల కొద్దీ పేజీలు, ఇరవైకి పైగా ఘటనలు, పరిణామాలు వివరంగా ఉటంకించి, ఎంత పెద్ద కుట్ర ఎంత నిశ్శబ్దంగా జరిగిపోయిందో, జరిగిపోతున్నదో చూపాలని ఉన్నది. దేశంలో ఏం జరుగుతున్నదో ఈ పుస్తకం చదివి తెలుసుకొమ్మని, ఇక్కడ కొనసాగుతున్నది ప్రజాస్వామ్యమేనని ఇంకా నమ్మేవాళ్లకు సవినయంగా విజ్ఞప్తి చేయాలని ఉన్నది. పాలకవర్గ దుర్మార్గాల గురించి తెలుసుకొని, ప్రజలకు తెలియజెప్పదలచిన వారందరూ ఈ పుస్తకం చదవాలి. ఒక ప్రత్యామ్నాయ ప్రజా నవభారతాన్ని కలగని, ఆ మార్గంలో సాగుతున్న శక్తులకు, వాళ్లు కనిపెట్టిన దుర్మార్గానికి వందల రెట్లు ఎక్కువ జరుగుతున్నదని తెలుసుకోవడానికి ఈ పుస్తకం చదవమనీ, తమలో తమ అంతర్గత విభేదాలను పక్కనపెట్టి విశాల ప్రజారాశుల ఐక్యత సాధించవలసిన అవసరం ఎంతగా తోసుకొస్తున్నదో ఈ పుస్తకం చదివి తెలుసుకొమ్మనీ చెప్పాలనిపిస్తున్నది. ఇప్పటికైనా మేలుకోవలసిన కర్తవ్యం ముక్కు మీద గుద్దినట్టుగా ఎట్లా ముంచుకొస్తున్నదో భారత ప్రజలందరికీ ఈ పుస్తకం ద్వారా చూపాలని ఉన్నది. వీ

# విశ్లేషణతో 'కుదురు'కున్న కథనాలు

డా. బీరం సుందరరావు

చెప్పడానికి అనువైనదాన్నే చెప్పాలి. రాయడానికి అనుకూలమైన విషయాన్నే రాయాలి. చెప్పడానికి, రాయడానికి సాధన ముఖ్యం. పరిశోధన ముఖ్యం. స్పందన ముఖ్యం. స్వారస్యం ముఖ్యం - మాట, చేత, రాత సందర్భోచితంగా ఉన్నప్పుడే రాణిస్తుంది. సందర్భోచితం అంటే సామాజిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక విషయాల విశ్లేషణలో పాటించే ఔచిత్యం. ఎవర్నీ నొప్పించకుండా, సామాజిక ప్రయోజనమే ధ్యేయంగా రాయడం ద్వారా వివిధ కథనాలు విశ్లేషణతో 'కుదురు'కొని పాఠకులను చదివింప చేస్తాయి, ఆలోచింపచేస్తాయి - కర్తవ్యోన్ముఖులుగా మారుస్తాయి.




కె.హెచ్.కె. మోహన్‌రావు గారు ఇటీవల ప్రచురించిన సామాజిక, ఆర్థిక, రాజకీయ విశ్లేషణ కథనాల సమాహారం 'కుదురు'. మోహన్‌రావు గారు మూడు దశాబ్దాలకు పైగా రచనా రంగంలో ఉన్నారు. కవిగా, రచయితగా, పాత్రికేయునిగా, కాలమిస్ట్‌గా, సామాజిక సేవాభిలాషిగా కె.హెచ్.కె. కృషి బహుముఖంగా విస్తరించింది. కరువు కాటకాలకు పెట్టింది పేరైన పల్నాటి సీమ రైతుల దయనీయ స్థితిని 'కరువు కురిసిన మేఘం'గా వర్ణించారు. 'అక్షర స్వరాలు'తో భాషను అర్చించారు. పల్నాటి వీరనారీమణి 'నాయకురాలు నాగమ్మ'ను పురుషాధిక్యతపై తొలి ప్రతిఘటన స్వరంగా ఆవిష్కరించారు. ఇపుడు కుదురైన కథనాలతో సరికొత్తగా 'విచ్చు'కున్నారు. ఏ విషయాన్ని అయినా, సార్థకంగా, సాధికారికంగా చెప్పగల సమర్థత కె.హెచ్.కె. కలానికి ఉంది.

'కుదురు'లోని చాలా కథనాల్లో సూటిదనం ఉంది. సందర్భాన్ని బట్టి ఘాటుదనం ఉంది. లేనిదల్లా అస్పష్టత. అయోమయం. రాయదల్చుకున్న విషయంపై రచయితకు సదవగాహన లేకుంటే - ఆ కథనం పాఠకుల్ని అయోమయంలో పడేస్తుంది. ఈ విషయాలన్ని తెలిసిన మోహన్‌రావు గారు నిర్భయంగా కలాన్ని కదిలించారు. పదునైన వ్యాఖ్యలను వర్తమాన రాజకీయంపై, నాయకులపై సంధించారు. ఆయా కథనాల్లో చూడవచ్చు. భారతీయుడు 'సున్నా'ను కనుగొన్న నాటి నుండే భారతదేశం అంకెకు ముందు (0001) సున్నాగా, ప్రపంచంలోని అనేక దేశాలు అంకెకు (1000) తర్వాత సున్నాలుగా మారిపోయాయి - అంటారు 'రెండు తెలుగు రాష్ట్రాలకు వాస్తు దోషం' వ్యాసంలో.

ఉభయ తెలుగు రాష్ట్రాలు చీలిపోయాక ప్రజా బలంతో గెలిచిన ముఖ్యమంత్రులు, మంత్రులు ప్రజలకు మేలు చేయాలన్న వాస్తవాన్ని విస్మరించి, వాస్తు చుట్టూ ప్రదక్షిణలు చేయడాన్ని మోహన్‌రావు గారు వ్యంగ్యంగా విమర్శించారు.

'కుదురు'లో మొత్తం 26 వ్యాసాలున్నాయి. ఆయా వ్యాసాల్లోని కథనాలు విలక్షణంగా ఉన్నాయి. విశ్లేషణాత్మకంగా సాగాయి. మన ఆలోచనలకు కొత్త వాకిళ్లు తెరుస్తాయి. వ్యవస్థలోని మురుగును, మాలిన్యాన్ని కడిగేసి, స్వచ్ఛత వైపు నడిపిస్తాయి. చెప్పదలచుకున్న దాన్ని నీళ్లు నమలకుండా, కుండబద్దలు కొట్టినట్లు చెప్పడం నిర్భీతి కథనానికి శ్వాసవంటిది.

'కుదురు' సంకలనంలో కె.హెచ్.కె. మరో కోణం మనకు కన్పిస్తుంది. తన కవి హృదయానికి భిన్నంగా, సాత్వికతకు విరుద్ధంగా సమకాలీన రాజకీయాలపై, నేతలపై చేసిన వ్యాఖ్యలు మనల్ని ఆశ్చర్యపరుస్తాయి. రాజకీయంగా మోహన్‌రావు గారికి ఉన్న అవగాహనను మనముందు నిలబెడతాయి. 'అన్ని అనర్థాలకు తల్లివేరు రాజకీయం' వ్యాసం అందుకు నిదర్శనం. 'నేటి మన రాజకీయ వ్యవస్థ అవినీతి రొచ్చులో ఉంది' - అంటారు. ఎంఎల్‌సి ఎన్నికల్లో టీచర్లకు డబ్బు, సెల్‌ఫోన్‌లు పంపిణీ చేసి, ప్రలోభపెట్టడం పరమ జుగుప్సాకరం అంటారు. 'సమాజంలో ఊడలు దిగిన అవినీతి, అనైతిక నడవడులు మానవ సంబంధాలను ధ్వంసం చేశాయి' అని నిలువెత్తు నిర్భయ గళంతో, కలంతో వాస్తవాన్ని మన ముందుంచిన మోహన్‌రావు గారిని పత్రికా రంగం 'ఉత్తమ కాలమిస్టు'గా ఎప్పుడో గుర్తించింది. 'కుదురు'లోని కథనాల్లో మూడు మినహా వీక్షణంలో ప్రచురితమై, ఇప్పుడు పుస్తక రూపంలో మన చేతుల్లోకి వచ్చాయి.

రోజూ చూసే సూర్యోదయమే అయినా నిత్యం కొత్తదనం కన్పిస్తుంది. ఆ కొత్తదనం సూర్యోదయంలో లేదు. మన చూపుల్లో ఉంది. రచయితకు, పాఠకుడికి కొత్తచూపు ఉన్నప్పుడే మంచి రచనలు వస్తాయి. సమాజాన్ని ప్రక్షాళనం చేస్తాయి. మోహన్‌రావు గారి సామాజిక, రాజకీయ కథనాల్లో గుండెను తాకే మెత్తదనం ఉంది. మోహన్‌రావు గారు కవి కావడం వల్ల కవితాత్మకమైన వాక్య నిర్మాణ శైలి కథనాలకు నిండుదనాన్ని కలిగించింది - విషయానికి తగిన భాష మనల్ని పలకరిస్తుంది. 'కుదురు'లోని కథనాలు మనల్ని అంతర్ముఖుల్ని చేస్తాయి. 'అయ్యో! సమాజం ఇలా ఉందా? ఇంతగా విలువలు పతనమయ్యాయా?' అనే అంతర్మథనానికి గురిచేస్తాయి. కవిత, కథ, కథనం ఏదైనా దానికి మౌలిక కర్తవ్యం సామాజిక హితం - ప్రజా చైతన్యం. కథనం ఏదైనా రచయిత చేసే విశ్లేషణాత్మక వ్యాఖ్య, వాడే భాష, సమస్య పరిష్కారానికి సూచనలు కథనానికి పుష్టినిస్తాయి.

సామాజిక జీవన ప్రతిబింబమే సాహిత్యం. సామాజిక జీవనమంటే రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక విషయాల్లో చైతన్యవంతులై జీవించడం. ప్రజా చైతన్యమే పరమావధిగా రచనలు చేస్తున్న కె.హెచ్.కె. మోహన్‌రావు గారు తమ రచనా ప్రస్థానంలో మరో మెట్టు పైకి ఎక్కారు. అందుకు వారిని అభినందిద్దాం! ఇంత మంచి సంపుటిని ఆత్మీయ హితుడు పి.యల్.యస్. శ్రీనివాస్‌కు అంకితమివ్వడం వారి ఆత్మీయతకు చిరునామా! ఆలోచనాపరులు, పుస్తక ప్రియులంతా చదవవలసిన వ్యాస సంపుటి 'కుదురు'.

(కుదురు రాజకీయ, ఆర్థిక, సామాజిక కథనాలు: రచన: కె.హెచ్.కె. మోహన్‌రావు; ప్రథమ ముద్రణ: ఏప్రిల్ - 2021; ప్రతులకు: కె.ఎచ్.కె. మోహన్‌రావు, 11-61/3, పిడుగురాళ్ల - 522413, ఫోన్ : 9440154114, వెల రు. 160)

# 'చైనా పరివర్తన' విజయం వైపా, ఊబి వైపా?

రవీంద్రనాథ్ సూరి

పరివర్తన చైనా రూపాంతరీకరణ గురించి వాదోపవాదాలు జరుగుతున్నాయి. చైనాలో వచ్చిన మార్పులను ఎవరికి తోచినట్టు వారు వ్యాఖ్యానాలు చేస్తున్నారు. కొన్ని వాస్తవాలపై ఆధారపడి, కొన్ని మనోభావాలపై ఆధారపడి రాస్తున్నారు.




మావో మరణం తరువాత ప్రపంచవ్యాప్తంగా పీడకులు, మేధావులు, విప్లవకారులు అందరిలోనూ ఒక ఉత్కంఠ నెలకొన్నది. ఏమి కానున్నది, ఎవరు అధికారపు పగ్గాలు చేపట్ట బోతున్నారని ఎదురు చూపులు చూశారు. సాంస్కృతిక విప్లవానికి నాయకత్వం వహించిన మావో మూడవ భార్య చియాంగ్ చింగ్ నాయకత్వంలోకి వస్తుందా లేక డెంగ్ సియావో పింగ్ బృందం నాయకత్వంలోకి వస్తుందా అని అందరూ ఆతృతతో ఎదురు చూశారు. డెంగ్ సియావో పింగ్ చాలా తెలివిగా మధ్యేమార్గ వాది అయిన హువా కువొఫెంగ్‌ను ముందుకు తెచ్చాడు. అతనిని ముందుకు తోసి మెల్లగా సాంస్కృతిక విప్లవ వాదులను తప్పించి, వారిపై విచ్ఛిన్నకారులన్న ఆరోపణలు చేసి, విచారణ పేరుతో వారిని అపఖ్యాతి పాలు జేసి, శిక్షలు విధించి తమకు పార్టీలో అడ్డులేకుండా చేసుకున్నాడు.

చియాంగ్ చింగ్ అనుయాయులు కొన్ని అతివాద తప్పులు చేసినమాట వాస్తవమే కానీ వారి ఆలోచనా ధోరణి తప్పేమీ కాదు. సాంస్కృతిక విప్లవం నవ మానవుడు ఉద్భవించే క్రమానికి మావో చేసిన మహత్తర సమర్పణ. చియాంగ్ చింగ్ తలలో పుట్టిన అపభ్రంశ సిద్ధాంతం కాదు. సాంస్కృతిక విప్లవ సిద్ధాంతం ఇరవయ్యవ శతాబ్దంలో మార్క్సిస్టు ఆచరణకు మెరుగులు దిద్దింది. 'పిల్లి నల్ల దైనా తెల్ల దైనా ఎలుకలను పట్టగలిగినదైతే చాలు, రాజకీయాలు ఏవైనా ఉత్పత్తి పెరగాలి' అన్న డెంగ్‌ను సాంస్కృతిక విప్లవ కాలంలో పెట్టుబడిదారీ మార్గగామి అని విమర్శించి అధికార పదవుల నుంచి తొలగించి వేశారు. కానీ కాల క్రమంలో మావో మరణానంతరం డెంగ్ సియావో పింగ్ వర్గం పైచేయి సంపాదించి, అధికారం చేజిక్కించుకున్నది. అభివృద్ధి, ప్రజల జీవనస్థాయి మెరుగుపర్చడం, సోషలిస్ట్ వ్యవస్థ ఔన్నత్యాన్ని బలపరచడం వగైరా వాదనలతో తమ పథకాలను అమలు పరచటం మొదలు పెట్టారు.

డెంగ్ వర్గం అధికారం చేజిక్కించుకున్నది మొదలు 2017 వరకు జరిగిన పరిణామాలను పరిశీలించి, శాస్త్రీయంగా విశ్లేషించి, తన అభిప్రాయాలను ప్రొ. మనోరంజన్ మొహంతి China's Transformation అనే పుస్తక రూపంలో వెలిబుచ్చారు. మొహంతి చైనా అధ్యయనవేత్తగా జగద్విఖ్యాతుడు. ఢిల్లీ విశ్వవిద్యాలయంలో రాజకీయ శాస్త్ర ప్రొఫెసర్‌గా పనిచేశారు. నక్సల్‌బరీ, అనంతర విప్లవోద్యమాల పైన Revolutionary Violence అనే పుస్తకం గతంలో రాశారు. విప్లవోద్యమాల పైన, చైనా గురించి అనేక పరిశోధనా వ్యాసాలు, గ్రంథాలు రాశారు.

ప్రస్తుతం పరిచయం చేస్తున్న China's Transformation పుస్తకం తన ముప్ఫై సంవత్సరాల పరిశీలన, పరిశోధనల ఫలితం అని ఆయన చెప్పారు. రాజకీయాల జోలికి పోకుండా తన పరిశీలనలను నిజాయితీగా మన ముందుంచారు. 2018లో ప్రచురించబడిన ఈ పుస్తకం 2017 వరకు జరిగిన సంఘటనలు, వాస్తవాలను వివరించింది, వ్యాఖ్యానించింది.

ఆయన వుక్సీ ప్రాంతంలోని హేల పట్టణాన్ని తన పరిశోధనకు ఎంచుకున్నారు. ఆయన మాటల్లో చెప్పాలంటే అది మధ్యస్తంగా అభివృద్ధి చెందిన కమ్యూన్. అది వరి పండించే ప్రాంతం. అక్కడ ఉన్న తైహు చెరువులో చేపలు విరివిగా దొరికేవి. తరువాతి కాలంలో ఆ ప్రాంతం పారిశ్రామికంగానూ, పర్యాటక రంగంలోనూ అమితమైన అభివృద్ధిని సాధించింది. అక్కడ విదేశీ పెట్టుబడితో అయిదు నక్షత్రాల హొటల్ కూడా వచ్చింది. అందుకే ఆయన ఆ ప్రాంతాన్ని తన పరిశోధనా క్షేత్రంగా ఎంచుకున్నారు.

1978లో జరిగిన చైనా కమ్యూనిస్ట్ పార్టీ పదకొండవ సెంట్రల్ కమిటీ మూడవ ప్లీనరీ సమావేశం చైనా భవిష్యత్తుపై చాలా తీవ్రమైన ప్రభావం చూపే నిర్ణయాలను తీసుకున్నది. ఆ నిర్ణయాలు అప్పటివరకు చైనా ప్రజలు సోషలిజం పురోగమనంలో సాధించిన విజయాలను ఒక్క కలం పోటుతో రద్దు చేసి, పెట్టుబడిదారీ పునరుద్ధరణకు శంకుస్థాపన చేశాయి. ఆ నిర్ణయాలలో హౌజ్‌హోల్డ్ రెస్పాన్సిబిలిటీ సిస్టమ్ చాలా ముఖ్యమైనది. విప్లవయుద్ధ కాలంలోనే ప్రారంభమైన భూసంస్కరణలు 1954 నాటికి పూర్తయినాయి. రైతు కోఆపరేటివ్‌లు ఒక ప్రధానమైన ఘట్టం. ఆ తరువాత దశలు దశలుగా సమిష్టీకరణ ముందుకు సాగుతూ పోయింది. గ్రామ స్థాయిలో ప్రొడక్షన్ టీములు, తాలూకా స్థాయిలో ప్రొడక్షన్ బ్రిగేడ్లు, జిల్లా స్థాయిలో కమ్యూన్లు వేర్లు ఊనుకున్నాయి. రైతుల కుటుంబ అవసరాలకుగాను చిన్న చిన్న మడి చెక్కలు కేటాయించబడ్డాయి. అవి కుటుంబ అవసరాలకే కాకుండా అదనపు ఆదాయ వనరుగా కూడా ఉపయోగ పడేవి. ఆ మడిచెక్కలలో కూరగాయలసాగు, కోళ్ళ పెంపకం, పందుల పెంపకం వగైరా వ్యాపకాల ద్వారా రైతులు అదనపు ఆదాయం పొందేవారు. 1978లో చేపట్టిన సంస్కరణలతో వ్యవసాయోత్పత్తిని పెంచడం సాకుగా కుటుంబ జవాబుదారీ వ్యవస్థను కమూనిస్ట్ పార్టీ ప్రారంభించింది. దానికి కుటుంబ సభ్యుల సంఖ్యను ప్రాతిపదికగా తీసుకున్నారు. ఎక్కువ మంది సభ్యులున్న కుటుంబాలకు భూమిని కేటాయించడం మొదలు పెట్టారు. కమ్యూన్ వ్యవస్థలో ఉత్పత్తి ప్రణాళిక అంతా స్థానిక ప్రొడక్షన్ టీం చూసేది.

సంస్కరణల హయాంలో ప్రొవిన్షియల్ ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వం ఉత్పత్తి లక్ష్యాలు నిర్ణయించడం ప్రారంభమైంది. ఉత్పత్తి లక్ష్యాలకు మించి ఉత్పత్తి చేసినవారికి అధికధరలను చెల్లించడం ప్రారంభించారు. భూములు కేటాయించడంలో జనసామాన్యం పాత్ర తగ్గి పూర్తిగా ఆ అధికారం పూర్తిగా పార్టీ స్థానిక నాయకుల చేతుల్లోకి వెళ్ళింది. వారిని ప్రశ్నించే వారు లేకుండా పోయారు. సోషలిజానికి మూలకందాలైన ఉత్పత్తి సాధనాలపై సమిష్టిస్వామ్యం, ప్రజాస్వామ్యం, ప్రణాళికాబద్ధ ఆర్థిక వ్యవస్థ క్రమంగా కనుమరుగు కా జొచ్చాయి. నాయకుల అధికారానికి ఎదురు లేకపోవడంతో అవినీతికి అవకాశం ఏర్పడింది. తరువాత కాలంలో జాతీయ నాయకత్వం అవినీతికి వ్యతిరేకంగా పెద్ద కాంపెయిన్ చేపట్టవలసి వచ్చింది. ఆ కాంపెయిన్‌లో పెద్ద ఎత్తున పార్టీ ప్రముఖులను పదవుల నుండి తొలగించి, మరణశిక్షలతో సహా జైలు శిక్షలు విధించిన సంఘటనలు ప్రపంచానికి విదితమే.

తాత్కాలిక ప్రాతిపదిక మీద ప్రారంభమైన భూ కేటాయింపు అనవధికంగా మారిపోయింది. కుటుంబ బాధ్యతా వ్యవస్థ కాలక్రమేణ కాంట్రాక్ట్ వ్యవస్థగా మారిపోయింది. కాంట్రాక్ట్ వ్యవధి మొదట అయిదు, పది సంవత్సరాలుగా, తరువాత 30 సంవత్సరాలుగా మార్పు చేశారు. పలుకుబడి ఉన్నవాళ్లకు కాంట్రాక్ట్‌లు స్థిరంకాగా, సరిగా ఫలసాయం తీయలేని కుటుంబాలకు, పలుకుబడిలేనివారికి రద్దు చేయబడినాయి. ఆ విధంగా ప్రాథమిక పెట్టుబడిదారీ సంచయనం నిజమైన పెట్టుబడిదారీ అర్థంలో ప్రారంభమైంది. ఉత్పత్తి ఇబ్బడిముబ్బడిగా పెరిగిన మాట వాస్తవమే. తరువాత ఒకటి రెండు సంవత్సరాల తరువాత వ్యవసాయోత్పత్తుల ధరలు ప్రభుత్వం పెంచింది. దానితో గ్రామీణ పెట్టుబడి సమీకరణ మరింత పెరిగిపోయింది. దానికి తోడు అప్పటి వరకు వ్యవసాయోత్పత్తులను ప్రభుత్వమే కొనుగోలు చేసే పద్ధతి పోయి బహిరంగ మార్కెట్ ఏర్పడింది. మరొక వైపున కాంట్రాక్ట్ వ్యవస్థ స్థిర పడింది. తరువాత ఈ ప్రయోగం మిగతా రంగాలకు కూడా విస్తరించారు. లాభాలు సంపాదించిన కుటుంబాలు, వ్యక్తులు మార్కెట్లో గిరాకీ ఉన్న సరుకులను ఉత్పత్తి చేసేందుకు పథకాలు వేయనారంభించారు. దానిని విస్తృతీకరణ (డైవర్సిఫికేషన్) అని పిలిచారు. ఒకసారి పెట్టుబడిదారి మార్గంలో ప్రయాణం మొదలు పెడితే ఆ ప్రయాణం మొత్తం ఆర్థిక వ్యవస్థ ఆ ఊబిలో కూరుకుపోయే వరకు ఆగదు. అందుకే మొహంతి తన పుస్తకానికి ఉపశీర్షికగా 'విజయగాథ, విజయ ఊబి' (ది సక్సెస్ స్టోరి అండ్ ది సక్సెస్ ట్రాప్) అని పెట్టారు. ఆ మార్గంలో వెళ్తే బోనులో ఇరుక్కునే వరకు ప్రయాణం ఆగదు. ఉత్పత్తి సాధనాలపై వ్యక్తిగత ఆస్తి హక్కు, లాభం కోసం ఉత్పత్తి, అదనపు విలువ దోపిడి, ఆధిపత్యం కోసం, పలుకుబడి ప్రాంతాల కోసం ఆరాటం, వాణిజ్య యుద్ధాలు, సైనికీకరణ, దేశంలో ప్రజలపై అణచివేత మొదలైనవి మధ్యలో మజిలీలు. చైనాలోనూ సరిగా ఇలాగే జరిగింది. తీన్ ఆన్ మెన్ స్క్వేర్ దారుణం సంస్కరణలకు ఎదురైన ప్రజా ప్రతిఘటనను అణచివేసేందుకు డెంగ్ అనుయాయులు తీసుకున్న దమనకాండనే.

ఉత్పత్తి రంగంలో మొదలైన సంస్కరణలు వాటి ప్రభావాన్ని ఇతర రంగాలపైనా చూపించనారంభించాయి. అంతవరకు ప్రొడక్షన్ టీంలో ఎవరు ఏయే పనులు చేయాలి, ఏ పనికి ఎంతమంది అవసరం అనేది అక్కడి పార్టీ కమిటీ చూసుకునేది. ఎప్పుడైతే కుటుంబ బాధ్యతా వ్యవస్థ అమలులోకి వచ్చిందో అప్పట్నుంచి ఆ బాధ్యత ఎవరిదీ కాకుండా పోయింది. కుటుంబం తనకు అవసరమైనంత మందిని మాత్రమే పనులకు నియోగించేది. దాని ఫలితంగా నిరుద్యోగం పెరిగింది. ఆ నిరుద్యోగులు పట్టణ ప్రాంతాలకు వలసలు ప్రారంభించారు. వారు అంతకు ముందు స్థానిక సంస్థలలో సాంఘిక సంక్షేమ పథకాలలో నమోదు అయిఉన్నవారు. అంటే ఆసుపత్రులు, పిల్లల బడులు, రేషన్, గృహవసతి అన్నిటినీ స్థానిక ప్రొడక్షన్ టీం చూసుకునేది. నిరుద్యోగులు వలస వెళ్ళిన పట్టణాలలో ఈ వసతులు దొరకక చెప్పలేని ఇబ్బందులు పడ్డారు. కొన్ని సందర్భాలలో తీవ్రమైన శాంతిభద్రతల సమస్యలు తలెత్తాయి. వలస వెళ్ళిన వారు సాంకేతిక నిపుణులు కారు. పట్టణ ప్రాంతాలలో ఎక్కడైనా ఏదైనా పనిచేసి బతకగల్గిన సామర్థ్యం ఉన్నవారు కాదు. ప్రొడక్షన్ టీంలలో వ్యవసాయం చేసేవారు. అట్టివారు పట్టణాలలో సాంకేతిక నైపుణ్యం సంపాదించేందుకు సమయం పడ్తుంది. కుటుంబంలో ఒకరు ముఖ్యంగా స్త్రీలు స్వంత ఊరిలో ఉంటూ దొరికిన పని చేసుకుంటూ జీవితం వెళ్లమారుస్తుంటే, పురుషులు పట్టణాలకు వలసలు వెళ్తూ వచ్చారు. ఈ పరిస్థితి మనం తెలంగాణ గ్రామీణ ప్రాంతాలలోనూ ఉత్తర భారత గ్రామీణ ప్రాంతాలలోనూ తరుచూ కనిపించే దృశ్యం. వయసులో ఉండే పురుషులు గల్ఫ్ దేశాలకు, దేశంలోని దూరదూర ప్రాంతాలకు వలస వెళ్తే, ముసలివారు, పిల్లలు, స్త్రీలు ఊరిలో బతుకు వెళ్లదీస్తూ ఉంటారు. వర్గ పీడనలో మగ్గుతున్న భారతదేశానికి, సోషలిజం వైపు పయనిస్తున్నట్టు చెప్పుకుంటున్న చైనాకు ఏమీ తేడాలేకుండా పోయింది.

సంస్కరణలతో పాటు నాలుగు రంగాల ఆధునికీకరణ కూడా లక్ష్యంగా 1978 ప్లీనంలో నిర్ణయించబడింది. 1) వ్యవసాయం, 2) పరిశ్రమలు, 3) శాస్త్రసాంకేతిక నైపుణ్యాలు, 4) రక్షణ వ్యవస్థ. ఈ రంగాల ఆధునికీకరణకు సంస్కరణలే కాకుండా, తలుపులు తెరిచే విధానాన్ని (ఓపెన్ డోర్ పాలసీ) కూడా పార్టీ ప్రకటించింది. ఈ విధాన ప్రకటన కీలకమైన ములమలుపుగా పరిగణించవచ్చు. దాని ఫలితంగా చైనాలోని మారుమూల ప్రాంతాలలో స్థానిక పారిశ్రామిక సంస్థలు దేశ విదేశాల్లోని పెట్టుబడిదారీ సంస్థలతో ఒప్పందాలు కుదుర్చుకొని, వాటితో కలసి వివిధ పరిమాణాల పారిశ్రామిక, వ్యాపార వాణిజ్య, సేవారంగ సంస్థలను ప్రారంభించారు.

1978 నుండి టౌన్‌షిప్ అండ్ విలేజ్ ఎంటర్‌ప్రైసెస్ (టివిఇ) అనే పేరుతో చిన్న మధ్య స్థాయి పరిశ్రమలు ప్రారంభించబడ్డాయి. వాటిని కలెక్టివ్‌లు తమ మిగులు నిధులతో ప్రారంభించాయి. కొంత మొత్తాలు బాంకులు రుణాలనందించాయి. ప్రభుత్వం మూడు సంవత్సరాల పాటు పన్నుల నుంచి మినహాయింపును, ఇతర రాయితీలను కల్పించింది. కొత్త సంస్కరణల వలన ఉపాధి కోల్పోయి, నిరుద్యోగులయిన గ్రామీణ ప్రజానీకానికి ఈ టివిఇలు చాలమట్టుకు

ఉపాధిని కల్పించాయి. ఇవి స్థానికంగా దొరికే ముడిసరుకులతో మార్కెట్లో గిరాకీ ఉన్న సరుకులను, సేవలను, పశువుల పెంపకం, చేపల పెంపకం, మాంస పరిశ్రమ, కనీస సాంకేతిక పరిజ్ఞానంతో తయారయ్యే వినియోగ వస్తువులు, యంత్ర వస్తువులు, వాణిజ్యం చేపట్టాయి.

చైనా గ్రామీణ ప్రజల తలసరి ఆదాయం 1978లో 255 యువాన్లు కాగా 1988 నాటికి 545 యువాన్లకు 1991 నాటికి 710 యువాన్లకు ఎగబాకింది. ఈ పెరుగుదల చాలమట్టుకు ఈ గ్రామీణ పరిశ్రమలు, వాణిజ్య సంస్థల వలననే జరిగినది. 1990ల నాటికి ఇవి ఎదుగుదల చూపలేని స్థితిలో పడిపోయినాయి. ఈ సంస్థలు ఉత్పత్తి చేసిన సరుకుల నాణ్యత సరిగా లేకపోవడం, ఇంధనాన్ని, ముడి సరుకులను వృధా చేయడం, వీటి కారణంగా వాతావరణ కాలుష్యం ప్రమాదకరమైన స్థాయికి పెరిగిపోవడం మొదలైన కారణాల వలన ప్రభుత్వం ఈ టివిఇల విధానాన్ని పునర్విమర్శ చేసింది. జరుగుతున్న లోపాలను సరిదిద్దేందుకు, కొత్త టెక్నాలజీని సంతరించుకునేందుకు, వీటి వద్ద నిధులు లేవు. చైనాలో అప్పటివరకు కేంద్ర సంస్థలు, రాష్ట్ర సంస్థలు, ప్రైవేటు సంస్థలు, జాయింట్ స్టాక్ సంస్థలు, కార్పొరేట్ సంస్థలు ఉన్నాయి. ఇప్పుడు ఈ టివిఇలకు ప్రైవేట్, జాయింట్ స్టాక్ సంస్థలు, కార్పొరేట్ సంస్థలతో విలీనం కావడం తప్ప వేరే మార్గం లేకుండా పోయింది. ఎందుకంటే వీటి వద్ద నిధులు లేవు. ప్రభుత్వానికి నిధులు ఇచ్చే ఉద్దేశ్యం లేదు. కనుక పునర్వ్యవస్థీకరణ కోసం వివిధ రకాలైన ప్రైవేటు సంస్థల్లో విలీనం కాక తప్పలేదు. ప్రైవేట్ సంస్థలకు లాభసాటిగా అన్పించని టివిఇలు పూర్తిగా మూత బడ్డాయి.

కుటుంబ బాధ్యతా వ్యవస్థ , కాంట్రాక్ట్ పద్ధతి అమలులోకి వచ్చినా తరువాత, వ్యవసాయోత్పత్తులు బహిరంగ మార్కెట్లో విక్రయించబడడం ప్రారంభమైన తరువాత, వ్యవసాయోత్పత్తుల ధరలు పెంచబడిన తరువాత గ్రామీణ ప్రాంతాల్లో పెట్టుబడి సంచయం ప్రారంభమైంది. అక్కడక్కడ జాయింట్ స్టాక్ పరిశ్రమలు ప్రారంభమైనయి. అవి పక్కాగా పెట్టుబడిదారీ మార్గంలోనే లాభాలకోసమే నిర్వహించబడుతుండేవి. వాటి నిర్వహణకు మేనేజర్లు, డైరెక్టర్లు ఉండేవారు. ఉత్పత్తి ఆధారితంగానే వారి జీతభత్యాలు ఉండేవి. ఆ సంస్థలకు రాష్ట్ర ప్రభుత్వం లేదా స్థానిక పరిపాలనా సంస్థ ఉత్పత్తి కోటాలు నిర్దేశిస్తుంది. ఆ కోటాకు మించి ఉత్పత్తి చేసినట్టయితే మేనేజిమెంట్‌కు ప్రోత్సాహకం దక్కేది.

1949లో చైనా ప్రజా రిపబ్లిక్ నెలకొన్న నాటి నుండి అట్టడుగు స్థాయి పాలన, సమష్టి ఉత్పత్తి నిర్వహణ గ్రామ కమిటీలు, ప్రొడక్షన్ టీంలు, విప్లవ కమిటీలు పార్టీ గైడెన్స్‌లో నిర్వహించేవి. సంస్కరణలు మొదలైన తరువాత ఆ కమిటీలు క్రమక్రమంగా ప్రజా సంఘాల స్థాయిని సంతరించుకున్నాయి. వాటి స్థానంలోకి మేనేజర్లు వచ్చారు. వారే పరిశ్రమలో జరిగే అన్నిటికి బాధ్యులు. పార్టీ కమిటీ ఉన్నా యూనిట్ కార్యదర్శికి పరిపాలనలో, కార్యకలాపాల నిర్వహణలో కనీస పాత్రే. అనివార్యంగా మేనేజర్ పార్టీ కమిటీలో ఉపకార్యదర్శిగా ఉంటాడు. కొన్ని సందర్భాలలో మేనేజరే పార్టీ కమిటీ కార్యదర్శిగా కూడా ఉండే వాడు. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు నిర్ణయించే విధానాలను అమలులోకి తేవడమే. తాము పనిచేస్తున్న సంస్థ తమదేనన్న భావన కార్మికులకు, ఉద్యోగులకు లేకుండా పోయింది. కార్మికులు నిర్వహణలో పాత్ర నిర్వహించడాన్ని నాయకత్వం అనవసర జోక్యంగా భావించ నారంభించింది. అందుకే పరిశ్రమ నిర్వహణలో కార్మికులకు, ఉద్యోగులకు పాత్ర లేకుండా చేసింది. సంస్కరణలకు పూర్వం విదేశీ అతిథులను యూనిట్ పార్టీ కార్యదర్శి ఎదురుకొనేవాడు, వారికి స్వాగత సత్కారాలు అందించి, తమ సంస్థ కార్యకలాపాలను వివరించే వాడు. ఆ పరిస్థితి మారిపోయిందని మొహంతి పలు సందర్భలలో పేర్కొన్నాడు.

వివిధ వ్యవస్థాగత వ్యవహారాలలో కార్మికవర్గ ప్రజాస్వామికం నుండి ఒక్కొక్క అడుగు వెనకకు వేస్తూ పోయిన చైనా వ్యవస్థ విద్య, వైద్యం, మహిళా ప్రాతినిధ్యం లాంటి ప్రజా సంక్షేమ కార్యకలాపాల లోనూ తమ బాధ్యతల నుండి తప్పుకొన్నది. స్థానిక కమ్యూన్ ఈ బాధ్యతలను అందుబాటులో ఉన్న వనరులతో విద్య, వైద్య సదుపాయాలను కల్పించేది. కమ్యూన్, ఉత్పత్తి బ్రిగేడ్, ఉత్పత్తి టీంలు ప్రజా సంఘాల స్థాయికి దిగజార్చబడిన తరువాత సంక్షేమ కార్యక్రమాలు నిర్వహించే అధికారాలు, నిధులు, వనరులు లేక సంక్షేమ కార్యకలాపాలు మూలబడి కుంటినడక నడిచాయి. వాటి స్థానాన్ని ప్రైవేటు విద్యాలయాలు, ప్రైవేటు వైద్యాలయాలు తీసుకున్నాయి. ఆ క్రమం పరాకాష్టే విదేశీయులకు వైద్య విద్యనందించే మెడికల్ కాలేజీలు. 1949 విప్లవానంతరం మహిళలను వంట ఇంటి నుంచి విముక్తి చేయడం కమ్యూనిస్ట్ పార్టీ ప్రత్యేక కార్యక్రమంగా తీసుకున్నది. కానీ 1978 సంస్కరణల అనంతరం పార్టీలో, ప్రభుత్వంలో మహిళల పాత్ర, ప్రాతినిధ్యం తగ్గుతూ వస్తున్నాయని మొహంతి సోదాహరణంగా సంఖ్యా వివరాలతో పేర్కొన్నారు.

నూతన ప్రజాస్వామిక రిపబ్లిక్‌గా పయనం ఆరంభించిన చైనా 1978 నుండి సోషలిస్ట్ మార్గంలో కొనసాగటం లేదన్నది ఈ పుస్తకం చదివిన తరువాత నాకు కలిగిన భావన. 44 సంవత్సరాలుగా పాలన సాగించిన, సాగిస్తున్న నాయకత్వం ఈ క్రమానికి 'చైనా విశిష్ట లక్షణాలు గల సోష్యలిజం' అని, 'మార్కెట్ సోషలిజం' అని ఫాన్సీ పేర్లు తగిలించి అసలు స్వరూపాన్ని కప్పిపుచ్చ చూస్తున్నారు.

వీ

*మానవ ఆలోచన భౌతిక సత్యాన్ని గ్రహించగలదా అనేది సైద్ధాంతిక ప్రశ్న కాదు. అది ఆచరణలో తేలే ప్రశ్న. సత్యాన్ని, అంటే, తన ఆలోచనకు సంబంధించిన వాస్తవికతనూ, శక్తినీ, తాను చూసే పార్శ్వాన్నీ మనిషి ఆచరణలోనే రుజువు చేయవలసి ఉంటుంది. ఆలోచన వాస్తవికమైనదా, అవాస్తవికమైనదా అనే వివాదాన్ని ఆచరణ నుంచి వేరు చేస్తే అది కేవలం పండిత చర్చే అవుతుంది.*

**– కార్ల్ మార్క్స్**

### గిరిజన యూనివర్సిటీ కోసం కలెక్టర్ అడ్డగింత

గిరిజన యూనివర్సిటీ కోసం ఆదిలాబాద్ జిల్లాలో జనవరి 3న విద్యార్థి సంఘాల నేతలు చేపట్టిన ఆందోళన ఉద్రిక్తంగా మారింది. ఆందోళనకారులు కలెక్టర్ వాహనాన్ని అడ్డుకోవడంతో పోలీసులు లాఠీ చార్జీ చేశారు. జిల్లాలో గిరిజన యూనివర్సిటీని ఏర్పాటు చేయాలని విద్యార్థి సంఘాల నేతలు ఆదిలాబాద్‌లోని ఆర్ అండ్ బి విశ్రాంతి భవనం నుంచి కలెక్టర్ కార్యాలయం వైపు ర్యాలీ నిర్వహించారు. అదే సమయంలో వచ్చిన కలెక్టర్ వాహనాన్ని అడ్డుకొని ధర్నాకు దిగారు. దీంతో పోలీసులు లాఠీ చార్జీ చేసి ఏడుగురు ఆందోళన కారుల్ని అరెస్టు చేశారు.

### విరసం 28వ మహాసభలు

విప్లవ రచయితల సంఘం 28వ మహాసభలు నెల్లూరు జిల్లా కోవూరు మండలం పడుగుపాడులోని సుందరయ్య కళ్యాణ మండపంలో జనవరి 8-9 తేదీల్లో 'సంస్కృతి - మార్క్సిజం' ఇతివృత్తం కేంద్రంగా జరిగాయి. రచయిత్రి వి. ప్రతిమ ప్రారంభోపన్యాసం చేశారు. సభలో కీనోట్ పేపర్: 'సంస్కృతి-మార్క్సిజం' పాణి ప్రవేశపెట్టారు. 'సాంస్కృతిక ఆధిక్యాలు-పితృస్వామ్యం, కులం, మతం', 'సంస్కృతి: దేశీయత-హేతుచింతన', సంస్కృతి కోసం పోరాటాలు -వర్గపోరాటం' అంశాలపై వక్తలు ప్రసంగించారు. బహిరంగ సభలో వక్తలు మోడీ ప్రభుత్వం దేశ సంపదను బడా పెట్టుబడిదారులకు కట్టబెడుతూ గిరిజన, అటవీ ప్రాంత ప్రజలపై యుద్ధం ప్రకటించిందన్నారు. మరోవైపు ఆదివాసులకు అండగా నిలుస్తున్న మేధావులను ఊపా చట్టాలతో నిర్బంధానికి గురిచేస్తుందన్నారు. విరసం నూతన అధ్యక్షుడుగా అరసవెల్లి కృష్ణ, కార్యదర్శిగా రివేరా, ఆరుగురు కార్యవర్గ సభ్యులను ఎన్నుకున్నారు.

### మీడియా స్వేచ్ఛ-ప్రజాస్వామ్య పరిరక్షణ

మీడియాకు స్వేచ్ఛ ఉన్నప్పుడే ప్రజలకు స్వేచ్ఛ ఉన్నట్టని ఎంఎల్ఏ ఈటెల రాజేందర్ తెలిపారు. 'మీడియా స్వేచ్ఛ-ప్రజాస్వామ్య పరిరక్షణ' అంశంపై తెలంగాణ జర్నలిస్టుల అధ్యయన వేదిక ఆధ్వర్యంలో సోమాజిగూడ ప్రెస్‌క్లబ్‌లో జనవరి 8న రౌండ్ టేబుల్ సమావేశంలో ఈటెల రాజేందర్ మాట్లాడారు. హక్కులు, పత్రికలపై దాడుల వల్లే ప్రభుత్వం పతనం ప్రారంభమవుతుందన్నారు. వీడియో, డిజిటల్ జర్నలిస్టులపై పోలీసులు చేస్తున్న దాడులను ఆంధ్రజ్యోతి సంపాదకులు కె. శ్రీనివాస్ ఖండించారు. సామాజిక మాధ్యమాల వల్ల తప్పుడు వార్తల ప్రచారం జరుగుతుందనే నెపంతో మీడియాపై దాడి చేయడం సరికాదన్నారు. మీడియా అంతా ఒక్కటేనని, పత్రికా స్వేచ్ఛ ప్రజలకు రక్షణ కల్పిస్తుందని సీనియర్ పాత్రికేయులు శ్రీనివాస్ రెడ్డి అన్నారు. ప్రజలంతా జర్నలిస్టులేనని సీనియర్ పాత్రికేయులు పాశం యాదగిరి అన్నారు.

### చింతామణి నాటకం పై నిషేధం

చింతామణి నాటకం ప్రదర్శనపై ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం నిషేధం విధించింది. ఈ మేరకు పర్యాటక, సాంస్కృతిక శాఖ జనవరి 17న ఉత్తర్వులు జారీచేసింది. కాళ్లకూరి నారాయణరావు రచించిన ఈ నాటకాన్ని ముద్రించేనాటికే దేశమంతటా 446 సార్లు ప్రదర్శితమై విశేష ప్రజాదరణ పొందింది. చింతామణి నాటకం శత జయంతి ఉత్సవాల సందర్భంగా ఈ నాటకాన్ని నిషేధించాలని ఆర్య వైశ్య సంఘాలు డిమాండ్ చేస్తూ పలు ప్రాంతాల్లో నిరసన వ్యక్తం చేశారు. చింతామణి నాటకాన్ని నిషేధించడం అప్రజాస్వామికమని, ప్రభుత్వం వెంటనే జీఓను రద్దు చేయాలని విజయవాడ బాలోత్సవ భవన్‌లో ప్రజానాట్య మండలి ఆధ్వర్యాన పలు కళా సంస్థలు, పౌరాణిక, రంగస్థల కళాకారులతో జనవరి 19న చర్చా వేదిక నిర్వహించారు.

### కలెక్టరేట్ల ముందు పుర, నగరపాలక కార్మికుల ధర్నా

తమ ఉద్యోగాలను క్రమబద్ధీకరించి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు అమలు చేస్తున్న పిఆర్‌సి తమకూ వర్తింపజేయాలని డిమాండ్ చేస్తూ పుర, నగరపాలక సంస్థల్లోని ఔట్‌సోర్సింగ్ సేవల కార్మికులు జనవరి 19న రాష్ట్ర వ్యాప్తంగా కలెక్టరేట్, ఆర్‌డిఓ, పురపాలక కార్యాలయాల ముందు ధర్నా చేశారు. విజయవాడలోని ధర్నా చౌక్ వద్ద నిర్వహించిన కార్యక్రమంలో ఏపి పురపాలక కార్మికులు, ఉద్యోగుల సమాఖ్య రాష్ట్ర ప్రధాన కార్యదర్శి పాల్గొన్నారు. సమాన పనికి సమాన వేతనం అందించాలని, కార్మికుల సమస్యలను తీర్చకపోతే నిరసనలను తీవ్రతరం చేస్తామన్నారు.

### ఆంధ్రప్రదేశ్‌లో మెడికల్ రిప్స్ ధర్నా

కార్పొరేట్లకు, యాజమాన్యాలకు అనుకూలంగా మారిన లేబర్ కోడ్‌లను వెంటనే రద్దు చేయాలని ఆంధ్రప్రదేశ్ మెడికల్ అండ్ సేల్స్ రిప్రజెంటేటివ్ యూనియన్ డిమాండ్ చేసింది. పాత కార్మిక చట్టాలను సక్రమంగా అమలు చేయాలని కోరుతూ జనవరి 19న సూర్యారావుపేటలోని దోర్నకల్ రోడ్డులో జరిగిన ధర్నా కార్యక్రమంలో యూనియన్ ప్రధాన కార్యదర్శి మాట్లాడారు. కేంద్ర ప్రభుత్వం మార్చిన కార్మిక చట్టాలతో సేల్స్ ప్రమోషన్ ఎంప్లాయిస్ చట్టం కూడా మారి పోరాడి సాధించుకున్న హక్కులను హరించివేస్తోందన్నారు. కరోనా కాలంలో అనేక మంది మెడికల్ రిప్రజెంటేటివ్స్ ఉపాధి దెబ్బతిందన్నారు. ప్రజలపై భారాలు వేసే విధానాలను విడనాడాలని కేంద్ర ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు.

### సమాజ సంక్షోభాన్ని ప్రతిబింబిస్తున్న హత్యలు, ఆత్మహత్యలు

పండించిన పంటకు గిట్టుబాటు ధరలు లేక, ప్రకృతి వైపరీత్యాల వల్ల పంట నష్టపోయి ప్రభుత్వ సహాయం అందక, చేసిన అప్పులు తీర్చలేక రైతులు నిత్యం ఏదో మూలన ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. కులాంతర, మతాంతర వివాహాలు చేసుకున్నారనే కారణంతో జరుగుతున్న హత్యలు, వరకట్న హత్యలు, ఎన్‌కౌంటర్ మరణాలు, దళిత, ముస్లిం, ఆదివాసులపై నిత్యం కొనసాగుతున్న దాడులతో పాటు అనేక సామాజిక సంక్షోభాలను సమాజం ఎదుర్కొంటోంది. ప్రధానంగా ప్రభుత్వం అమలు చేస్తున్న పెట్టుబడి అనుకూల విధానాల వల్ల ఉపాధి కోల్పోయి తీవ్ర ఆర్థిక సమస్యలతో కుటుంబాలు సామూహికంగా ఆత్మహత్యల బారిన పడుతున్నాయి. ఇవన్నీ పెను సమస్యగా మారే ప్రమాదం ఉంది.

### 317 జీఓ రద్దుచేయాలని ఉపాధ్యాయుల ఆందోళన

తెలంగాణ ప్రభుత్వం తెచ్చిన జీఓ 317ను తక్షణమే రద్దుచేయాలని ఉపాధ్యాయులు ఆందోళన వ్యక్తంచేస్తున్నారు. రాష్ట్రంలో ప్రస్తుతం జరుగుతున్న బదిలీలపై సుమారు 8 నుంచి 10 వేల మంది ఉపాధ్యాయులు అభ్యంతరాలను వ్యక్తం చేశారన్నారు. అయితే ఇందులో రెండు వేల మంది వరకు స్పౌస్ కేసులు ఉన్నట్టు అధికారులు గుర్తించారు. భార్య భర్తలను వేర్వేరు జిల్లాలకు కేటాయించడం ప్రభుత్వం జారీ చేసిన ఉత్తర్వులకు విరుద్ధం. కాబట్టి ఈ జీఓ 317ను ఉపసంహరించాలన్నారు. సీనియారిటీ జాబితాలను సక్రమంగా రూపొందించాలని, తాత్కాలిక ప్రాతిపదికన పాఠశాలలు కేటాయించి సాధారణ బదిలీల్లో శాశ్వత నియామకాలు చేపట్టాలని, భార్యభర్తలను ఒకే జిల్లాకు కేటాయించాలని, వితంతువులు, ఒంటరి మహిళలకు ప్రాధాన్యం ఇవ్వాలని డిమాండ్ చేస్తూ ఉపాధ్యాయ సంఘాల పోరాట కమిటీ డిసెంబర్ 28న సచివాలయం ముట్టడికి పిలుపునిచ్చింది. దీంతో సచివాలయం చుట్టూ భారీగా మోహరించిన పోలీసులు ఉపాధ్యాయులను అరెస్ట్ చేశారు.

### ఆంధ్రప్రదేశ్‌లో ఉద్యోగ, ఉపాధ్యాయుల ఆందోళన

వేతన సవరణపై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ జీఓలను వ్యతిరేకిస్తూ ఉపాధ్యాయులు, ఉద్యోగులు పెద్దఎత్తున నిరసన వ్యక్తం చేస్తున్నారు. పోలీసులు నోటీసులిచ్చినా, ముళ్ల కంచెలు, బారికేడ్లతో నిలువరించినా లెక్కచేయకుండా వేలాది మంది జనవరి 20న కలెక్టరేట్లకు చేరుకున్నారు. జిల్లాల పాలనా కార్యాలయాలను స్తంభింపజేశారు. రివర్స్ పిఆర్‌సిని రద్దు చేసేవరకు వెనక్కి తగ్గేది లేదని ఆందోళనలో పాల్గొంటున్నారు. ఉపాధ్యాయ సంఘాల సమాఖ్య పిలుపు మేరకు రాష్ట్రంలోని అన్ని జిల్లాల కలెక్టరేట్లను ఉపాధ్యాయులు ముట్టడించారు. అయినా ప్రభుత్వం దిగిరాకపోవడంతో ఉద్యోగ సంఘాలు ఫిబ్రవరి 6వ తేదీ నుంచి సమ్మెకు వెళ్లనున్నట్లు ప్రకటించాయి. వీ

### బుల్లీబాయ్ నిందితుల అరెస్టు

**ము**స్లిం మహిళల ఫొటోలను ప్రదర్శిస్తూ, వేలానికి పెట్టిన దారుణ యాప్ బుల్లీబాయ్ కేసులో ప్రధాన నిందితురాలిని ముంబై పోలీసులు ఉత్తరాఖండ్‌లో అరెస్టు చేశారు. బుల్లీబాయ్ యాప్ పై జనవరి 1న శివసేన ఎంపి ప్రియాంక చతుర్వేది ట్విటర్‌లో స్పందిస్తూ కేంద్ర ఐటి శాఖ మంత్రికి ట్యాగ్ చేసింది. దాంతో కేంద్రం ఈ విషయంపై మైక్రోసాఫ్ట్ అనుబంధ గిట్‌హబ్‌ను సంప్రదించి, బుల్లీబాయ్‌ని బ్లాక్‌చేసింది. ప్రియాంక ఫిర్యాదుపై ముంబై పోలీసులు, బాధితురాలైన ఓ మహిళా జర్నలిస్టు ఫిర్యాదుపై ఢిల్లీ ఆగ్నేయ మండల సైబర్‌క్రైమ్ పోలీసులు దర్యాప్తుచేసి బుల్లీబాయ్ యాప్‌కు సంబంధించిన అన్ని సాంకేతిక ఆధారాలు తెలుసుకొని జనవరి 3న బెంగుళూరులో విశాల్‌కుమార్ అనే ఇంజనీరింగ్ విద్యార్థిని అరెస్టు చేశారు. విశాల్ ఇచ్చిన సమాచారంతో జనవరి 4న ఉత్తరాఖండ్‌లో ఓ మహిళను పోలీసులు అదుపులోకి తీసుకున్నారు.

### ఐదు రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికలకు షెడ్యూలు విడుదల

**ఉ**త్తరప్రదేశ్, గోవా, మణిపూర్, పంజాబ్, ఉత్తరాఖండ్ రాష్ట్రాల్లో ఎన్నికలకు సంబంధించి కేంద్ర ఎన్నికల సంఘం ఎన్నికల షెడ్యూలు విడుదల చేసింది. మొదటి దశ పోలింగ్ ప్రక్రియ ఫిబ్రవరి 10న ప్రారంభమై మార్చ్ 7న ముగుస్తుందని ఎన్నికల ప్రధాన కమిషనర్ (సిఇసి) సుశీల్ చంద్ర జనవరి 8న ప్రకటించారు. మార్చ్ 10న ఓట్ల లెక్కింపు చేపడతామన్నారు. ఉత్తరప్రదేశ్‌లో ఏడు విడతల్లో, మణిపూర్ రెండు విడతల్లో, పంజాబ్, గోవా, ఉత్తరాఖండ్ రాష్ట్రాల్లో ఒక్కో విడతలో ఎన్నికలు నిర్వహిస్తామని వెల్లడించారు.

### పోలీసుల చిత్రహింసలకు ఆదివాసి మృతి

**త**మిళనాడులోని సేలం జిల్లాలోని కరుప్పూర్‌లో వికలాంగుడైన షెడ్యూల్డ్ తెగ (ఎస్‌టి)కి చెందిన ప్రభాకర్, అతని భార్య అంశలను నమక్కల్ జిల్లాలోని పోలీసులు జనవరి 8న నగల చోరీ కేసులో ఇంటి నుండే కొట్టుకుంటూ పట్టుకెళ్లారు. జనవరి 12న ప్రభాకర్ కుటుంబ సభ్యులకు పోలీసుల నుండి ఓ ఫోన్ వచ్చింది. ప్రభాకర్ సేలంలోని ప్రభుత్వ మెడికల్ కాలేజ్ అండ్ హాస్పిటల్‌లో ఉన్నారని చెప్పారు. కుటుంబ సభ్యులు హాస్పటల్‌కు వెళ్ళగా ప్రభాకర్ భార్య అంశను సేలంలోని మహిళా జైలుకు పంపారని అక్కడే తెలిసింది. ప్రభాకర్ ఆరోగ్య పరిస్థితి ఆందోళనకరంగా ఉండటంతో సేలం జనరల్ ఆసుపత్రికి తీసుకెళ్లగా అతను అక్కడే మరణించాడు. 'ది న్యూస్ మినట్' ప్రకారం పోలీసు కస్టడీలో తీవ్ర చిత్రహింసలపాలు చేశారనే ఆరోపణల నేపథ్యంలో దంపతులను అదుపులోకి తీసుకున్న ముగ్గురు పోలీసు అధికారులను సస్పెండ్ చేశారు.

### తమలపాకు రైతుల మీద లాఠీచార్జ్

**ఒ**డిస్సాలోని జగత్‌సింగ్‌పూర్ జిల్లాలో జనవరి 14న తమలపాకు రైతులపై పోలీసులు లాఠీచార్జ్ చేయగా 30 మంది గాయపడ్డారు. ఢింకియా గ్రామ పంచాయితీలోని తమలపాకు తోటలను జిందాల్ స్టీల్ వర్క్స్ పరిశ్రమ నిర్మాణం కోసం ధ్వంసం చేయటాన్ని నిరసిస్తూ ప్రజలు తిరగబడ్డారు. సాలీనా 132 కోట్ల టన్నుల ఉక్కును తవ్వి తీయటానికి ఉద్దేశించిన ఈ జిందాల్ పరిశ్రమ ఏర్పాటైతే రైతుల జీవనోపాధి పోతుంది. అందుకే జిందాల్ స్టీల్ వర్క్స్‌కు వ్యతిరేకంగా 'జిందాల్ స్టీల్ వర్క్స్ ప్రతిరోధ్ సమితి' నాయకత్వాన ప్రతిఘటనా పోరాటం జరుగుతోంది. పోలీసులు రైతులు కట్టిన బారికేడ్లను పడగొట్టి, తోటలను ధ్వంసం చేసి రైతులను అరెస్టు చేశారు.

### మైసూరు జిల్లాలో దళితులపై అగ్రవర్ణాల దాడి

**క**ర్ణాటక రాష్ట్రం మైసూరు జిల్లాలోని అరిసినకెరె గ్రామంలో దళితులపై అగ్రవర్ణాల దాడి ఘటనలో పోలీసులు ఆరుగురు నిందితులను అరెస్టు చేశారు. పోలీసుల కథనం ప్రకారం అరిసినకెరె గ్రామానికి చెందిన ముగ్గురు దళితులు పానీపూరి తినేందుకు జనవరి 13 సాయంత్రం గ్రామంలోని ప్రధాన వీధిలోకి వెళ్లారు. ఆ సమయంలో అక్కడే ఉన్న అగ్రవర్ణాలకు చెందిన ఇద్దరు యువకులు దళిత యువకుల్ని మీరు గ్రామం లోపలికి వచ్చి పానిపూరి తింటారా అని గొడవకు దిగి దాడికి పాల్పడ్డారు. ఈ విషయం బయటికి రాకుండా రాజీ ప్రయత్నాలు జరిగాయి. అయినా కూడా జనవరి 14 ఉదయం అగ్రవర్ణాల వారు దళితుల ఇళ్లలోకి చొరబడి దాడిచేశారు. ఘటనకు సంబంధించి బాధితుల పిర్యాదు మేరకు ఎస్.సి, ఎస్.టి అట్రాసిటీ, హత్యాయత్నం సెక్షన్ల కింద కేసులు నమోదు చేసి ఆరుగురు నిందితుల్ని అరెస్టు చేశారు.

### భారతదేశంలో కరోనాతో తీవ్రమైన ఆర్థిక అంతరాలు

**క**రోనా సంక్షోభంతో భారతదేశంలో ఆర్థిక అసమానతలు మరింత పెరిగాయని ఆక్స్‌ఫామ్ ఇండియా తాజా నివేదిక హెచ్చరించింది. ఇంత కష్టకాలంలోనూ ధనవంతులు మరింత ధనవంతులుగా మారగా సగటు జీవి మాత్రం ఆదాయం కోల్పోయి తీవ్ర ఇబ్బందులు పడుతున్నారని ఆందోళన వ్యక్తం చేసింది. గత ఏడాదిలో భారత బిలియనీర్ల సంఖ్య 102 నుండి 142కు చేరిందని, అదే సమయంలో 84 శాతం కుటుంబాల ఆదాయం గణనీయంగా తగ్గిందని తెలిపింది. గత ఏడాది దేశంలోని టాప్-100 శ్రీమంతుల మొత్తం సంపద ఒక దశలో రికార్డు గరిష్ట స్థాయి రు. 57.3 లక్షల కోట్లకు పెరిగింది. కరోనా సంక్షోభ కాలంలో భారత బిలియనీర్ల మొత్తం సంపద రు. 23.14 లక్షల కోట్ల నుంచి రు. 53.16 లక్షల కోట్లకు చేరుకుంది. ప్రభుత్వ ఆర్థిక విధానాలు పేదలు, సగటు జీవుల కంటే ధనవంతులకే అనుకూలంగా ఉండడమే ఆర్థిక అసమానతలకు కారణం. కరోనా ఆరోగ్య సంక్షోభంగా మొదలై ఆర్థిక సంక్షోభంగా మారింది.

### గవర్నర్‌ను కలవడానికి వెళ్లిన ఆదివాసుల అరెస్టు

**ఛ**త్తీస్‌గఢ్, జార్ఖండ్‌లలో గత తొమ్మిది నెలలుగా సాగుతున్న సైనిక క్యాంపుల వ్యతిరేక పోరాటంపై పోలీసుల అణచివేత తీవ్రమైంది. ఆదివాసీ ప్రాంతాల్లో గ్రామ సభల నిర్ణయం లేకుండా ప్రభుత్వం ఏ చర్యలూ తీసుకోడానికి వీల్లేదని ఆదివాసీ ప్రజల హక్కుల పరిరక్షణ కోసం రాజ్యాంగం గవర్నర్లకు విశేష అధికారాలను కట్టబెట్టింది. అయినా కూడా సైనిక క్యాంపుల వ్యతిరేక పోరాటం పట్ల ప్రభుత్వంకానీ, గవర్నర్లుగానీ, రాజకీయ నాయకులుగానీ స్పందించకపోవడంతో తమ సమస్యను గవర్నర్‌కు వివరించడానికి ఆదివాసులు సిద్ధమయ్యారు. గవర్నర్ అనసూయ ఉయికే కొండగావ్‌లో ఉన్న విషయం తెలుసుకొని ఆదివాసులు జనవరి 21న వెళుతున్న క్రమంలోనే సుకుమా దగ్గర పోలీసులు అరెస్టు చేశారు. ఈ అరెస్టును ప్రముఖ రచయిత్రి నందినీ సుందర్ ఖండించారు.

### యుద్ధ వాతావరణాన్ని తలపిస్తున్న ఎన్‌కౌంటర్‌లు

**తె**లంగాణ-ఛత్తీస్‌గఢ్ సరిహద్దుల్లో డిసెంబర్ 27న జరిగిన ఎన్‌కౌంటర్‌లో ఆరుగురు మావోయిస్టులు మృతి చెందారు. సుకుమా జిల్లాలో డిసెంబర్ 31న జరిగిన ఘటనలో ఒక కానిస్టేబుల్ మృతి చెందారు. ఛత్తీస్‌గఢ్ - తెలంగాణ సరిహద్దుల్లోని ములుగు జిల్లాలో జనవరి 18న జరిగిన ఘటనలో ముగ్గురు మావోయిస్టులు చనిపోయారని, ఒక గ్రేహౌండ్స్ కానిస్టేబుల్ గాయపడ్డారని బస్తర్ ఐజి పి. సుందర్‌రాజ్ తెలిపారు. మరో ఘటనలో సుకుమా జిల్లాలో మహిళా మావోయిస్టు మృతిచెందారని సుకుమా ఎస్‌పి సునీల్‌శర్మ తెలిపారు. ఈ నాలుగు ఘటనల్లో పదకొండు మంది మావోయిస్టులు, ఒక జవాను మృతి చెందగా అందులో ఐదుగురు మహిళా మావోయిస్టులున్నారు.

### జమ్మూ కశ్మీర్‌లో ప్రెస్ క్లబ్‌కు తాళం

**జ**మ్మూ కశ్మీర్ ప్రెస్‌క్లబ్‌లో ఓ సభ్యుడికి కొవిడ్ సోకిందన్న కారణం చూపి జనవరి 16న పోలీసు రక్షణతో వచ్చిన కొత్త పాలకవర్గం ప్రెస్ క్లబ్‌కు తాళం వేశారు. ఈ చర్యను ఎడిటర్స్ గిల్డ్ ఆఫ్ ఇండియాతోపాటు పలు జర్నలిస్టు సంఘాలు తీవ్రంగా ఖండించాయి. ఇది జమ్మూ కశ్మీర్ పాలకవర్గ కుట్ర అంటూ తీవ్రస్థాయిలో ధ్వజమెత్తిన ఎడిటర్స్ గిల్డ్ కేంద్ర పాలిత ప్రాంతంలో పోలీసు సాయంతో మీడియా అణచివేత కొనసాగుతోందని చెప్పేందుకు ఇది నిదర్శనమని పేర్కొంది. ప్రెస్ క్లబ్ కార్యాలయాన్ని, పాలకపీఠాన్ని జర్నలిస్టుల్లోని ఓ వర్గం పోలీసు సాయంతో జనవరి 15న చేజిక్కించుకోవడం దారుణమని తెలిపింది. ఎటువంటి నోటీసు లేకుండా ప్రెస్‌క్లబ్‌లోకి పోలీసులు చొరబడటం మరింత ప్రమాద కరమని, దీనిపై విచారణ జరపాలని గిల్డ్ డిమాండ్ చేసింది. వీ

### క్షీణిస్తున్న అమెరికా ప్రజాస్వామ్యం

**అ**మెరికాలో ప్రజాస్వామ్యం ఉందా? జో బైడెన్ పాలన ఎలా ఉంది. ప్రస్తుత ప్రభుత్వ పని తీరుపై ప్రజలు ఏమనుకుంటున్నారు అనే కోణంలో సిబిఎస్ న్యూస్ పోల్ సర్వే నిర్వహించి జనవరి 16న విడుదల చేసింది. బైడెన్ పాలన పట్ల సగం మంది అమెరికన్లు విసిగి, నిరాశ చెందారని సర్వే తెలిపింది. 75 శాతం మంది సాధారణ అర్థంలో అమెరికాలో రాజకీయ అస్థిరత కొనసాగుతుందని, 58 శాతం ప్రజాస్వామ్యం పతనమయ్యే దశలో ఉందని, 49 శాతం మంది దేశాన్ని విభజించడానికి బైడెన్ కృషి చేస్తున్నట్లు ప్రజలు అభిప్రాయ పడినట్లు సిబిఎస్ తెలిపింది. సిబిఎస్ సర్వే చేసిన నిర్ధారణలు 1) అమెరికాలో ప్రజాస్వామ్యం డబ్బు రాజకీయాల ఆటగా మారింది. 2) పేరుకు 'ప్రతి వ్యక్తికి ఒక ఓటు'. కానీ 'మైనారిటీ ఉన్నత వర్గాల పాలన' జరుగుతోంది. 3) పాతుకుపోయిన జాత్యహంకారం. 4) పేరుకే వాక్ స్వాతంత్ర్యం. 5) ప్రపంచాన్ని దిగ్భ్రాంతికి గురిచేసిన కాపిటల్ హిల్ అల్లర్లు. 6) ప్రజాస్వామ్యం పేరుతో ఇతర దేశాల అంతర్గత వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడం అమెరికాకు అలవాటుగా మారింది. పనిచేయని ప్రజాస్వామ్యం విశ్వాస సంక్షోభాన్ని ప్రేరేపిస్తుంది.

### ఉక్రెయిన్ సరిహద్దులో యుద్ధ మేఘాలు

**ఒ**కప్పుడు సోవియట్ యూనియన్ అంతర్భాగమైన ఉక్రెయిన్ 1991లో స్వతంత్ర దేశంగా ఏర్పడింది. 2014లో రష్యన్ దళాలు ఉక్రెయిన్‌లోని క్రిమియా ప్రాంతాన్ని ఆక్రమించింది. అప్పటి నుంచి ఇరు దేశాల మధ్య యుద్ధ వాతావరణం నెలకొని ఉంది. ఈ ఉద్రిక్తతల పట్ల పాశ్చాత్య దేశాలు తీవ్ర ఆందోళన వ్యక్తం చేస్తున్నాయి. వివాదాలు పెరిగి యుద్ధానికి దారి తీస్తే, దాని మంటలు యూరోప్ మొత్తానికి అంటుకుంటాయని, ఆందోళన పడుతున్నాయి. ప్రస్తుతం ఉక్రెయిన్ సరిహద్దులో ట్యాంకులు, ఫిరంగిదళాలతో పాటు లక్ష మంది సైనికులను రష్యా మోహరించింది. ఉక్రెయిన్‌పై రష్యా యుద్ధాన్ని ప్రకటిస్తే "తీవ్ర ఆర్థిక పరిణామాలు" చోటుచేసుకుంటాయని అమెరికా, దాని నాటో మిత్రదేశాలు హెచ్చరిస్తూనే ఉక్రెయిన్ ప్రత్యేక బలగాలకు అమెరికా శిక్షణ ఇస్తోంది. నాటో సైన్యాలు ఉక్రెయిన్ పరిసరాల్లో తిష్ట వేశాయి. రష్యా తన దౌత్య సిబ్బందిని ఉక్రెయిన్ నుంచి ఉపసంహరించడం ప్రారంభించింది.

### ఐరాస భద్రత మండలిలో కొత్తగా ఐదు దేశాలు

**ఐ**క్యరాజ్యసమితి భద్రత మండలి సభ్యులుగా రెండేళ్ల కాలానికి జూన్‌లో ఎన్నికైన అల్బేనియా, బ్రెజిల్, గబాన్, ఘన, యూఎఇ దేశాలు జనవరిలో బాధ్యతలు చేపట్టాయి. ఆ దేశాలకు చెందిన రాయబారులు తమ జాతీయ పతాకాలను ఇతర సభ్య దేశాల జాతీయ జెండాల పక్కన ప్రతిష్టించారు. 15 మంది సభ్యులుండే ఐరాస భద్రతా మండలిలో అమెరికా, చైనా, ఫ్రాన్స్, రష్యా, బ్రిటన్‌లు వీటో అధికారం గల శాశ్వత సభ్య దేశాలు.

### సూడాన్‌లో రాజ్యాంగ సంక్షోభం

**మూ**డు దశాబ్దాలుసూడాన్‌ను ఏలిన ఇస్లామిక్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజాస్వామ్యవాదులు పెద్దఎత్తున ఉద్యమించడంతో ఆ ప్రభుత్వాన్ని సైన్యం 2019లో కూలదోసింది. ఐక్యరాజ్యసమితి మాజీ అధికారి హమ్‌దోక్ ప్రధానిగా తాత్కాలిక ప్రభుత్వ ఏర్పాటుకు అంగీకారం కుదిరింది. సైన్యానికీ, ప్రజాస్వామ్యవాదులకూ మధ్య నెలకొన్న ప్రతిష్టంభనను తొలగించడంలో తాను విఫలమయ్యానంటూ ప్రధాని పదవికి హమ్‌దోక్ గత అక్టోబరులో రాజీనామా చేశారు. దీంతో సైన్యం పూర్తి అధికారాన్ని తమ గుప్పిట్లోకి తీసుకోవడంతో సూడాన్‌లో రాజ్యాంగ సంక్షోభం ఏర్పడింది.

### పాకిస్తాన్‌కు చైనా జెట్ విమానాలు

**చై**నా తయారీ జే-10సీ జెట్ విమానాల పుల్ స్క్వాడ్రన్ (25 విమానాలు)ను పాకిస్తాన్ కొనుగోలు చేసింది. ఇండియా ఇటీవల జరిపిన రఫేల్ విమానాల కొనుగోలుకు బదులుగా చైనా జెట్లను కొన్నామని పాక్ మంత్రి షేక్ రషీద్ అహ్మద్ చెప్పారు. అన్ని రకాల వాతావరణాల్లో ప్రయాణం చేయగల ఈ జెట్ విమానాలు వచ్చే ఏడాది మార్చి 23న పాకిస్తాన్ డే రోజున కవాతులో పాల్గొంటాయని చెప్పారు. ప్రస్తుతం పాక్ వద్ద యుఎస్ తయారీ ఎఫ్-16 విమానాలున్నాయి. వీటికన్న మెరుగైనా చైనా జెట్లను ఇప్పుడు కొనుగోలు చేసింది. వీటి ఖరీదు ఒక్కోటి సుమారు 3.5 కోట్ల డాలర్లు.

### పీకల్లోతు అప్పుల్లో కూరుకుపోయిన శ్రీలంక

**క**రోనా కారణంగా ప్రపంచవ్యాప్తంగా ఉన్న అన్ని దేశాలు అతలాకుతలం అవుతున్నాయి. అలా శ్రీలంక దేశం పూర్తిగా దివాళా తీసే పరిస్థితికి వచ్చింది. శ్రీలంక దివాళా తీసేందుకు శ్రీలంక అధ్యక్షుడు రాజపక్స్ తీసుకున్న వివాదాస్పద నిర్ణయాలు కూడా కారణమయ్యాయి. రైతులను ఆర్గానిక్ పార్మింగ్ వైపు మళ్లించడం కూడా శ్రీలంకకు ఈ పరిస్థితి దాపురించడానికి ప్రధాన కారణంగా చెబుతున్నారు. శ్రీలంకలో టూరిజం మీద ఆధారపడి జీవించే వారే చాలా ఎక్కువ. కానీ కరోనా విజృంభణ వల్ల టూరిజం రంగం కుదేలయిపోయింది. తిరిగి ఎప్పుడు మొదలవుతుందో కూడా తెలియకుండా అయిపోయింది. దీంతో శ్రీలంక ప్రభుత్వం విపరీతంగా అప్పులు చేసింది. ఈ దెబ్బకు అందరి ఉద్యోగాలు ఊడిపోయి వారంతా రోడ్డున పడ్డారు. వ్యవసాయ రంగం కూడా దేశంలో తీవ్ర సంక్షోభాన్ని ఎదుర్కొంది. కరోనా సమయంలో అధిక వడ్డీలకు వివిధ దేశాల నుంచి తెచ్చిన అప్పులు తడిసి మోపెడయ్యాయి.

### అణ్వాయుధ వ్యాప్తి నివారణకు ఐక్యగళం

**అ**మెరికా, రష్యా, చైనా, ఫ్రాన్స్, బ్రిటన్(పి-5) దేశాల మధ్య సంబంధాలు క్షీణిస్తూ ఉద్రిక్తతలకు దారి తీస్తున్న వేళ... అంతర్జాతీయ సమాజం స్వాగతించదగిన ఓ కీలక పరిణామం ఇటీవల చోటు చేసుకుంది. అణు యుద్ధాలు నివారించాలని, అణ్వాయుధ వ్యాప్తిని నిలువరించాలని ఐదు దేశాలు ముక్త కంఠంతో తీర్మానించాయి. అయితే, అణ్వాయుధాలు మనుగడలో ఉన్నంతకాలం అణుయుద్ధ అవకాశాలు ఉంటాయి. అగ్రరాజ్యాలు తమ వద్ద ఉన్న అణ్వాస్త్రాలను ధ్వంసం చేసి తమ చిత్తశుద్ధిని చాటుకోవాలి.

### అబుదాబిపై డ్రోన్ దాడులు

**యె**మన్‌కి చెందిన హౌతీ తీవ్రవాదులు అబుదాబి విమానాశ్రయం సమీపంలో చమురు క్షేత్రాలపై డ్రోను దాడులు జరిపారు. రెండు చోట్ల పేలుళ్లు జరిగి, పెద్ద ఎత్తున మంటలు చెలరేగాయి. ఈ ఘటనల్లో ఇద్దరు ఇండియన్లు, ఒక పాకిస్తానీ చనిపోయారు. మరో ఆరుగురు గాయపడ్డారు. ప్రతీకారంగా సౌదీ సంకీర్ణ దళాలు మరుసటి రోజు హౌతీ తీవ్రవాదుల స్థావరాలపై అగ్ని వర్షం కురిపించాయి.

### మనిషికి పంది గుండె

**వై**ద్యశాస్త్రంలో కీలక మైలురాయి చోటుచేసుకుంది. వైద్యులు మొదటిసారిగా పంది గుండెను మనిషికి అమర్చారు. అమెరికాలోని యూనివర్సిటీ ఆఫ్ మేరీలాండ్ మెడికల్ సెంటర్ నిపుణులు ఈ ఘనత సాధించారు. ఈ శస్త్ర చికిత్స ఫలిస్తుందా అని ఇప్పుడే చెప్పలేమని, అయితే ప్రాణాంతక పరిస్థితుల్లో జంతువుల అవయవాలను మానవులకు అమర్చేందుకు దశాబ్దాలుగా సాగుతున్న ప్రయత్నాల్లో ఇదొక ముందడుగని వారు పేర్కొన్నారు. వీ

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 243 - February 2022 ● **ISSN 2231-6892**
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/01/2022 ● Postal Regn. No. HD/1100/2020-22

Date of Posting : 29th, 30th

# 'Save Veekshanam' Campaign

## వీక్షణంకు చేయూతనివ్వండి!

తెలుగు సమాజంలో రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణలో రెండు దశాబ్దాలుగా అసాధారణమైన కృషి చేస్తున్న మాసపత్రిక వీక్షణం ఆర్థిక పరిస్థితి ప్రమాదకరమైన స్థితికి చేరుకున్నది. కొవిడ్ లాక్ డౌన్ కు ముందు చందాల ద్వారా, పుస్తకాల అమ్మకాల ద్వారా, ప్రకటనల ద్వారా వచ్చిన ఆదాయానికి దాతల విరాళాలు జత కలిసి పత్రిక నడుస్తుండేది. ఏడాదిన్నరగా కొవిడ్‌తో జనజీవితమే సంక్షోభమయంగా ఉన్నందువల్ల చందాలు తగ్గిపోయాయి, పుస్తకాల అమ్మకాలు పూర్తిగా ఆగిపోయాయి, ప్రకటనలు రావడం లేదు. కేవలం దాతల విరాళాల మీదనే పత్రిక ఆధారపడవలసిన స్థితి వచ్చింది. ఏడాదిన్నరగా నెలకు యాభై వేల రూపాయల లోటుతో, అప్పులతో పత్రిక నడుస్తున్నది. ఇటువంటి స్థితిలో పత్రిక నడపలేమని నిర్వాహకులు భావిస్తున్నప్పటికీ, తెలుగు సమాజానికి ఇటువంటి ఆలోచనాస్ఫోరక పత్రిక చాల అవసరమని, ప్రస్తుత సంక్షోభ స్థితిలో ఆ అవసరం మరింత పెరుగుతున్నదని, పత్రికను ఎట్టి పరిస్థితిలోనూ ఆపగూడదని పాఠకులు, మిత్రులు, అభిమానులు కోరుతున్నారు. పందొమ్మిది సంవత్సరాలలో, 237 సంచికలలో, నాలుగున్నర వేల వ్యాసాలతో వీక్షణం ప్రాంతీయ, దేశీయ, అంతర్జాతీయ పరిణామాలెన్నిటినో విశ్లేషించి పాఠకుల అవగాహనలు పెరగడానికి తోడ్పడింది. ఆ మహత్తర కృషి ఆగిపోగూడదని మిత్రులు కోరుతున్నారు.

ఈ గడ్డు కాలాన్ని అధిగమించడానికి మరొకసారి మీదగ్గరికి రాక తప్పడం లేదు. మీరు ఇవ్వగలిగిన విరాళం ఎంతైనా సరే, వీక్షణం మనుగడకు అది ఉపయోగపడుతుంది. తెలుగు సమాజంలో ఒక అత్యవసరమైన ప్రయత్నానికి మీ వంతు చేయూత ఇవ్వండి. మీ వీలును బట్టి, మీ శక్తిని బట్టి మీ విరాళం ఎంత స్వల్పమైనా, ఎంత భూరి విరాళమైనా సరే. వీక్షణం మనుగడకు మీ చేయూతనివ్వండి. వీక్షణం చిరకాలం జీవించేందుకు తోడ్పడండి.

### విరాళాలు పంపడానికి వివరాలు

**వీక్షణం**

చెక్/డిడి ద్వారా: వీక్షణం, జి1, మైత్రీ రెసిడెన్సీ,
3-6-394, స్ట్రీట్ నం. 3, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500029,
ఫోన్ : 73307 95849, ఇమెయిల్ : veekshanam2003@gmail.com,
www.veekshanam.wordpress.com

*ఎలక్ట్రానిక్ ట్రాన్స్ ఫర్ ద్వారా:*

*Veekshanam,*
*Account No. 013911011002175,*
*Union Bank of India, Gagan Mahal Brach, Hyderabad.*
*IFSC Code: UBIN0801399*

**ఈ అకౌంట్ నంబర్‌తో ఎలక్ట్రానిక్ ట్రాన్స్‌ఫర్‌తో పాటు**
**గూగుల్ పే, ఫోన్ పే, పేటీఎంల ద్వారా కూడా చెల్లించవచ్చు.**

If undelivered please return to:

**VEEKSHANAM**

Mytri Residency, 3-6-394, St. No. 3,
Himayatnagar, Hyderabad - 500 029.
Phone: 73307 95849

To:
Mr./Mrs.________________________________

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at NAVYA PRINTERS, 2-3-655/C/16/B, Durga Nagar, Amberpet, Hyderabad -500013 (New Declaration filed) for Charitha Impressions (as per RNI records) and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao